

# విషయానుక్రమణిక

## 4 ఏప్రిల్ 1951





# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder: K. NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 29

వికృతి సంవత్సర ఫాల్గున బహుళ త్రయోదశి బుధవారము


## కాశ్మీర్: భద్రతామండలి తీర్మానం 

[ సీతారామ్ ]



కాశ్మీర్ సమస్యపై ఆంగ్లో-అమెరికన్ తీర్మానాన్ని భద్రతామండలి ఆమోదించింది. ఈ తీర్మానాన్ని అంగీకరించడం అంటే భారతదేశానికి అగౌరవమని ప్రధాని పండిట్ నెహ్రూ ఆగ్రాలో అన్నారు. బ్రిటిష్, అమెరికన్ ప్రతినిధులకు అసలు కాశ్మీర్ సమస్య బోధపడలేదనైనా భావించాలని లేదా తెలిసేవారు అపార్థాలు కల్పిస్తున్నట్లు భావించాలని చెప్పారు. భద్రతామండలి ఆమోదం ప్రమాదకరమైనదని పార్లమెంట్‌లో చెప్పారు.

భద్రతామండలిలో కాశ్మీర్ సమస్య గురించిన చర్చలో వివిధదేశాల ప్రతినిధుల ధోరణి వింతవింత రంగులతో బయటపడింది. రష్యన్ ప్రతినిధి ఉపన్యాసాలన్నిటినీ అతిశ్రద్ధగా విని వివరాలను వ్రాసుకున్నాడు. కాని తన అభిప్రాయాన్ని తెలపలేదు. వోటింగులో పాల్గొనలేదు. యుగోస్లావియా ప్రతినిధి ఒక్కడే వాస్తవ స్థితిని కొంత గ్రహించాడు. వివాద పరిష్కారం ఉభయపక్షాలమధ్య సామరస్య ధోరణిలో రాజీమార్గాన జరగవలసిందేనని చెప్తూ వోటింగులో పాల్గొనలేదు. మిగతా ఎనిమిది దేశాల ప్రతినిధులతో బ్రిటిష్ అమెరికన్ ప్రతినిధుల ఉపన్యాసాలు భారతదేశంపట్ల వారి వైఖరిని స్పష్టపరుస్తున్నాయి. ఐక్యరాజ్య సమితిని ధిక్కరించి, జాతీయదురహంకారంతో అమానుష కార్యాలకు వెనుదియ్యని దక్షిణాఫ్రికాపట్ల సహనం, భారతదేశంపట్ల అసహనం వారి రాజకీయ దుస్తంత్రాలను స్పష్టపరుస్తున్నాయి. వారి వాస్తవనైజం బయటపడుతోంది. మిగతా ఆరు రాజ్యాల ప్రతినిధులూ చిలకలమాదిరిగా బ్రిటిష్, అమెరికన్ ప్రతినిధుల ఉపన్యాసాలను ఒప్పచెప్పారు.

ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంకింద అంతర్జాతీయ సైనికబలం నిర్మించడానికి రష్యా నిరాకరించిందంటే కారణం బోధపడుతూనే ఉంది. సమితిలో రాజ్యాలను కూడగట్టుకుని ఆంగ్లో-అమెరికన్ వర్గం ఎంత దౌర్జన్యబుద్ధితో ఈ బలాన్ని దుర్వినియోగపరచగలదో వేరే చెప్పనవసరంలేదు. ఎటామిక్ కంట్రోల్ విషయమైకూడా అంతర్జాతీయాధికార సంస్థను నిర్మించాలని అమెరికా సూచించడంలో ఎంత తంత్రం ఇమిడి ఉందో రష్యా ముందే గ్రహించగలిగింది. ఐక్యరాజ్యసమితి సమస్యలన్నిటిలోనూ ఆంగ్లో-అమెరికన్ వర్గం అవలంబిస్తున్న దౌర్జన్య విధానాన్ని నిరోధించడానికి రష్యాకు వీటో అధికారం తప్పనిసరా ఉన్నది. ఈ సమస్యలలో రష్యావాదం ఆధార రహితంకాదని కాశ్మీర్ చర్చలే నిరూపిస్తున్నాయి.

కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి తీర్మానం శాంతికి భంగకరమైనదనీ, భారతదేశానికీ కాశ్మీర్ ప్రజలకీ అన్యాయం చేస్తున్నదనీ పండిట్ నెహ్రూ భారత పార్లమెంట్‌లో చెప్పారు. పాకిస్తాన్‌ను, పాకిస్తాన్ పట్ల సానుభూతిపరులనూ తృప్తిపరచడంకోసం కాశ్మీర్‌లో ప్రభుత్వాన్ని తొలగించడం జరగబోదనీ, అన్యులపాలనకు ఒప్పగించడం అసలే జరగబోదనీ నెహ్రూ స్పష్టపరిచారు.

అంతర్జాతీయ వ్యవహార విధానం ప్రకారం సక్రమమైన అంశాలను బ్రిటన్, అమెరికాలు, భద్రతామండలి అక్రమంగా పరిగణిస్తున్నాయి. మొదట సమ్మతించిన అంశాలను ఇప్పుడు నిరాకరించి, తద్విరుద్ధంగా సమస్యా పరిష్కారానికి నడుము కట్టాయి. కాశ్మీర్ సంరక్షణ బాధ్యత భారతప్రభుత్వంపైనే ఉన్నట్లు అప్పుడు అంగీకరించి ఇప్పుడు నిరాకరిస్తున్నాయి. జనవాక్య నిర్ధారణ అధికారిని (ప్లెబిసైట్ ఎడ్మినిస్ట్రేటర్) నియమించగల అధికారం కలదిగా అప్పుడు పరిగణించిన కాశ్మీర్ (షేక్ అబ్దుల్లా) ప్రభుత్వాన్ని, ఇప్పుడు జనవాక్య నిర్ధారణ నిమిత్తం తొలగించి విదేశీయుల అధికారాన్ని నెలకొల్పాలంటున్నాయి. కాశ్మీర్ ప్రజల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఆక్రమించుకొన గోరి దురాక్రమణ జరిపిన పాకిస్తాన్‌పై ఫిర్యాదుచేసిన భారతప్రభుత్వాన్ని తాము పంపే ప్లెబిసైట్ ఎడ్మినిస్ట్రేటర్‌కు

దేశాన్ని వొదిలి సైన్యాలను ఉపసంహరించుకోవాలని బలవంత పెడుతున్నారు. ఇదంతా చూసినట్లయితే బ్రిటన్, అమెరికాలు పాకిస్తాన్‌కు అండగాచేరి కుట్రపన్నుతున్నాయనే అనుమానం తోచకమానదు. ఒకదానివెంట ఒకటి పాకిస్తాన్ కోరిన సదుపాయాలను భద్రతామండలి తీర్మానాల ద్వారా బ్రిటన్ అమెరికాలు చేకూర్చుతున్నాయి.

ప్రస్తుత తీర్మానం కాశ్మీర్‌లో రాజ్యాంగ పరిషత్తును నిర్మించరాదని భారతదేశాన్ని ఆదేశిస్తోంది. ఈ తీర్మానం ప్రకారం ఇప్పుడు మరొక మధ్యవర్తి నియమించబడతారు. పూర్వ తీర్మానాలనూ, ఒడంబడికలనూ అనుసరించి కాశ్మీర్‌లో ఉభయప్రాంతాలనుండీ సైన్యాలను ఉపసంహరింపచేసే కర్తవ్యం ఈ మధ్యవర్తికి విధించబడింది. అంటే పూర్వ మధ్యవర్తి సర్ ఓవెన్ డిక్సన్ గతసంవత్సరం రాజీ సమాలోచనల ద్వారా దేన్ని సాధించడానికి ప్రయత్నించి విఫలుడైనాడో, దానిని భారతదేశం ఇష్టపడినా సరే ఇష్టపడకపోయినా సరే అధికార పురస్సరంగా సాధించడానికి మరొక 'మధ్యవర్తి' లేక ఐక్యరాజ్యసమితి ప్రతినిధి వస్తారన్నమాట. కాని డిక్సన్ సామరస్య మార్గాలలో సాధించలేకపోయిన దానిని కొత్త మధ్యవర్తి అధికారం చలాయించి అసలే సాధించలేడని వేరే చెప్పనవసరం లేదు. ఏయే అంశాలవల్ల ఈ కొత్త మధ్యవర్తి సైన్యాల ఉపసంహారణను సాధించలేడో ఆ అంశాలను పరిష్కరించడానికి అంతర్జాతీయ న్యాయసంస్థ ఒక పరిష్కర్తనో లేక ముగ్గురు పరిష్కర్తలనో నియమించాలని ఆంగ్లో-అమెరికన్ తీర్మానం విధిస్తోంది. ఆ పరిష్కర్తలు చెప్పిన తీర్పును భారత ప్రభుత్వం శిరసావహించవలసి ఉంటుందన్నమాట. ఈ కార్యక్రమం భారతప్రభుత్వం సహకారం లేక కొనసాగడం అసంభవం. అంతర్జాతీయ వివాదాలలో మధ్యవర్తిత్వం విఫలమైతే పరిష్కర్తల్ని నియమించి తీర్పులు చెప్పించే పద్ధతిని ఐక్యరాజ్యసమితి నియమావళి విధిస్తున్నమాట నిజమే. కాని శాంతి, దేశరక్షణాలకు భంగం కలిగే ప్రమాదమున్నప్పుడు, పరిష్కర్తల నియామకానికి రాజ్యాలు నిరాకరించవచ్చుననికూడా నియమావళి అనుమతిస్తున్నది. రష్యా, చీనాలకు పొరుగునున్న కాశ్మీర్‌కి పరిష్కర్తల నిర్ణయాలనుబట్టి అన్యదేశాల సైనికబలాలను తీసుకురావడం ప్రమాదకరం. అన్యజాతీయుల సైన్యాలను తీసుకువచ్చినట్లయితే కాశ్మీర్‌లోనే కాదు, భారతదేశంలోకూడా కల్లోలం తథ్యం. అందువల్ల సమితి నియమావళిననుసరించే భారత ప్రభుత్వం నిరాకరించక తప్పదు. అప్పుడు కాశ్మీర్ దేశాన్ని పాకిస్తాన్ సైన్యాల దురాక్రమణ ప్రమాదం నుంచీ, పరాయి మూకలదాడుల ప్రమాదం నుంచీ రక్షించడానికి భారతి సైన్యాలు ఉండక తప్పదు. పాకిస్తాన్ దురాక్రమణను నిరోధించి, అజాద్ కాశ్మీర్ సైనిక దళాల పేరున నిర్మించబడిన 32 దళాలనూ నిరాయుధంచేసి తొలగించకపోయినట్లయితే, భారత ప్రభుత్వం తమ సైన్యాలను ఉపసంహరించడంవల్ల, భద్రతామండలి ప్రస్తుత తీర్మానమూ, మధ్యవర్తి నియామకమూ వ్యర్థం కాక తప్పదు. కాశ్మీర్ సంరక్షణ బాధ్యతను భారత సైన్యాలకు ఒప్పగించి, దేశంలో సుస్థిరమైన ప్రభుత్వమూ, శాంతీ స్థాపించబడినప్పుడే ప్లెబిసైట్ సాధ్యపడుతుంది. భారత సైన్యాలను ఉపసంహరింప చేయాలంటే పాకిస్తాన్ సైన్యాలను తరలించి ఆజాద్ కాశ్మీర్ సైన్యాల బలాన్ని తొలగించడం

# సంస్కృతి: స్వేచ్ఛ



వనమహోత్సవం దిగ్విజయంగా జరిపించి
మంత్రిగారు మాట్లాడారు సంస్కృతిగురించి;
త్రింశత్కోటి దరిద్రుల ఆకలిమంటలు
తీర్చేందుకు పండిస్తారు సంస్కృతిపంటలు.

కళను గూర్చి ఉపన్యసించారు కేయమ్మున్షీ!
విన్నావా ఆకలని కేకలేసే మామూల్మన్షీ?
ఆహారపు విలువలు లేకపోతేనేమి?
ఆధ్యాత్మిక విలువలకు లేదు మనకు లేమి.

ఆకులలములు తిని మనే జనులదేశం
ప్రపంచానికిస్తోంది సందేశం:
"సాంస్కృతిక స్వేచ్ఛను నిరాకరించడం
మానవుడి దివ్యత్వాన్ని కీటకీకరించడం."

కళ ప్రచారం కోసం కాదని
ప్రచారం చేస్తున్నారు కాని,
భారత రామాయణాలు పూజించే మంత్రిగారు
వాటిలోని ఆర్షత్వ ప్రచారాని కేమంటారు?

"కదితేదీ, కదిలించేదీ,"
"మనదీ ఒక బ్రతుకేనా?" అని ప్రశ్నించేదీ,
కళ కాకపోయేట్లయితే
నష్టం లేదు కళ లేకపోతే.

—సవ్యసాచి—

అవసరం. ఈ సత్యాన్ని గుర్తించనంతవరకూ భద్రతామండలి కాశ్మీర్ సమస్యను ముఖ్యంగా ఇప్పుడు సైనికోపసంహరణ సమస్యను పరిష్కరించడం అసంభవం. ఈ సత్యాన్ని గుర్తించక, సమస్యను పరిష్కరించ పూనుకున్నట్లయితే తిరిగి యుద్ధప్రమాదం తప్పదు. ఈమారు పాకిస్తాన్ దాడి జరిపినట్లయితే, ప్రస్తుత తీర్మానాల దృష్ట్యా నిరోధించగల అధికారం భద్రతామండలికి ఉండదు. అప్పుడు పాకిస్తాన్ సేనలను నిరోధించే భారతదేశంపైన భద్రతామండలి దురాక్రమణ నేరాన్ని మోపవలసివస్తుంది!

పాకిస్తాన్‌కి ఇటువంటి అవకాశ మివ్వడానికే బ్రిటన్ అమెరికాలు తంత్రం పన్నుతున్నాయని అనుమానించినా తప్పు లేదు.

## కులవిచక్షణ:

విద్యాలయాల్లో విద్యార్థుల్ని ప్రవేశపెట్టడంకోసం కులవిచక్షణ పాటించడం భారతరిపబ్లిక్ రాజ్యాంగ నియమాలకు విరుద్ధమని సుప్రీంకోర్టు నిర్ణయిస్తున్నట్లు చీఫ్ జస్టిస్ తెలిపారు. త్వరలోనే తీర్పు కూడా వస్తుంది. మద్రాసు ప్రభుత్వం తరఫున ఎడ్వొకేట్ జనరల్ వినిపించిన వాదంలో ముఖ్యాంశా లేమిటంటే:

1. ప్రాథమిక హక్కులకి భంగం కలిగినాసరే, రాజ్యాంగ నియమాలలోని నాలుగో అధ్యాయంలో వివరించబడిన ప్రకారం రాష్ట్రప్రభుత్వాలు పాలనవిధాన సూచనల్ని అమలు జరపాలి. ప్రాథమిక స్వత్వాలకు సంబంధించిన మూడో అధ్యాయంలో 29 (2) నియమం ప్రకారం కేవలం మతం, జాతి, కులం భాషల భేదాల్నిబట్టి విద్యాలయాల్లో ఎవరికీ ప్రవేశం నిరాకరించ కూడదని నిషేధించింది. నాలుగో అధ్యాయంలో నియమాలన్నీ రాష్ట్రప్రభుత్వాలూ కేంద్రప్రభుత్వమూ వహించవలసిన బాధ్యతల్ని వివరిస్తాయి. వీనిని సాధించలేకపోతే చేసేదేమీ లేదు. విరుద్ధంగా మాత్రం పరిపాలించ కూడదు. ఈ నియమాల్ని సూచనలంటే బాగుంటుంది. వీటిని న్యాయస్థానాల సహాయంతో వర్తింప చెయ్య కూడదు. విద్య, ఆర్థికవిషయాలలో దుర్బలస్థితిలో ఉన్న వర్గాల్ని, ముఖ్యంగా షెడ్యూల్డు కాస్ట్ జాబితాలోనివారిని ఉద్ధరించడానికి ప్రభుత్వాలు కృషి చెయ్యాలనీ సమాజంలో అన్యాయం జరక్కుండా చూడాలనీ 46 వ నియమం విధిస్తోంది. ఈ రెండు నియామాల్లోనూ 46 వ నియమాన్నే పాటించాలని మద్రాసుప్రభుత్వం వాదన. కాని ఈ నియమం కేవలం సూచనేననీ దీన్ని అమలు జరపవలసిన కర్తవ్యం ప్రభుత్వంపైన ఉన్నప్పటికీ, 29 (2) వ నియమాన్ని మాత్రం అతిక్రమించకూడదనీ సుప్రీంకోర్టులో ఒక జడ్జి అన్నారు.

2. అసలు 29 (2) నియమాన్ని అతిక్రమించనేలేదని వాదించింది మద్రాసు ప్రభుత్వం. కేవలంకులవిచక్షణనుబట్టి ప్రవేశపెడితే తప్పు కావచ్చుకాని, అదొక్కటే కారణం కాదనీ, దానితోపాటు ఇతర కారణాలుకూడా ఉన్నాయనీ, అందువల్ల ఆ నియమాన్ని అతిక్రమించినట్లు పరిగణించ కూడదనీ ప్రభుత్వం వాదించింది. కాని మతం జాతి కులంభాషల్లో ఏ భేదాన్ని బట్టి కూడా విచక్షణ చెయ్యడం ఈ నియమానికి విరుద్ధమని జడ్జీల అభిప్రాయం.

3. ప్రజల్లో వెనకపడ్డవర్గాల్ని రక్షించడంకోసం ఈ కులవిచక్షణ పద్ధతి అనుసరించబడుతోందనీ, అందరికీ న్యాయం చేకూర్చడమే దీని ఉద్దేశమనీ మద్రాసు ప్రభుత్వం వాదించింది. కాని వెనకపడ్డవాళ్లు అంటే మన రాజ్యాంగంలో కొన్ని వర్గాలవారిని గురించే చెప్పబడిందనీ, అవి ఏయేవర్గాలో ఇంకా రిపబ్లిక్ అధ్యక్షులు నిర్ణయించవలసి ఉందనీ, ఈలోగా కొందర్ని పట్టుకుని వెనకపడ్డవాళ్లని చెప్పడానికి ప్రభుత్వానికి హక్కు లేదనీ జడ్జీల అభిప్రాయం. వెనకపడ్డవాళ్లు అంటే షెడ్యూల్డు తరగతులవారు, అనాగరిక జాతులవారు అని ఇదివరలో పరిగణించబడేది.'

హరిజనులు, కోయలు మొదలైనవారిని ఉద్ధరించడంకోసం ఉద్దేశించబడిన నియమాన్ని తీసుకొచ్చి మనప్రభుత్వం బ్రాహ్మణేతర విద్యార్థులకి ఆట్టే చదువంటకపోయినా పై విద్యాలయాల్లో ప్రవేశమివ్వడానికి ఉపయోగిస్తోంది(హరినుజనులికి చేసే ఉపకారం మాత్రం సున్నే) నిష్పత్తి ప్రకారం రెండుసీట్లు బ్రాహ్మణ విద్యార్థులకి ప్రత్యేకించారు కాబట్టి, బ్రాహ్మణుల్ని కూడా వెనకపడ్డవాళ్లలో జతచేసినట్లుందని విద్యార్థుల తరఫున వాదించిన సోమయ్యగారన్నారు. మద్రాసు ప్రభుత్వం వాదననిబట్టి చూస్తే బ్రాహ్మణులు మినహా మిగతా హిందువు లందరూ వెనకపడ్డవాళ్లేనని అల్లాడి కృష్ణస్వామిగారన్నారు.

ఉద్యోగాల నియామకానికి సంబంధించిన కులవిచక్షణ పద్ధతిని గురించి కూడా శ్రీ బి. వెంకటరమణగారి పిటిషన్ పైన సుప్రీంకోర్టు తీర్పు ఇస్తుంది.

## అరాచకానికి ప్రోద్బలం:

సుప్రీంకోర్టు నిర్ణయం ఎలా ఉంటుందో తేలిపోయిన తరవాత మద్రాసు మంత్రివర్గం ఇప్పుడేం చెయ్యాలని తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టింది. ఇటువంటి నిర్ణయంవల్ల కలిగే బాధని, అంటే తక్కువ మార్కులు తెచ్చుకునే బ్రాహ్మణేతర విద్యార్థులికిబదులు, ఎక్కువ మార్కులు తెచ్చుకునే బ్రాహ్మణ విద్యార్థుల్ని ప్రవేశపెట్టవలసి వస్తున్న బాధని ఎలా నివారించుకోవాలో, ప్రభుత్వం ఆలోచిస్తోందని మంత్రి మాధవమీనన్‌గారు (ఇంకా సుప్రీంకోర్టు తీర్పు రాకముందే) మద్రాసు శాసనసభలో చెప్పారు.

నిజంగా అధోగతిలో ఉన్న హరిజనులికి, ఇతర షెడ్యూల్డు తరగతులవారికీ నోట్లో కరక్కాయకొట్టి, వాళ్ల పేరు చెప్పుకుని ఉద్యోగాలూ విద్యాలయాల్లో స్థానాలూ ఆక్రమించుకుంటున్న మంత్రులికి రాజ్యాంగంలోనే తప్పు కనిపిస్తోందిట. మన రిపబ్లిక్ జాతి మత కుల భేదాల్ని పాటించకుండా అందరికీ సమానహక్కులు, సమాన అవకాశాలూ ఇవ్వడం తప్పుగా ఉంది. వారికి అందువల్ల జమీందారీల రద్దుకోసం ఎలాగో రాజ్యాంగ నియమాల్ని సవరణ చెయ్యదల్చుకున్న భారత ప్రభుత్వాన్ని అదేచేత్తో కులవిచక్షణ మంచిదేననీ, అవసరమనీ ఒప్పుకుంటూ రాజ్యాంగాన్ని, (29 (2) నియమాన్ని) సవరణ చెయ్యాలని కోరడానికి నిశ్చయించారట. అలా ప్రార్థిస్తూ మద్రాసు శాసనసభలో తీర్మానం ఒకటి ప్రవేశపెట్టబడుతుంది.

"దేశంలో ఆకలితో జనం మాడిపోతున్నారు. ప్రజల్లో అసంతృప్తి వ్యాపిస్తోంది. "ప్రజలింక ఎంతమాత్రం సహించరు" అని కమ్యూనిస్టు లెవరైనా అన్నట్లయితే, వెంటనే వాళ్లని దేశంలో అరాచకం రెచ్చగొడుతున్నారంటూ నోళ్ళునొక్కి ఖైదులో పడేస్తుంది మన ప్రభుత్వం. ఇప్పుడు కులవిచక్షణని పాటించకపోయినట్లయితే దేశంలో కల్లోలం బయలుదేరుతుందని కొందరు మంత్రులంటున్నారంటే వీరి నేమనాలి? కులవిచక్షణ నిలబెట్టుకోడంకోసం, దేశంలో అరాచకాన్ని రెచ్చగొట్టాలని మంత్రులు ప్రయత్నిస్తున్నారా?

ఇట్టి రాజ్యాంగ నియమసవరణ న్యాయమని సమర్థించుకోలేక, భారతప్రభుత్వంచేత ఒప్పించలేరనే

(46-వ పేజీ చూడండి)

# ★ డైరీ ★

**సోమవారం, 1951 మార్చి 26 :**

—21 అమెరికన్ రిపబ్లిక్ ప్రభుత్వాల విదేశాంగమంత్రులు వాషింగ్టన్‌లో అమెరికన్ సహాయ విదేశాంగ మంత్రి డీన్ రస్కు అధ్యక్షతక్రింద సమావేశమైనారు. సభా ప్రారంభకుడు ప్రెసిడెంట్ ట్రూమన్, సోవియట్ రష్యా దురాక్రమణ చర్యలను నిరోధించాలనీ, అమెరికన్ రిపబ్లిక్‌లు పునరాయుధ ధారణ కార్యక్రమాలు ప్రారంభించాలనీ అన్నారు.

—కొరియాలో యుద్ధానికి బలాలు పంపిన 14 దేశాల ప్రతినిధులూ వాషింగ్టన్‌లో సమావేశమై, సమితియొక్క కొరియా యుద్ధాశయాలన నిర్ణయించి ప్రకటనకు సిద్ధపరిచారని లండన్ వార్త తెలుపుతోంది.

—అణువిచ్ఛేద జనిత శక్తిని వినియోగపరిచే విధానమొకటి అర్జెంటినాలో కనిపెట్టబడిందని, అర్జెంటిన్ విజ్ఞాన శాస్త్రవేత్త ఒకడు ప్రకటించారు.

—విద్యా సంస్థలలో విద్యార్థుల్ని ప్రవేశపెట్టడానికి మద్రాసు ప్రభుత్వం ఇంతవరకూ అనుసరిస్తున్న కులనిష్పత్తి విధానం, రాజ్యాంగ నియమాలకు విరుద్ధమని తమ అభిప్రాయమైనట్లు, సుప్రీంకోర్టులో ఛీఫ్ జస్టిస్ తెలిపారు.

—భారత సైన్యంలో 50 వేల మంది బలగాన్ని తగ్గించడానికి ప్రభుత్వం నిశ్చయించినట్లు, పార్లమెంట్‌లో మంత్రి బల్దేసింగ్ గారు ప్రకటించారు.

—సింధియావారు నిర్మించిన ఏడవ సాగరనౌక "జలపుత్ర"కు మంత్రి శ్రీగోపాలస్వామి అయ్యంగార్ విశాఖపట్నంలో జలప్రవేశమహోత్సవం జరిపారు.

—పారిశ్రామికాభివృద్ధికి ఆటంకాలైన 1. ముడివస్తువుల కొరత, 2. యంత్రపరికరాల లేమి తీర్చవలసినది భారత ప్రభుత్వమేననీ, అమెరికన్ ప్రభుత్వంతో రాయబారాలు జరిపి ఈసమస్యలను పరిష్కరించవలసి ఉందనీ, అఖిలభారత పారిశ్రామిక యజమానుల ఏడవ వార్షిక సమావేశంలో (ఎర్నాకులం) శ్రీ యం. విశ్వేశ్వరయ్యగారు చెప్పారు.

—ఏప్రిల్, మే, జూన్ మాసాలలో భారత రిపబ్లిక్‌లోని వస్త్రపు మిల్లులు బంగీలు కట్టే వస్త్రంలో నూరింట 90 వంతులు దేశంలో అమ్మకానికే ప్రత్యేకించాలని భారత ప్రభుత్వం ఆజ్ఞ ఇచ్చింది.

**మంగళవారం, మార్చి 27 :**

—56 గురు కమ్యూనిస్టు నిర్బంధితులపైన తేబడిన 'సేలం సెంట్రల్ జైల్ దొమ్మి' కేసును మద్రాసు ప్రభుత్వం ఉపసంహరించుకుంది. (1950 ఫిబ్రవరి 11 వ తేదీని జరిగిన ఈ దొమ్మిలో పోలీసుల తుపాకి కాల్పుల ఫలితంగా 22 మంది కమ్యూనిస్టు నిర్బంధితులు మరణించారు. ప్రథమ విచారణవల్ల తెలిసిన వివరాలను బహిరంగ పరచడానికి ప్రభుత్వం నిరాకరించింది.)

—కొరియాలో సమితి సైన్యాలు తమ స్థావరాల రక్షణార్థం 38వ అక్షాంశరేఖను దాటవచ్చునే గాని, ఆ సరిహద్దుకి ఉత్తరంగా పెద్ద దాడి జరిపే విషయాన్ని మాత్రం రాజకీయ నిర్ణయాలకు వదలవలసిందేనని అమెరికన్ రక్షణ శాఖామంత్రి జనరల్ మార్షల్ వాషింగ్టన్‌లో ప్రకటించారు.

—ఫిబ్రవరిలో ఫ్రెంచివారితో ఒడంబడికపై సంతకం చేసుకొన్న మొరాకో సుల్తాన్, ఫ్రెంచి అధికారి జనరల్ ఆల్ఫొన్స్ జూన్ తనను సింహాసన భ్రష్టుని చెయ్యగలనని బెదిరించి ఒడంబడికపై సంతకం పెట్టించినట్లు ఒక ఈజిప్షియన్ పత్రికావిలేఖరితో చెప్పాడు.

—పెకింగ్ వెడుతున్న టిబెటన్ రాయబారులిద్దరు, ఢిల్లీలో ప్రధాని పండిట్ నెహ్రూగార్ని దర్శించి, దలైలామా స్వహస్త లిఖిత లేఖ నొకదాని నిచ్చారు.

—హైకోర్టు గురించీ, జడ్జీలను గురించీ విమర్శలు చెయ్యడానికి మద్రాసు శాసనసభలో కొందరు సభ్యులు యత్నించగా స్పీకర్ నివారించారు.

—నూలుకొరత మూలంగా జీవనాధారం కోలుపోయి ఇద్దరు సాలీలు పెడన (కృష్ణా జిల్లా)లో ఆకలిబాధతో మరణించిన వార్త నిజమేనని మద్రాసు శాసనసభలో మంత్రి పెరుమాళ్లస్వామి రెడ్డి గారు చెప్పారు.

**బుధవారం, మార్చి 28 :**

—భద్రతామండలిలో కాశ్మీర్ సమస్యపై ప్రవేశపెట్టబడిన ఆంగ్లో-అమెరికన్ తీర్మానాన్ని భారతప్రభుత్వం నిరాకరించగలదని ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ పార్లమెంట్‌లో ప్రకటించారు.

—'ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వాన్ని' పాకిస్తాన్ ప్రభుత్వం గుర్తిస్తుందని ఒక బొంబాయి పత్రిక ప్రచురించినవార్త అబద్ధమని కరాచీలో పాకిస్తాన్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు ప్రకటించారు.

—బ్రిటిష్ క్రూయిజర్లు పర్షియన్ సింధుశాఖలో అబడాన్ వద్ద నిలవరించబడ్డాయి.

—సూయజ్ కెనాల్ కంపెనీని ఈజిప్ట్ ప్రభుత్వం వశపరుచుకోవాలంటూ, ఈజిప్ట్ పార్లమెంట్ సభ్యుడొకడు శాసనాన్ని ప్రతిపాదించ దలిచినట్లు ఒక కైరోపత్రిక తెలిపింది.

—నైల్‌నదీ ప్రాంతాన్ని అంతనీ ఫరూఖ్ రాజు పరిపాలనలోకి తేవడం ఈజిప్ట్ ఆశయమనీ, దీనిని నిరోధిస్తున్న వారి తంత్రాలను భగ్నం చెయ్యగలరనీ, ఈజిప్ట్ ప్రధాని నహస్ పాషా కైరోలో అన్నారు.

—తగరం ధరలగురించి 14 దేశాల వాషింగ్టన్ సమావేశం అంగీకారానికి రాలేక పోయిందని లండన్ వార్త.

—నాలుగు అగ్రరాజ్యాల సైనిక, ఆయుధ బలాలను తగ్గించే విషయమై సోవియట్ ప్రతినిధి గ్రొమైకో, అగ్రరాజ్య ప్రతినిధుల (పారిస్) సమావేశంలో కొత్త సూచన చేశారు.

—కామరూప్ జిల్లాలో (అస్సాం) రెండు మాసాలలో (1006) మంది కమ్యూనిస్టులనూ, సానుభూతిపరులనూ అరెస్టుచేసినట్లు అస్సాం ప్రభుత్వ ప్రతినిధి ఒకరు గౌహతీలో ప్రకటించారు.

—భారతీయ సాంస్కృతిక స్వాతంత్ర్యసమావేశం (ఇండియన్ కాంగ్రెస్ ఫర్ కల్చరల్ ఫ్రీడమ్) బొంబాయిలో శ్రీ జయప్రకాశ్ నారాయణగారి అధ్యక్షత కింద, మంత్రి శ్రీ కె. యం. మున్షీగారిచే ప్రారంభించబడింది.

—ఉత్తర బీహార్‌లో ఆహార పరిస్థితి ఆందోళనకరంగా ఉందని బీహార్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు పాట్నాలో ప్రకటించారు.

—ఫ్రెంచి ఇండియా ఎన్నికల సందర్భంలో ఫ్రెంచి ప్రభుత్వ అభ్యర్థనపై అంతర్జాతీయ న్యాయస్థాన ఉపాధ్యక్షులు నియమించిన తటస్థ పరిశీలకులు ముగ్గురూ చెన్నపట్నం చేరారు.

—గుంటూరు ఆంధ్రమహాసభ సమావేశ నిర్ణయం ప్రకారం, భారత ప్రభుత్వానికి అందచెయ్యడం నిమిత్తం ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణావశ్యకతను గురించి మహాసభాధ్యక్షులు శ్రీ జి. హరిసర్వోత్తమరావుగారు తయారుచేసిన మహజర్‌ను మహాసభా కార్యవర్గం మద్రాసులో చర్చించి ఆమోదించారు.

—గూడూరు (నెల్లూరుజిల్లా), బాపట్ల (గుంటూరుజిల్లా) ఆరణి (ఉత్తరార్కాటు జిల్లా) పంచాయతీలను మున్సిపాలిటీలుగా మార్చుతూ మద్రాసుప్రభుత్వం ఉత్తరువు చేసింది.

—మద్రాసుట్రామ్వే కంపెనీని మద్రాసుప్రభుత్వం వశపరుచుకోరాదని నిర్ణయించినట్లు మంత్రి గోపాలరెడ్డిగారు మద్రాసు శాసనసభలో ప్రకటించారు.

### గురువారము మార్చి 29:

—భద్రతామండలిలో కాశ్మీర్ గురించిన ఆంగ్లో - అమెరికన్ తీర్మానాన్ని నిరాకరిస్తూ, భారతప్రతినిధి శ్రీ బి. యన్. రావుగారు భారత ప్రభుత్వాభిప్రాయాన్ని విపులీకరించారు.

—జనరల్ మెకార్థర్ యుద్ధవిరమణ ప్రతిపాదన గమనించబడదని పెకింగ్ రేడియో ప్రకటించింది.

—జనరల్ మెకార్థర్ ప్రకటన మూలంగా వాషింగ్టనులో సమావేశమైన 14 దేశాల ప్రతినిధుల కొరియా యుద్ధాశయ ప్రకటన వెలువడదని న్యూయార్కు వార్త.

—సోమనాధ దేవాలయ (గుజరాత్) పునర్నిర్మాణంకోసం స్వర్గీయ సర్దార్ పటేల్ కోరికను మన్నించి, ఆఫ్ఘన్ ప్రభుత్వం వజ్రాలు తాపిన దేవాలయ సింహద్వారాలను, ఆఫ్ఘనిస్తాన్ నుంచి భారతదేశం పంపడానికి నిశ్చయించుకుంది.

—భారతదేశానికి ఉచితంగా ఇరవై లక్షల గోధుమ నివ్వాలని అమెరికన్ కాంగ్రెస్‌లో ప్రతిపాదించబడిన బిల్లును జాప్యం చెయ్యకుండా ఆమోదించవలసిందని కాంగ్రెసుకు ప్రెసిడెంట్ ట్రూమన్ విజ్ఞప్తిచేశారు.

—ఫ్రెంచి రిపబ్లిక్ ప్రెసిడెంట్ యం. ఆరియల్, అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ కొరియా యుద్ధాన్ని గురించి, ఇండోచీనా యుద్ధాన్ని గురించీ వాషింగ్టన్‌లో చర్చించారు.

—శరణార్థుల ఆస్తి విషయమై ప్రభుత్వాల మధ్య వ్యవహారం కొనసాగదనీ, ఎవరి ఆస్తిని వారు అమ్ముకోడం మంచిదనీ, ఈ సమస్యవిషయంలో భారత ప్రభుత్వం వాగ్దానాలను పాటించటం లేదనీ, పాకిస్తాన్ శరణార్థుల పునరావాసశాఖామంత్రి డా॥ ఖురేషీ పాకిస్తాన్ రేడియో మాట్లాడుతూ అన్నారు.

—ఢిల్లీ నగరంపైన ఏ దేశానిదో తెలియని విమాన మొకటి కనపడిందనీ, భారత విమానశాఖవారు పరిశీలించ యత్నించగా 30 వేల అడుగుల ఎత్తుకు వెళ్ళి ఆగ్నేయ దిశగా పారిపోయిందనీ భారత వైమానిక దళాధిపతి సర్ ఐవ్లా చాప్మన్ ప్రకటించారు.

—విద్యా సంస్థలలో విద్యార్థులను ప్రవేశపెట్టడంలో కుల విచక్షణ పాటించడం రాజ్యాంగ నియమ విరుద్ధమని సుప్రీంకోర్టు నిర్ణయించనున్నందువల్ల, నియమాలకు లోబడే అన్ని కులాలవారినీ "సంరక్షించడానికి" ఎలా వీలౌతుందో మార్గాంతరం గురించి మద్రాసు ప్రభుత్వం విచారిస్తున్నదని మంత్రి మాధవమీనన్ శాసనసభలో చెప్పారు.

—రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ గారు ఎర్నాకులంలో ఒక బహిరంగ సభలో ఉపన్యసిస్తూ, పదిహేనేళ్ళ గడువులోగా హిందీ నేర్చవలసిందని దాక్షిణాత్యులకు విజ్ఞప్తి చేశారు.

—రాబడిపన్ను ఎగవేత పరిశోధించడానికి నియమింపబడిన కమిషన్ 1952 డిసెంబర్ వరకూ పనిచేస్తుందని భారత ప్రభుత్వం ప్రకటించింది.

—ఉప్పును చిల్లర వర్తకులకు రాష్ట్రప్రభుత్వాలే అమ్మడం మేలని కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకు సూచించినట్లు మంత్రి గాడ్గిల్ పార్లమెంటులో ప్రకటించారు.

—ఢిల్లీలో అమ్మకపుపన్ను విధింపుపట్ల అసమ్మతి సూచకంగా వ్యాపారసంస్థలూ, షాపులూ అన్నీ మూసివెయ్యబడినాయి.

### శుక్రవారము, మార్చి 30:

—కాశ్మీర్ గురించిన ఆంగ్లో-అమెరికన్ తీర్మానం భద్రతామండలిచేత ఆమోదించబడింది.

—కొరియాలో సమితి సేనలు 38 వ అక్షాంశరేఖను దాటినప్పటికీ, పెద్ద దాడి జరిపే విషయాన్ని రాజకీయనిర్ణయాలకు వదలివేయాలని జనరల్ మార్షల్ చేసిన ప్రకటనను ప్రసిడెంట్ ట్రూమన్ పునరుద్ఘాటించారు.

—పత్రికా ప్రచురణకు సంబంధించిన శాసనాలను పరిశీలించి సవరణలను సూచించిన ప్రెస్ లాస్ ఇంక్వైరీ కమిటీ నివేదికను అమలుజరపడానికి భారతప్రభుత్వం నిరాకరించింది.

—ఇంగ్లీషుభాషా పరిశోధనకు ప్రత్యేకంగా ఒక డిపార్ట్‌మెంటు స్థాపించడానికి మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్ నిర్ణయించింది.

—హైదరాబాద్‌లో లాయక్ అలీ మంత్రివర్గ ప్రచారానికీ, యుద్ధ సన్నాహాలకీ రు $9\frac{1}{2}$ కోట్లు నష్టపరిచిందని, మంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ పార్లమెంటులో తెలిపారు.

—కాశ్మీర్‌పై భద్రతామండలి చేసిన తీర్మానాన్ని పాకిస్తాన్ ఆమోదించినట్లు పాకిస్తాన్ విదేశాంగమంత్రి సర్ జఫ్రుల్లాఖాన్ భద్రతామండలికి తెలిపారు.

—దక్షిణాఫ్రికాలో జాతివర్ణవివక్షతల ఆధారంపై ప్రత్యేక వాస్తాలు స్థిరపడాలని మలాన్ ప్రభుత్వం చేసిన శాసనం ఇవాళ అమలు జరపబడింది. (ఈ శాసనాన్ని అమలు జరపవద్దని ఇదివరలో మలాన్ ప్రభుత్వాన్ని ఐక్యరాజ్యసమితి ఆదేశించింది.)

—ఆల్బేనియాలో గొరిల్లాలతో పోరాడ్డానికి కమ్యూనిస్టు ప్రభుత్వానికి సహాయం చేసే నిమిత్తం రష్యన్ పెరాచూట్ దళాలు దిగినట్లు బెల్‌గ్రేడ్ (యుగోస్లావియా) వార్త.

—కన్నడ జిల్లాలనూ మైసూరు రాజ్యాన్నీ చేర్చి సంయుక్త కర్ణాటక రాష్ట్రాన్ని వెంటనే నిర్మించాలని అభ్యర్థిస్తూ, కర్ణాటక కాంగ్రెస్ నాయకులు రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ ధార్వార్‌లో ఒక విజ్ఞప్తి పత్రాన్ని ఇచ్చారు.

### శనివారం, మార్చి 31:

—కొరియా పశ్చిమ యుద్ధరంగంలో రెండు అమెరికన్ టాంకు దళాలు 38 వ అక్షాంశరేఖను దాటాయి.

—ఏప్రిల్ 8 వ తేదీనుంచి మద్రాసు రాష్ట్రంలో బియ్యం రేషన్ ప్రమాణాన్ని తలకి రోజుకి ఏడౌన్సుల నుంచి ఎనిమిదౌన్సులికి పెంచగలరని మద్రాసుప్రభుత్వం ప్రకటించింది.

—తిరువాన్కూరు-కొచిన్ శాసన సభలోని 14 మంది కాంగ్రెస్ సభ్యులు సభ్యత్వానికి రాజీనామా నిచ్చారు.

### ఆదివారం, ఏప్రిల్ 1:

—సమితిసైన్యాలు 38 వ అక్షాంశరేఖను దాటి దండయాత్ర చేసేముందు బ్రిటన్ మొదలైన దేశాల అనుమతి పొందడం అవసరమని బ్రిటిష్‌దేశ రక్షణశాఖా మంత్రి షిన్వెల్ లేబర్ పార్టీ సమావేశంలో చెప్పారు.

—కొరియాలో క్రిముల ద్వారా అంటువ్యాధుల్ని విస్తరింపచెయ్యడానికి జనరల్ మెకార్థర్ సన్నాహం చేస్తున్నట్లు రష్యన్ 'రెడ్ స్టార్' పత్రిక ఆరోపిస్తున్నది.

—మంత్రి శ్రీ చంద్రమౌళిగారి గ్రామపంచాయితీ శాసనం మద్రాసురాజ్యంలో అమలు జరపబడింది. అయితే కొత్త పంచాయతీలు అప్పుడే నిర్మింపబడవు.

(48-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 21

డాంటీకి చేష్టలుడిగినాయి. ఊపిరాడటలేదు. సమయస్ఫూర్తి తెచ్చుకుని శ్వాస బిగబట్టాడు. కుడిచేతిలోని కత్తితో గోనెసంచిని చీల్చి వేశాడు. రెండో చెయ్యి, తల విడివడ్డాయి. కాని ఎంత ప్రయత్నించినా ఇనపగుండును వొదిలించుకోలేక పోతున్నాడు. ఆ గుండు అతన్ని సముద్రంలో కిందికి వేగంగా లాక్కుపోతోంది. చివరికి శరీరాన్ని బాణంవలె వంచి, కాళ్ళకు కట్టబడిన పగ్గాన్ని అందుకున్నాడు. పగ్గాన్ని కత్తితో కోసి వేశాడు. ఒక్కసారి బలంగా కాళ్లు విదల్చి, శరీరాన్ని నిలువుగా పైకి ఒక్క ఊపు ఊపాడు. ఇనపగుండు గోనెసంచిని సముద్రమట్టానికి లాక్కుపోయింది,

ఊపిరి తీసుకోడానికి డాంటీ క్షణంసేపు నిదానించి, తరవాత మరొకసారి పైకి ఈదాడు. ఈసారి నీటిపైకి రాగలిగాడు. కాని ఎవరైనా చూస్తారనే భయంతో నీటిలోకి చప్పున మునిగాడు.

ఈసారి డాంటీ నీటిపైకి వచ్చినప్పుడు ఇఫ్‌కోట నుప్పలకు ఏభై అడుగుల దూరంలో ఉన్నాడు. అతనిముందు ఒడ్డులేని విశాల సముద్రం ఘూర్ణిస్తోంది. అతని వెనుక బ్రహ్మాండమైన కొండ ఒకటి ఒక చివర మొనతేరి, బలికోసం చెయ్యి చాచినట్లు రాక్షసివలె భయంకరంగా చూస్తోంది. సముద్రకెరటాలు తుపానునాహ్వానిస్తున్నట్లు కల్లోలం చేస్తున్నాయి. కొండపైన గుడ్డిదీపం పక్కన ఇద్దరు వ్యక్తుల ఆకారాలు ఇంకా కనిపిస్తున్నాయి. ఇద్దరూ ఆందోళనతో సముద్రంవంక చూస్తున్నట్లు అతనికి అనిపించింది. అతని కేకను ఇద్దరూ వినేఉంటారనుకున్నాడు.

మరొకసారి నీటిలో మునిగి కొంతదూరం ఈదాడు. తిరిగి పైకివచ్చేసరికి దీపం మాయమయింది. ఇప్పుడతను చుట్టూ కలయచూశాడు. ఇఫ్‌కోటకు సమీపంలోని ద్వీపాలలో జనావాసాలున్నాయి. వీనికంటె మూడుమైళ్ళలో ఉన్న టైబోలెక్, లెమార్ ద్వీపాలు క్షేమమని భావించాడు. కాని ఈ చీకటిలో వాటి నెలా కనిపెట్టడం ?

ఆ క్షణంలో డాంటీకి ప్లానీర్ ద్వీపంలో దీపస్తంభం కనిపించింది. అటువంక తిరిగి; ఇప్పుడు తనకు ఎడమవైపున టైబోలెక్ ద్వీపం ఉందని గ్రహించాడు. ఎడమవంకకు ఈదినట్లయితే సులువుగా చేరుకోవచ్చును. ఇన్నేళ్ల నిర్బంధం అతనిలోని శక్తిని హరించలేదని గ్రహించి డాంటే ఆనందభరితుడైనాడు. బాల్యంలో నేర్చిన ఈత నతడు మరిచిపోలేదు. భయం అతని వేగాన్ని ఇనుమడింపచేసింది. కెరటాల శిఖరాలపైకి లేచినప్పుడెల్ల శ్రద్ధతో ఆలకించేవాడు. చుట్టూ గాఢాంధకారాన్ని చీల్చి చూడ్డానికి ప్రయత్నించేవాడు. ప్రతి పెద్ద కెరటమూ అతన్ని వెన్నాడి తరుముతున్న పడవేనని భయపడుతూ, డాంటీ మరింత వేగంతో ఈదేవాడు. క్రమంగా ఆ నిశ్శబ్దనిశీధిలో భయంకరమైన ఇఫ్‌కోట అంతర్ధానమయింది. అది ఇంక కంట పడకపోయినప్పటికీ, దాని ఉనికి అతని మనస్సులో పొడగట్టుతూనే ఉంది. అది అతన్ని వేగంతో తరుముతోంది.

“గంటసేపటినించి ఈదుతున్నానేమో!” అనుకున్నాడు డాంటే తనలో. “ఎదురుగాలి అడ్డగిస్తోంది. నాలుగోవంతు నా శ్రమంతా వ్యర్థమైపోతోంది. నేను మోసపోకుండా ఉన్నట్లయితే, టైబోలెక్ ద్వీపాన్ని సమీపించి ఉండాలి. ఏమో! పొరబడ్డానేమో ?”

భీతితో కంపించిపోయాడు డాంటీ. విశ్రాంతికోసం నీటిపైన తేలనారంభించాడు. కాని సముద్రం క్రమ క్రమంగా మరింత కల్లోలితమౌతోంది. ఈ విశ్రాంతి అసాధ్యమనుకున్నాడు.

“ఏమయినా సరే కడంటా చూడాలి. కాళ్లూ చేతులూ అలసిపోయేవరకూ, ఒళ్ళు కొంకర్లుపోయేవరకూ ఈదితీరాలి. సత్తువ నశించి మునిగిపోతే పోవచ్చును. కాని సత్తువ ఉన్నంతవరకూ పట్టు వదలకూడదు” అనుకున్నాడు. ప్రాణాలకు తెగించి లేనిబలం తెచ్చుకుని ఈదడం మొదలు పెట్టాడు.

హఠాత్తుగా ఆకాశమంతా చీకటితో మరింత దట్టమైనట్లు డాంటీకి పొడగట్టింది. మోకాటికి గట్టి దెబ్బ తగిలింది. డాంటే చేతులు చాచి తడిమాడు. ఏదో కఠిన పదార్థం తగిలింది. జాగ్రత్తగా ముందుకు ఈదాడు. నేల తగిలింది.

డాంటే తలెత్తి చూశాడు. లేచి కొన్ని అడుగులు ముందుకు వేశాడు. తరవాత కఠిన శిలాసముదాయంపైన నడుము వాల్చాడు. ప్రస్తుత స్థితిలో ఇదే అతనికి మెత్తని పాన్పుగా సుఖవిశ్రాంతి నిచ్చింది. తనకు విముక్తి నిచ్చినందుకు భగవంతుని హృదయపూర్వకంగా ప్రశంసించాడు. హోరుగాలి కాని, వర్షాతపం కాని అతని సుఖ సుషుప్తిని వారించలేకపోయినాయి. అలసటవల్ల అతని శరీరం నిద్రాసక్తమయింది. కలనైనా కనలేకపోయిన స్వేచ్ఛాసౌఖ్యాశయం పరితృప్తి చెందనున్న అతని అంతరాత్మ, గాఢ సుషుప్తిలో తన్మయానందం అనుభవిస్తోంది.

గంటసేపటికి పెద్ద ఉరుమువల్ల డాంటీకి నిద్రాభంగమయింది. క్షణక్షణానికీ విద్యుత్సర్పాలవలె తటిల్లతలు, గుమిగూడుతున్న మేఘాల భయంకర స్వరూపాన్ని వెలిగింప చేస్తున్నాయి.

డాంటే టైబోలెక్ ద్వీపాన్ని చేరినట్లు గ్రహించాడు. నిర్జనం, నిరాశ్రయమైన ఈ ద్వీపంలో తలదాచుకోడానికి చోటు లేదని డాంటీకి తెలుసును. అందువల్ల తుపాను పోగానే మళ్ళీ సముద్రంలోకి దూకి, లెమార్ ద్వీపానికి ఈదుకుని వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. అది కూడా ఆశ్రయం దొరకని ద్వీపమే. కాని పెద్ద

అనువాదం: సీతారామ్

దైనందువల్ల విశ్రాంతికి అనుకూలంగా ఉంటుందనుకున్నాడు. పక్కల అంచు తేరి, కింద నీడనివ్వగల ఒక కొండచరి చేరి, అంతకంతకు తీవ్రమౌతున్న తుపానులో డాంటే తలదాచుకున్నాడు.

ద్వీపమంతా కంపించిపోతున్నట్లుంది. అనుక్షణమూ కట్టు తెగిన పడవమాదిరిగా ద్వీపం సముద్రంలో తేలిపోతుందన్నట్లుంది. పెద్ద సుడిగుండంలోనికి లాక్కుపోతుందనిపిస్తున్నది.

ఇంతలోనే ఆకాశాన్ని ఒక్క వేటున చీల్చినట్లు పెద్ద మెరుపొకటి మెరిసింది. ఆ మెరుపువెలుగులో, డాంటేకి మైలుదూరంలో ఒక చిన్న బోటు కనిపించింది. చేపలుపట్టే పల్లెవాసులకు చెందినది కాబోలనుకున్నాడు. అది కల్లోల సముద్రంలో, నిస్సహాయంగా కెరటాలపై ఆకువలె తేలిపోతోంది. అకస్మాత్తుగా మాయమైనట్లు మాయమై, ఇంతలోనే ఒక తరంగశిఖరంపై తేలి కనపడుతోంది. మళ్ళీ దూసుకుపోయి మాయమౌతోంది.

డాంటే గొంతెత్తి బిగ్గరగా పిలిచాడు. సంజ్ఞచేశాడు. మళ్లీ మెరుపు మెరిసింది. బోటులో నలుగురు నావికులు తెరచాప కొయ్యనూ, పగ్గాలనూ ప్రాణపణంగా పట్టుకున్నట్లు డాంటే చూశాడు. అయిదో నావికుడు విరిగిన చుక్కాని పట్టుకున్నాడు. కొయ్యనంటిన తెరచాప చినిగి తూట్లుపడి ఉంది. గాలి జోరులో రెపరెపలాడుతోంది. చివరికి కొయ్యను కట్టిన బంధం విరిగి, బోటు నిశాంధకారంలో అంతర్ధానమయింది.

వెంటనే పటపట శబ్దం. దానివెంట ఆర్తనాదాలు వినవచ్చాయి. మరొక మెరుపులో బోటు ముక్కలైనట్లు డాంటేకి కనపడింది. చెక్కలు వెదచల్లబడిన తరంగాలలో దీనముఖాలు, పైకి చాచిన చేతులు కనిపించాయి. తిరిగి అంతా అంధకార బంధురమయింది. ఆ ఘోరదృశ్యం మెరుపువలెనే ఇట్టే మాయమయింది.

జారుతున్న ఒక రాతిపైన చేరబడి డాంటే కనురెప్పలు వాల్చక చూస్తున్నాడు. శ్రద్ధగా ఆలకించాడు. ఇప్పుడు ఏ ఆర్తనాదాలూ వినరాలేదు. ఎవరూ కనిపించలేదు. ఆర్తనాదాలు, ప్రాణాలకోసం పోరాటం అంతమయినాయి. తుపాను గాలి గర్జన మాత్రమే వినపడుతోంది.

క్రమక్రమంగా వాయుఘోషణ క్షీణించింది. పెద్ద మబ్బులు పడమరకు సాగిపోతున్నాయి. నీలిఆకాశం, మిణుకు మిణుకుమంటున్న నక్షత్రాల కాంతి క్రమంగా కానవచ్చాయి. తూర్పున ఆకాశం అంచులలో ఎర్రని కాంతిపుంజం తెలినీలిమబ్బులమధ్య వ్యాపించ నారంభించింది. తొలి కాంతులలో నాట్యమాడుతున్న తరంగాలశిఖరాలు హేమకిరీటాలు ధరించాయి.

తెల్లవారింది. ఈ అద్భుత దృశ్యాన్ని చూస్తూ, డాంటే మూగవోయి, నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అతడు జన్మలో మొట్టమొదటిసారిగా ఇటువంటి దృశ్యాన్ని చూస్తున్నట్లుంది. చిరకాల నిర్బంధంలో ప్రకృతి సౌందర్యాన్ని, అద్భుత దృశ్యాల్ని మరచినట్లుంది అతనికి. ఇఫ్ కోట కారాగారాన్ని పరికించాడు. సముద్రమంతా కలయ చూశాడు. సముద్రగర్భంలోనుంచి లేచి నిల్చి, శివిగా సముద్రుని ఆజ్ఞాపిస్తున్నట్లుంది దుర్గం. ఉదయం బహుశా అయిదు గంటలై ఉంటుంది. సముద్రం ప్రశాంతమౌతున్నది.

డాంటే ఇలా అనుకున్నాడు: "ఇంక రెండుమూడు గంటల్లో జైలర్ నాగదికి వెడతాడు. పాపం నామిత్రుని శవంకనిపిస్తుంది. అదిచూసి నాకోసం వెతుకుతాడు. కేకలు వేసి అందర్నీ పిలుస్తాడు. అప్పుడు పడకపక్క రంధ్రమూ, సొరంగమార్గమూ బయటపడతాయి. నన్ను సముద్రంలోకి విసిరినవాళ్లని పరీక్షచేస్తారు. పడినప్పుడు నేపెట్టిన కేకను వాళ్లు వినేఉంటారు. సైనికుల్ని నింపుకుని బోట్లు బయలుదేరతాయి - పరారైన నిర్భాగ్యుని వెతకడానికి. అట్టేదూరం పోలేడనుకుంటారు. ఫిరంగి మోగుతుంది. ఒంటిపైన బట్టలైనా లేక, ఆకలితో మాడుతూ తిరిగే ఏమనిషికీ ఆశ్రయమివ్వకూడదని తీరవాసులందర్నీ ఫిరంగిమోత హెచ్చరిస్తుంది. మార్సెల్స్ పోలీసులూ గూఢచారులూ తీరప్రాంతమంతా గాలిస్తారు. ఇఫ్ కోట గవర్నర్ సముద్రంపైన నన్ను వెంటాడతాడు. సముద్రంలోనూ, తీరప్రాంతంపైనా అందరూ నన్ను చుట్టుముట్టి పట్టుకుంటారు. అప్పుడు నాగతేమౌతుంది? ఇరవైరూపాయలకోసం ఆశపడే ఏరైతో నన్ను పట్టిఇవ్వకమానడు. నాకింక బలమంతా పోయింది, ధైర్యం నశించింది. ఉపాయం తోచడంలేదు. అయ్యో భగవంతుడా! నేననుభవించిన క్లేశం చాలదా? అసమర్థుడనైన నన్ను కాపాడలేవా?"

డాంటే భగవంతుని దీనంగా ప్రార్థిస్తున్న ఈ సమయంలోనే, పామెగ్ ద్వీపంవద్ద ఒక చిన్న ఓడ కనిపడింది. దానికి మూడు తెరచాపలున్నాయి. డాంటే అనుభవంకల నావికుడు. అది జినోవాలో నిర్మించబడినదని ఇట్టే గ్రహించాడు. మార్సెల్స్ నించి వెళ్లిపోతోంది. డాంటే ఇలా అనుకున్నాడు: "పరారి ఖైదీనని తెలుసుకుని మార్సెల్స్ కి తీసుకువెళ్లి ఒప్పగిస్తారనే భయమే లేకపోయినట్లయితే, అరగంటలో వెళ్లి ఆ బోటు నందుకోగలవాడినే. ఇప్పుడేం చెయ్యాలం! వాళ్లకి చెప్పడానికి ఏకథ అల్లను? వాళ్లు వ్యాపారం మిషతో తీరసమీపాన తిరిగే సముద్రపు దొంగలు కావచ్చు. అక్రమవ్యాపారులు కావచ్చు. లాభంలేదనుకుంటే నన్ను అమ్మెయ్యగలరుకాని దయచూపించరు. ఇంకా కోటఫిరంగి మోగలేదు. ఇప్పటికేమీ అనుమానించరు. రాత్రి సముద్రంపాలైన బోటులో నావికుడినని చెప్పుకోవచ్చును. అవును. అదే మంచిది వెంటనే వెళ్లాలి."

డాంటే రాత్రి బోటుకనపడిన దిక్కు చూశాడు. చూసి కంపించిపోయాడు.

ఒకరాతిఅంచున చిక్కుకున్న ఫ్రిజీటోపి ఒకటి కనపడింది. అది రాత్రి కనపడిన నావికులలో ఒకడు ధరించి ఉండాలి. విరిగిన బల్లచెక్కలు పక్కనే నీటిలో తేలుతున్నాయి.

డాంటే సముద్రంలోకి దూకి టోపీవంకకు ఈదుకు వెళ్లాడు. అది అ[illegible]కుని తలపై ధరించి ఒక బల్లచెక్క పట్టుకుని, జినోవా పడవదిక్కుగా ఈదాకు వెళ్ళాడు.

"ఇంక ఫరవాలేదు" అనకున్నాడు డాంటే. ఈ భావం స్థిరపడ్డంతోనే అతని కెక్కడలేని బలం వచ్చింది. ఆ చిన్న ఓడ ఇఫ్ కోటకీ, ప్లానీర్ దీపస్తంభానికీ మధ్యగా వెడుతోంది. క్రమంగా డాంటే నీటిపై తేలి, టోపీ తీసి ఆడించి, సంజ్ఞచేశాడు. కాని ఎవరూ చూడలేదు. ఓడ మరొకదిక్కుగా వెడుతోంది. బల్లచెక్క తెచ్చుకున్నందుకు సంతోషించాడు. నీరసించి ఉన్నందువల్ల ఇటువంటి సహాయం లేకపోతే ఓడని సమీపించేవరకూ నీటిలో నిలవలేకపోయేవాడే. ఓడ దాటిపోతే తీరమైనా చేరలేకపోయేవాడే. ఒకసారి ఓడ ఆగి అతనివంక వస్తున్నట్లు తోచింది. కాని ఇంతలోనే మళ్ళీ దూరంగా వెళ్లిపోతోంది. డాంటే ఈమారు మళ్ళీ నీటిపైకి లేచి టోపీఎత్తి ఊపాడు. బిగ్గరగా పిలిచాడు. సముద్రదేవత ఎవరో విలపిస్తున్నట్లుంది ఆ పిలుపు. ఈమారు నావికులు అతని పిలుపు విన్నారు. అతన్ని చూశారు. వెంటనే చుక్కాని తిప్పి ఓడని డాంటేదగ్గరికి నడిపారు. ఓడమీది

(44-వ పేజీ చూడండి)

## ★ అదీ - ఇదీ ★

### ఫ్రాన్సులో తటస్థవాదం

"ప్రాక్పశ్చిమాల మధ్య బిగిసిన విభేదాలను సడలించటానికి ఫ్రాన్సు తీవ్రంగా ప్రయత్నించాలని ఎవరన్నా అంటే, వారిని అపాయకరులైన "తటస్థవాదులు" గానూ, లేక, "మారువేషం" వేసుకున్న కమ్యూనిస్టులుగానూ భావిస్తున్నారు...... కాని ఫ్రెంచి తటస్థవాదాన్ని నిర్లక్ష్యం చెయ్యడమంటే ఈరోజున ఫ్రాన్సులో గల ఉద్యమాలన్నిటిలోకి ముఖ్యమైనదాన్ని నిర్లక్ష్యం చెయ్యడమన్న మాట......

మార్చి నెలారంభంలో పారిస్‌లో కల్లా పెద్దదైన ఒక సభాభవనంలో ఒక సభ జరిగింది. హాలంతా క్రిక్కిరిసిపోయింది. పూర్వం 'పాప్యులర్ ఫ్రంట్' స్థాపకులలో ఒకడూ, ఇప్పుడు ఫ్రెంచి శాసన సభలో కమ్యూనిస్టేతర వామపక్షాలలో ఒకదాని ప్రతినిధీ అయిన ప్రొఫెసర్ రివే ఉపన్యసిస్తూ ఇలాగన్నాడు. "1934 ప్రాంతాల్లో దేశమంతటా ప్రబలంగా వ్యాపించిన 'పాప్యులర్ ఫ్రంట్' ఉద్యమంలాగానే నేటి తటస్థవాద ఉద్యమంకూడా ప్రబలం కాగలదని ఆశిస్తున్నాను."

విచిత్ర మేమిటంటే, క్లాడ్ బోర్దా వంటి ఖచ్చితమైన కమ్యూనిస్టు వ్యతిరేకులూ, 'వామరంగంలో మనకు శత్రువులు లేరు' అని నినదించే పియర్ కాట్‌వంటి వాళ్లూకూడా తటస్థవాద రంగంమీద ఏకమై నిలబడ్డారు.

ఈసభలో ముఖ్యంగా గమనించదగిన అంశాలివి: అట్లాంటిక్ ఒడంబడిక విధానాన్ని జర్మనీ పునరాయుధీకరణంతో పాటు ఇంకా ఇలాగే కొనసాగిస్తే యుద్ధం తప్పక వస్తుంది; తత్ఫలితంగా ఫ్రాన్సు నేల మట్టమౌతుంది. ఈముక్కలు సభలో ఉపన్యసించిన ప్రతిఒక్కడూ చెప్పాడు.

జేక్వెస్ సానెట్‌లాంటి వారు కొందరు ఇలా చెప్పారు: ఆర్థికంగా ఫ్రాన్సు అమెరికామీదనే ఆధారపడి ఉండాల్సిన అవసరమేమీ లేదు. దానిబదులు స్టెర్లింగ్ ప్రాంతంతోను, కొంతవరకూ తూర్పు యూరప్‌తోనూ సంబంధం పెట్టుకోవచ్చు. మార్షల్ పథకంకింద మనకు వచ్చేది మనజాతీయాదాయంలో నూటికి రెండువంతులుమాత్రం ఉంది. ఇండో చైనాలో యుద్ధంకోసం చాలా ఖర్చుచేస్తున్నాము. ఈయుద్ధం మానుకుంటే ఆరెండు వంతులూ అమెరికానుంచి తెప్పించుకోవల్సిన అవసరం పోతుంది. ఫ్రాన్సుకు దేశస్వాతంత్ర్యం ఈ రెండు వంతుల ముష్టికంటే విలువైనది.

గిల్లెస్ మార్టిన్ అనే ఆయన ఇలా చెప్పాడు: దేశంలో ప్రస్తుతం జరగబోయే ఎన్నికల విధాన సంస్కరణకు అంతరార్థం ఏమిటంటే కమ్యూనిస్టులకు బలంవచ్చే అవకాశాలు తగ్గించడమే. ఆతరువాత ఆపార్టీని నిషేధించటానికి వీలుంటుంది. కాని ఈపద్ధతివల్ల కార్మికులు మరింత నిర్దాక్షిణ్యంగా దోచుకోబడటం, కమ్యూనిస్టులు బలపడటం మాత్రమే జరుగుతుంది.

పియర్ కాట్ అనే ఆయన ఇలాగన్నాడు: మిలిటరీ దృష్ట్యా చూస్తే ఫ్రాన్సుకు స్నేహితులు లేకపోతే వచ్చే కొత్త అపాయమేమీ లేదు. ఇక్కడికి రాబోయేఅకొద్దిమంది అమెరికన్ సేనలు ఎలాగూ రష్యన్లను ఆపలేవు. పైగా ఆసేనలు రావటంమూలంగా రష్యన్లను రెచ్చగొట్టి నట్లవుతుంది. అంతేగాదు; అమెరికన్ సేనలు ఎంత వేగంగా పిరనీస్ పర్వతాలవేపు తోక జాడించగలవో, అంత వేగంగానూ ఫ్రెంచిసేనలు వాటి మానాన వాటిని వదిలేస్తే పారిపోగలవు. ఫ్రెంచి-అమెరికన్ సంబంధం మొహంమొత్తింది. ఎంత త్వరగా విడాకు లిచ్చుకుంటే అంత మంచిది...... ఫ్రాన్సు అటు రష్యన్ కూటమికి గాని, ఇటు అమెరికన్ కూటమికి గాని చెందకుండా స్వతంత్రంగా ఉండాలి. గతసంవత్సరంలో ఇలాంటి స్వాతంత్ర్యమే గనక ఫ్రాన్సుకు వుంటే, మనం నెహ్రూనే సమర్థించి వుండేవాళ్లం. అప్పుడు ఆసియాలో శాంతి కాపాడబడేది; మన ప్రతిష్ఠ ఎంతో పెరిగి వుండేది.

ఫ్రాన్సులో బలపడుతున్న ఈ తటస్థవాద ఉద్యమాన్ని ఒక్క 'మాండ్' పత్రిక తప్పిస్తే మిగతా పత్రికలన్నీ తూర్పారబడుతున్నాయి. అయినప్పటికీ అన్ని తరగతుల ప్రజలూ ఈ ఉద్యమంపట్ల సానుభూతి చూపుతున్నారు...

(న్యూస్టేట్స్‌మన్ ఎండ్ నేషన్ లో అలెగ్జాండర్ వర్త్)

### అమెరికా—బ్రిటన్:

చాలామంది బ్రిటిష్‌వారు, ఆమాటకొస్తే చాలామంది యూరపియన్లు, అమెరికాను అడపాతడపా ఎందుకు వ్యతిరేకిస్తూవుంటారంటే—1865నుంచీ అమెరికన్లకు యుద్ధమంటే ఎక్కడో "వెయ్యామడల" అవతల జరిగే వ్యవహారమైపోయింది. కాని యూరపియన్లకు ముఖ్యంగా 1945 నుంచీ యుద్ధము సంపూర్ణవిధ్వంసనానికి పర్యాయపదమై వూరుకుంది. తను బలవత్తమమైన రాజ్యం గనుక తన ఇష్టం వచ్చినచోట స్థావరా లేర్పరచుకోటానికి, ఆటంబాంబులను అట్టే పెట్టడానికి హక్కున్నట్లుగా అమెరికా మాట్లాడుతోంది. బ్రిటన్‌ను అమెరికన్ 'విమానవాహకనౌక' కింద జమకట్టి మాట్లాడటం అమెరికన్ సేనాధిపతులకు అలవాటయిపోయింది. బ్రిటిష్‌ప్రజలను ఖర్చుపెట్టి చూడవలసిన వస్తువులుగా వాళ్లు పరిగణిస్తున్నారు. ఈ వైఖరిని గమనించే బ్రిటిష్ ప్రజలు అమెరికాపద్ధతులకు ప్రతికూలిస్తున్నారు. బ్రిటిష్‌ప్రజల్లో అధిక సంఖ్యాకులు కమ్యూనిస్టువ్యతిరేకులు. కాని రష్యా కమ్యూనిజమ్‌ను వ్యాపింపజెయ్యటానికి మిలిటరీ దురాక్రమణ పద్ధతులను అనుసరించదనీ, అందుకు పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఆర్థిక, రాజకీయవైరుధ్యాలనే ఉపయోగించుకుంటుందనీ వారు నమ్ముతారు. ప్రపంచాన్ని కమ్యూనిజమ్ బారి నుండి రక్షించటానికి మిలిటరీ 'క్రూసేడ్' (మతయుద్ధం) ప్రారంభించాలనే మెకార్థర్ అనుయాయులను ఇందుకే పిచ్చివాళ్ల కింద జమకడతారు బ్రిటిష్ ప్రజలు.

(కింగ్ స్లే మార్టిన్.)

### రష్యా, అమెరికా

### పైకిగాదు, పందెం...

ఇటీవల తన నూనెగనులను 3,20,00,000 డాలర్లకు అమ్మిన లాస్ ఏంజిలిస్ నూనె వర్తకుడు ఆండ్రూ టి. జెర్గిన్స్ ప్రపంచానికంతకూ సవాలు చేశాడు. 1951 లో రష్యా అమెరికాపైకి యుద్ధానికి వస్తే లక్షడాలర్లు పందెం కాస్తాననీ, 1952 లో యుద్ధానికివస్తే 2 లక్షలడాలర్లు కాస్తాననీ, ప్రపంచంలో ఎవరైనా తన కెదురు కాయవచ్చుననీ, ఎట్టి నిబంధనలూ లేవనీ, ప్రభుత్వశాఖ తమ న్యూడీల్ విధానాలను అమలు చేయడానికిగాను రష్యాయుద్ధ భయాన్ని పెంపొందించడం చూస్తే తనకు విసుగెత్తుతున్నదనీ, తాను పందెంలోగెలిస్తే ఆ డబ్బు లాస్‌ఏంజిలిస్‌లోని బాలబాలికల స్కౌట్ దళాలకు ఇస్తాననీ ఆయన అన్నాడు.

—న్యూస్‌వీక్.



# అల్లుళ్ల కోరికలు

**శ్రీ సింగరాజు లింగమూర్తి**

గాది భానుని లేత కిరణాలు అప్పుడప్పుడే భూమిమీద పడుతున్నాయి. నూతనోత్సాహంతో తల్లులు పిల్లలకు తలంట్లుపోసి, కొత్తదుస్తులు కట్టబెడుతూ, పెద్దల్ని తొందరగా తెముల్చుకొని నలుగుకు రండని మందహాసంతో పిలుస్తున్నారు. అత్తగారింట్లకు బస్తీనుంచి వచ్చిన క్రొత్త అల్లుళ్లు కాఫీ తాగితలంటి పోసుకుంటామని గదిలోకి వచ్చి పిలచిన ప్రియురాండ్ర కొంగులు పట్టుకొని లాగుతున్నారు. "అబ్బ!... ఉండండి... ఎవరో వస్తున్నారు." అంటూ, నవవధూటులు తొరతొందరలతో పెరటిలోకి పోతున్నారు. "అయ్యో!..... ఇవేం నాగరికాలే... ...వేపప్రసాదం తినందే కాఫీ పుచ్చుకుంటారు లే?" అని ఆశ్చర్యంతో తల్లులు, నాయనమ్మలు చెక్కిట చేయి జేర్చుకుంటున్నారు. "పండక్కని మీ నాన్న నాకోసం ఏం తెచ్చారు?" అంటూ కొంతమంది ఘరాణా అల్లుళ్లు తలంట్లకు ముందే విషయసేకరణకై భార్యలను ప్రశ్నిస్తున్నారు. ఇంటి యజమానులు ..ందంతో మామిడి తోరణాలు గుమ్మాలకు కడుతూ, అల్లుళ్లను సరిగా కనిపెట్టండని ఇంటిల్లిపాదినీ హెచ్చరిస్తున్నారు.

శ్యామల చిరునవ్వుతో, అర్ధనిద్రకుక్కుతో, వయ్యారంగా గదిలోకి వచ్చి, 'ఇంకా సిగరెట్ తాగుతూ పడుకున్నారేం?... లేచి నలుగుకి రండి," అంది తియ్యని కంఠంతో.

"రాత్రి దొరసానిగారి దర్శనం కాలేదేం?" అంటూ రామారావు సాదరంగా చేతులు జాపాడు. శ్యామల మందహాసంతో వెళ్లి అతని ప్రక్కన కూర్చుని, "ఇల్లంతా సందడిగా ఉంటే గదిలోకి ఎలా రానూ?.. మా అక్కయ్యతో, చెల్లాయితో మాట్లాడుతూ పడుకుంటే అక్కడే నిద్దర పట్టింది... ఇస్... అబ్బ!... ఉండండి... ఎవరైనా గదిలోకి వస్తారు." నును సిగ్గు దొంతరలతో కొంచెం దూరంగా జరిగింది.

"మీ నాన్న పండక్కి ఏం తెచ్చాడేమిటి అల్లుళ్లకు?"

"ఇంకేం తెస్తారు......క్రొత్త బట్టలు పెద్దాపురంవి తెచ్చారు."

"నాన్సెన్స్...బట్టల కేంలే......అవి మామూలేగా. ఈ పండక్కి రిష్టువాచీ కొనిపెడతానన్నారుగా, నాకా మధ్య వ్రాసిన ఉత్తరంలో?"

"నిజమే!...వ్రాశారనుకోండి...... డబ్బు పెగల్లేదట...అందుకని ఈసారి ఎప్పుడైనా కొంటామన్నారు."

రామారావు ఇహ నేం మాట్లాడకుండా కూర్చున్నాడు. అతని మొహంలో వెనకటి ఉత్సాహం లేదు. శ్యామల భర్త మొహంలోని మార్పును కనిపెట్టకపోలేదు. సానునయంకోసం, అతని ఒళ్లో వాలి, తన చేతుల్ని అతని మెడకు చుట్టేసి, అతని మొహం తనవైపుకు వంచుకో ప్రయత్నించింది. రామం ధుమధుమలాడుతూ, ఆమె చేతుల్ని విదలించుకున్నాడు. శ్యామల చిన్నబోయిన మొహంతో అవ్యక్తంగా అతనివంక చూచింది. "శ్యామా!...అల్లుడిగారిని తొందరగా రమ్మనమ్మా!" అంటూ మధ్యహాలులోంచి తల్లి పిలిచింది. "ఇహ లేచి రండి." అంటూ చిరునవ్వుతో, శ్యామల గదిలోంచి బైటికి వెళ్లింది. ఆ చిరునవ్వులో వన్నెల విరియలేదు. అమృతం వర్షించలేదు. కేవలం తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు అని రామారావు గుర్తించకపోలేదు.

భార్య దగ్గర వెలితిగా మాట్లాడానా అని రామం ప్రశ్నించుకున్నాడు. ఇందులో వెలితి ఏముందీ?...తనకు రిష్టువాచీ కొనుక్కునే శక్తి లేక, కొనిపెట్టమని మామగారిని దేబిరించలేదే...ఆయనే స్వయంగా కొనిపెడతానన్నాడుగా; అందుకోసం రిష్టువాచీ తెచ్చారా అని అడిగాను. తప్పేముంది? అని సమర్థించుకున్నాడు. శ్యామల రావాలి! మామగారు తనకు రిష్టువాచీ కొంటానని ఉత్తరంలో వ్రాయకపోతే కోపం వచ్చేది కాదేమో! ఆయన అలా వ్రాయడంమూలానే తను మిత్రుల కందరికీ గొప్పగా చెప్పుకున్నాడు. రేపు రిష్టువాచీ ఏదని ఆ మిత్రులంతా అడిగితే తనేమని సమాధానం చెప్పాలి? నలుగురిలో నగుబాట్ల పని అవుతుందే, అనే అభిమానంవల్లనే తనకు కోపం వచ్చింది. ఆ కోపంవల్లనే, ఆ అభిమానంవల్లనే తనను పెనవేసిన శ్యామల సుమకోమల హస్తాలనువిదిలించికొట్టాడు. పాపం!... శ్యామలఎంత నొచ్చుకుందో? ఛీ...ఛీ.... ఇందులో తన తప్పు రవ్వంతైనా లేదు. తను ఇంటి అల్లుడు. అందులో పెద్దల్లుడికంటే, తను ప్రతిదానిలోనూ గొప్పే. గట్టిగా రిష్టువాచీ కావాలని బెట్టుచేస్తే, మామగారు ఒణుక్కుంటూ కొనిస్తాడు. పోనీ రిష్టువాచే తనే కొనుక్కుని, మామగారు కొనిపెట్టారని అందరితో చెప్పకుండా మంటే,తండ్రి డబ్బివ్వడు. ఇప్పుడు రిష్టువాచీ లేందే జరగదా అంటాడు. రిష్టువాచీ లేకపోవడం తనకు ఇబ్బందిగానే ఉంది. టైం తెలియకపోవడంవల్ల కాలేజీకి వెళ్లడం ఆలస్యమాతున్నది. ఏమైనాసరే మామగారిచేత రిష్టువాచి కొనిపించుకోవాల్సిందే" అనే ఆలోచనలతో మంచంమీద కూర్చుని, రామారావు సిగరెట్ కాలుస్తున్నాడు.

ఇంతలో పదేళ్ల మరదలుపిల్ల గదిలోకి వచ్చి, "అక్క రమ్మంటున్నది బావా, స్నానానికి" అంది. రామం సిగరెట్ పొగ గుప్పున వదులుతూ, "తలంటి పోసుకోనని చెప్పు" అన్నాడు ముక్తసరిగా. మరదలు గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది.

రామం తిరిగి ఆలోచనలో పడ్డాడు. ఇంట్లో కూర్చుంటే బలవంతం చేస్తారని ఊళ్లోకి వెడదామనుకున్నాడు. వెంటనే లేచి చొక్కా వేసుకున్నాడు. ఇంతలో శ్యామల గదిలోకి ప్రవేశించింది. రామం మౌనంగా కాళ్లకి చెప్పులు వేసుకున్నాడు. అతనికి కోపం వచ్చినట్లు శ్యామల బాగానే తెలుసుకుంది. అవడానికి ఆమె పల్లెటూరిదే అయినా, విద్యాగంధంలేని అమాయిక కాదు. విజ్ఞానం, నాగరికత అలవరచుకున్న సుందరి. పట్నంలో పినతండ్రి గారింట్లో ఉండి నాలుగో ఫారంవరకూ చదువుకుంది. రామారావుకు తనంటే ప్రాణం అని తెలుసు. ఈ స్వల్ప విషయానికి కోపం తెచ్చుకుంటాడని ఆమె కలలో కూడా అనుకోలేదు.

శ్యామల అతణ్ని ప్రసన్నం చేసుకుం

తేలేదన్నంతమాత్రాన తనకి కోపం ..దకటానికని రెండు చేతలూ కవాటానికి ఇరు

ప్రక్కలా అడ్డంపెట్టి, "తలంటి పోసుకుంటానికి రమ్మంటుంటే దొరగా రెక్కడికండీ ప్రయాణం ?" అని కిలకిల నవ్వుతూ అడ్డంగా నిలుచుంది.

మరో కప్పుడైతే రామం పరవశుడై చిలిపిచేష్టలతో ఆమెను కౌగిట చేర్చుకునేవాడు. కాని ఇప్పుడు తను లొంగితే తేలిక అయిపోతాననే అభిమానంలో అటువంటి తొందరపాటు చెందలేదు. "నాకు తలంటీ వద్దు గిలంటీ వద్దు, దారిలో తే" అన్నాడు విసుగ్గా. ఇహ లాభం లేదని శ్యామలకు తెలుసు. "నన్ను నలుగురిలో అవమానించి, పండగపూట ఏడిపించదలచుకున్నారా ?" అని ప్రశ్నించింది సూటిగా అతని కళ్లల్లోకి చూస్తూ. అతడు ఆమెవంక చూడలేకపోయాడు. ఆమె ఇలాగ అంటుందని అనుకోలేదు. "నిన్ను నేనెందుకు అవమానిస్తా... రేపు నలుగురి స్నేహితుల్లో నాకే అవమానం," బింకంగా అన్నాడు.

శ్యామల ఒక నిమిషం ఆలోచించింది. "సరే... పండక్కి మీరు నాకేం తెచ్చారో చెప్పండి ?" అంటూ శ్యామల కొంటెగా నవ్వింది. మనస్ఫూర్తిగా శ్యామల అన్న మాట కాదది. దానితో అతను రాజీకి వస్తాడనుకుంది. ఈ ప్రశ్న అతనికి శతఘ్ని విసిరినట్టే అయింది. అతడు తిరిగి ఆలోచనలో పడ్డాడు. నిజమే తను భార్యకేమీ తేలేదు. తన స్నేహితులంతా, పెళ్లాలకు పండక్కని నగలూ, నాణాలూ, చీరలూ, టాయిలెట్ సామానూ కొనుక్కుపోయారు. తను కనీసం ఒక రిబ్బన్ అయినా తేలేదు. ఏమైనా కోడలికి తీసుకువెళ్లమని తన తండ్రికూడా చెప్ప లేదు. తల్లిఉంటే చెప్పేదేమో? కాని, తల్లి చిన్నప్పుడే దాటిపోయింది. రామం తన తెలివి తక్కువకు నొచ్చుకున్నాడు. కాని, ఎందుకూ కొరగాని అభిమానం పొడుచుకు వస్తున్నది. తనను భార్య ఇలా ప్రశ్నించడం సహించలేకపోయాడు. కాదు కాదు...... తనది నిజంగా శుద్ధ తప్పని మళ్లీ అనుకున్నాడు. ఏదో ఒక సమాధానం చెప్పాలి కదా అని, "పండక్కి అల్లుళ్లకీ, కూతుళ్లకీ వస్తువులూ, బట్టలూ ఇస్తుంటే, పైగా మేం తెచ్చే ఆచార మెక్కడిది?" అన్నాడు.

ఇంతలో, "ఏమిటర్రా మీ సంఘర్షణ?.. ఇంకా నీవు తలంటి పోసుకోలేదుటోయ్?" అంటూ వీధిలోంచి లోపలికి వస్తున్న మామగారు అన్నాడు. "ఏమీ లేదు నాన్నా!.. తలంటికి రమ్మంటుంటే ఏమిటో మాటలు పెట్టుకు కూర్చున్నారు." అంది శ్యామల.

రామారావు భార్య సమాధానానికి తెల్లబోయాడు. మామగారితో జరిగిన సంగతంతా చెబుతుందేమో ననుకున్నాడు మొదట. శ్యామలలో ఇంత నేర్పరితనం ఇమిడిఉందా అనుకున్నాడు. ఇహ తప్పదనుకొని తలంటికి తయారై వెళ్లాడు.

* * *

దినకరుని ప్రచండ కిరణాలతో పుడమి వేడెక్కింది. దానికి సహపాఠిగా వెచ్చని గాలి వీస్తున్నది. పండుగ భోజనాల భుక్తా



ల్లాసంతో అంతా విశ్రాంతి తీసుకుంటున్నారు.

రామారావు భోజనాలముందరకూడా ముక్తసరిమాటలతోనే గడిపాడు. అతని ప్రవర్తనకి ఇంటిల్లిపాదీ కారణ మేమిటా అని ఆశ్చర్యపడ్డారు. ఎప్పుడు అత్తవారింటికి వచ్చినా చలాకీగా ఉంటుండేవాడు. మరదలితో సరాగా లాడేవాడు. పట్నం సంగతులూ, ప్రపంచంలోని వింతలూ బావమరదులకు ముచ్చటగా చెప్పేవాడు. ఉన్నన్ని నాళ్ళూ, శ్యామలతో కేరింతలాడుతూ కులాసాకబుర్లతో గడిపేవాడు. కానీ ఈనాటి అతని ప్రవర్తన ఎవరికీ అర్థం కాలేదు. శ్యామలకు తెలియకుండా ఉంటుందా అని, ఆమె తల్లి, అక్కగారూ ప్రశ్నించారు. కాని, శ్యామల విషయం విశదపరచకుండా మాట తప్పించింది. "ఏమిటోయ్... అలా ఉన్నావు?" అని రామారావును మామగారూ, తోడల్లుడూ ప్రశ్నించకపోలేదు. "అబ్బె!... ఏంలేదండీ... ఇక్కడేం తోచడంలేదు" అని రామారావు లేని ఉత్సాహాన్ని ప్రదర్శించాడు.

భోజనానంతరం రామారావు గదిలో మంచంమీద సిగరెట్ తాగుతూ పడుకున్నాడు. ప్రొద్దుటి సంఘటనలే ఇంకా అతను నెమరువేస్తున్నాడు. శ్యామల బుద్ధిపూర్వకంగానే ఎదురుసవాలు చేసిందనుకున్నాడు. అయినా ఇందులో సవాలేముంది? తను కచ్చితంగానిలదీసి అడగడం, కోపంగా భీష్మించుకోవడమే శ్యామల తన నావిధంగా ప్రశ్నించడానికి అవకాశం కల్గించిందని కూడా అనుకున్నాడు.

తను ఇంటిలో జరిగినదంతా మరచిపోయి, ఎప్పటిలాగా ప్రవర్తిస్తే అందరి హృదయాలు ఆనందంగా, నిశ్చలంగా ఉంటాయని రామారావు నిశ్చయించుకున్నాడు. తను బి. ఏ. చదువుతూఉన్న విజ్ఞాని. ఒక పల్లెటూరి మోటు రకం అల్లుడిలాగా తను ప్రవర్తిస్తే, నలుగురూ తనని హేళనగా చూస్తారనికూడా అతనికి తెలుసు. తను అల్లుడిబెట్టుతో అలిగి కూర్చుంటే, ఊళ్ళో నలుగురికీ తెలుస్తుంది. పాపం! శ్యామల నలుగురిలో తలెత్తలేక ఎంత నొచ్చుకుంటుందో! నిజంగా తానావిధంగానే ప్రవర్తిస్తే నలుగురిలో ఆమెకు నగుబాట్లపనే అవుతుంది. తన్మూలంగా ఆమెకు తీరని వ్యథ కలిగించినవాడవుతానని కూడా రామానికి స్ఫురించింది.

భోజనాలముందర, మామగారు, తోడల్లుని సంభాషణవల్ల, తోడల్లుని రాజకీయజ్ఞత, మామగారి విశాలవిజ్ఞానం రామానికి ఆశ్చర్యం కలిగించాయి. అతని అవిజ్ఞానాన్ని తేటతెల్లంచేశాయి. వారు సంభాషిస్తున్నంతసేపూ తను ఆవిషయంలో జోక్యం కలిగించుకోనే లేదు. కాలేజీ పుస్తకాలూ, కాలేజీ గొడవలే తనకి తెలుసు కానీ, రాజకీయాలు తన కేం తెలుసు? అంతర్జాతీయ పరిస్థితులూ, దేశంలోని ఆర్థిక మాంద్యపరిస్థితీ తన కేం తెలుసు? ఇవి తెలుసుకోవాలనే జిజ్ఞాస, శ్రద్ధ తనకెప్పుడూ కలగలే దేమని ప్రశ్నించుకున్నాడు రామం. తోడల్లుడు చదివింది మెట్రిక్కే అయినా, ఎంత విజ్ఞానం సముపార్జించుకున్నాడు? మామగారికి ఇంగ్లీషులో చెప్పుకోదగ్గ అనుభవం లేకపోయినా ఎంత విశాల విజ్ఞానం ఉంది? ప్రపంచరాజకీయాలను ఎంత చక్కగా చర్చిస్తాడు? పల్లెటూరిలో జీవించేవారు, హాయిగా నిశ్చింతగా ఉంటారని తాననుకునేవాడు. కాని, ఈనాడు, మామగారి, తోడల్లుని సంభాషణలవల్ల, పల్లెటూరివారి కష్టాలూ, అధికారులు వారిపై జరిపే దౌర్జన్యాలూ రామం తెలుసుకోగలిగాడు.

ఈయేడు మామగారు తాను బడిన కష్టాన్నీ, పంట ఫలితాన్నీ, వచ్చిన ఆదాయవ్యయాలనూ చెబుతూంటే రామానికి విసుగు కలిగించింది. ఇంటి అల్లుళ్లతో ఇవన్నీ చెప్పుకోవడం ఆత్మగౌరవానికి భంగంకాదా అనుకున్నాడు రామం! మామగారు నిష్కల్మషుడనీ, అందరూ తనవారేనని అనుకుంటాడనీ, ఆయనలో ఇంకా శతాబ్దం క్రిందటి అపేక్షలు, అంతఃకరణాలు జీర్ణించిఉన్నాయని ఆయనమాటలవల్ల రామం గ్రహించాడు. ఇప్పుడు మామగారు. ఉన్న పరిస్థితుల్లో తాను రిష్టువాచి కోరడం ధర్మంకాదని కూడా నిశ్చయించుకున్నాడు.

ఇంతలో శ్యామల గదిలోకి ప్రవేశించింది. రామం మౌనంగా ఆమెముఖంలోకి చూచాడు. ఆమె చిరునవ్వుతో అతణ్ణి సమీపించి, కాళ్లకి నమస్కరించింది. శ్యామలమొహంలో సిరులు తొణికిసలాడుతున్నాయి. ఆమె నవ్వినప్పుడు గుంతలు పడిన చెక్కిళ్లు అతణ్ణి గిలిగింతలు పెట్టాయి. ఆమె కట్టుకున్న ఆ క్రొత్త చీరరంగు, ఆమె శరీరచ్ఛాయకు బంగారానికి మేలిమి జోడించినట్టుంది. అసలే ఆమె పెదవులు దొండపండు రంగులో ఉంటాయి. అందులో తాంబూలం వేసుకున్నదేమో, రామాన్ని మైమరపించాయి. ఆమె తొడుక్కున్న పచ్చజాకెట్టు పైనుంచి చనుగవమీదుగా వ్రేలాడే గడియారం గొలుసు తళతళలు ఆమె సోయగానికి వన్నెపెట్టినట్టుంది. "ఆమె తన భాగ్యరాశి, అందాల తీవె. తన నామె ప్రేమతో పెనవేనప్పుడు విదిలించికొట్టాడు. ఇప్పుడుసితా నాపని చేస్తే?" అని రామం ప్రశ్నించుకున్నాడు. ఈ ఆలోచన రాగానే రామం సిగ్గుపడ్డాడు. మూర్ఖంగా ప్రవర్తించినందుకు తనను తాను తిట్టుకున్నాడు. ఆమె సున్నితమైన మనస్సుకు నొప్పికలిగించినందుకు తనలోనే క్షమాపణలు చెప్పుకున్నాడు.

శ్యామల భర్త పడే పరితాపాన్ని గుర్తించింది. అతనికి కలిగిన సందేహాన్ని పసికట్టింది.

"ఇంకా క్రొత్తబట్టలు కట్టుకోలేదేమండీ?", అంటూ అతని ప్రక్కన కూర్చుని, అతని చేతుల్ని, తన చేతుల్లోకి తీసుకుంది.

"శ్యామూ!... ప్రొద్దున నీకు బాధ కలిగించాయి కదూ నా మాటలు?" అంటూ రామం తప్పుచేసిన పిల్లాడిలా ఆమె కళ్లల్లోకి చూశాడు. శ్యామల కిలకిల నవ్వుతూ అతని ఒళ్లోకి వాలిపోయింది. రామం ఆమె మెడలోని గడియారం గొలుసును సరిచేస్తూ మొహంమీద వంగాడు. ఇంతలో శ్యామల' చెల్లెలు ఏదో పనిమీద ఆ గదిలోకి వచ్చింది. ఆ దృశ్యాన్ని చూచి, చేతులతో కళ్లు మూసుకొని, "అమ్మ రమ్మంటున్న దక్కా.. బావకి ఫలహారం తీసుకెళ్లటానికి." అని కిలకిల నవ్వుతూ, తుర్రున పరుగెత్తింది.

* * *

ఎండ వేడిమి, వెచ్చని గాలి కాస్త తగ్గాయి. కాఫీ ఫలహారాలు ముగించుకొని, రామం, తోడల్లుడు, మామగారూ, క్రొత్తబట్టలు ధరించి, పంచాంగ శ్రవణానికని దేవాలయానికి బయలుదేరారు. దారిలో ఎదురుగుండా ఒక ఆసామి కనిపించి, మామ

(28-వ పేజీ చూడండి)




## 8

ఈలోగా ఆమె సొంత ఊరు వెళ్లవలసి వచ్చింది. సెలవు తీసుకుంటూ బలవంతంపై ఉత్తరాలు రాస్తుంటానని ఒప్పుకొని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్లాక నేనెంత బాధపడ్డానో చెబితే ఎవరూ నమ్మరు. నమ్మవలసిన అవసరంకూడా లేదు లెండి.

ఈ మమతలూ, అనురాగాలూ, తద్వారా మనసు పడే యమయాతనలూ ఒకరికి మరొకరికి అర్థం కావు. అనురాగమనేది మనం ప్రేమించే వస్తువుపైన మాత్రమే ఆధారపడదు. అది కేవలం మన మనసుకు మట్టుకే చెందినదీ కాదు. *It exists in subject object relationship.* ఒక వస్తువు అందంగా వున్నంత మాత్రంతో - తనలోని కొన్ని గుణాలతో మాత్రమే ఆకర్షిస్తుందని చెప్పలేము - అలా అయితే అలాంటి వస్తువు అందరినీ ఆకర్షించాలి. అదెన్నడూ జరగదు. అలాగే నా మనసే అన్ని ఆకర్షణలకూ కారణమైతే దేనితోనంటే దానితో నేను సరిపెట్టుకోగలిగి ఉండాలి - అదీ సాధ్యం కాదు.

ఒక మనిషి మరొక మనిషికోసం, మరొక వస్తువుకోసం తహతహ పడుతున్నాడంటే, ఒక ఆశయంకోసం ఒక విధానంకోసం తన్నుకుంటున్నాడంటే ఇతరులకు వింతగా విచిత్రంగా కనిపిస్తుంది. కాని వీరుకూడ అలాగే మరో వాటికోసం పరితపిస్తూనే ఉంటారు. కొందరు కొందరికోసం, కొన్నిటికోసం మాత్రమే వేసారుతారు. వేదన చెందుతారు. వాటిసాధనకోసం సర్వస్వాన్ని అర్పించగలుగుతారు. అందరూ అందరికోసం, అన్నిటికోసం ఆందోళితులు కారు, కాలేరు. కాని ఇలాటి తపనలో ఏదో ఒక ఆనందమున్నదని, అదే వీరిని ముందుకు నడిపిస్తూ, వస్తుందని అందరూ అంగీకరిస్తారు. ప్రతివారూ దేనికోసమో బాధపడతారు. పోరాడుతారు. పరితపిస్తారు. ఉన్న విభేదమల్లా తమ పరిసరాలు, పరిస్థితులు, వర్గసంబంధాలు వీటన్నిటిమూలంగా, సంస్కారం విజ్ఞానం వీనిమూలంగాను కొందరు మంచివానికోసం, కొందరు చెడ్డవానికోసం అల్లాడుతారు. మంచి చెడ్డ అనేవికూడ ఎక్కువమందికి అనే అర్థంలో మాత్రమే వాడుతున్నాను. మన మనసుకు మాత్రమే కాక మనలాటి చాలమందికి ఆశయం, విధానం నచ్చితే అది మంచిదంటాము. కాని ఒక వ్యక్తి విషయంలో మన మనసు మాత్రమే గీటురాయి అవుతుంది. అప్పుడు మన మనసు కున్న సంస్కారాన్నిబట్టి మన మాశించడంలో తారతమ్యాలుంటాయి.

నేనలాగే ఆమె ఉన్నట్టుండి కనిపించకపోవడంతో ఏదో నానిత్యజీవితంలో ఒక ప్రధానాంగం తెగి పడిపోయినట్టుగా బాధపడ్డాను. ఆ బాధను నెప్పుకుని కొత్త ఊరటచెందాలనే ఉద్దేశంతో నేనొక చక్కని కావ్యం వ్రాశాను. ఎన్నో పాటలు రాశాను. ఎన్నో కథలు రాశాను. వాటిలో నా హృదయంలోని మారుమూలలను దివ్వె పట్టి చూపాను. గుండెలో రగులుతున్న కుంపటిని మాటల కందినంతవరకు అభివర్ణించాను.

నాహృదయంలో ముద్రితమైపోయిన ఆమె నభివర్ణిస్తూ ఆ కావ్యంలో ఎన్ని గీతులో వ్రాశాను. మాదొక అపూర్వ ప్రేమగా భావించాను. నా మనసులో ద్వివిధ శక్తులమధ్య - కామేచ్ఛకూ శుద్ధ ప్రేమకూ మధ్య - జరుగుతున్న ఘోర సంగ్రామాన్ని చూపాను.

"కామించి ప్రేమించి
కౌగిలింపుల ముంచి
చేమంతివిరులతో
సరులు గుచ్చగ బోదు
చాటుమాటల వలపు
చాయ తెలుపగ బోదు
ఏటుపోటుల బెట్టి
హింసించబోగు
ఘూకైన వాంఛా
వికారాలతో మరు
ద్వాటికో పారిభద్ర
ప్రభల జూప, కె
క్కటసంచి మైత్రి
చొక్కటము నేర్పించి, చి
క్కటుగుండెలోని
అక్కటికంపు గొప్ప చ
క్కటదారి జూపు
నెక్కడి మొవ్వనూలు !
ఎంత తెల్లని పాలు
నా జవరాలు
ఎంత చక్కని వాలు
నా ప్రియురాలు."

అని నాలో నేను మురిసిపోయాను. నే రాసిన గీతలను పాటలను కవుల సమితులలో, మిత్రబృందాలలో వినిపించి ఆశ్వసించాను.

ఇలా నా ప్రేమను సబ్లిమేట్ చేసుకోవచ్చునని ఆశించాను. కొన్ని భావాలను, కాంక్షలను సబ్లిమేట్ చేసుకోవచ్చునని మనశ్శాస్త్రజ్ఞు లంటారు. కాని నాకు [illegible] కొంత ప్రయత్నించిన తర్వాత విశ్వాసం కుదరలేదు. నా ప్రయత్నలోపమని ఒప్పుకునేందుకు నేను సిద్ధంగా లేను.

ఆకలీ వలపూ చాల బలీయమైన తృష్ణలు. అవి సహజవాంఛలు. వానిని తీర్చుకోవాలి. లేదా తీరక ఏడ్వాలి. అంతేకాని వానిని మరోరూపంతో, మరో కార్యమగ్నతతో తీర్చుకోలేము. ఇందుకై చాల

మంది ప్రయత్నించి విఫలులయ్యారు. అవుతున్నారు. ఆకలి వేస్తుండగా ఏ స్వర్గాన్ని చూచినా, దానిని [illegible] చినా, గానంచే [illegible] యంకోసమో జ [illegible] గొంతుకబంటిగా కూరుకుపోయినా - ఆ ఆకలి మాత్రం మరచిపోలేము. అది వీనిద్వారా తీరదు. తాత్కాలికంగా మనం మరచామనుకున్నా అది మరుక్షణమే డొక్కలలో తన్నుతూంటుంది. ఆకలిని ఆహారమే తీర్చాలి - వలపును వలపే తీర్చాలి.

ఈ పరమసత్యాన్ని తారుమారుచేయవలసిన అవసరంలేదు. దీని నంగీకరించేందుకు సిగ్గుపడవలసిన అగత్యమూ లేదు.

దిక్కువ రకంవారు ఒక ఆహారం దొరక్కపోతే ఆకలయితే ఏ పుల్లాకులనో నాకగలరు. ప్రేమభంగ మయితే మరోచోట వేడిని చల్లార్చుకోగలరు. కాని ఆహారంలా ప్రేమ కేవలం ఒక వస్తువు కాదు. ఆకలి వేసినప్పుడు తినాలి అన్నట్టు, ప్రేమించినప్పుడు శరీరాన్ని అనుభవించాలి అని అంత సులువుగా చెప్పలేము. మానవ భావపరంపరకు చెందిన విషయాలు చాల చిక్కులతో కూడినవి. ఏదో అచ్చు గ్రుద్దినట్టు గీతలు గీయలేము. ప్రేమించినప్పుడు - శరీరం మాత్రమే కాదు ఆ ప్రేమ కోరేది - ఆ ప్రేమ తాను ప్రేమిస్తున్న మనిషి ప్రేమను వాంఛిస్తుంది. అది కేవలం ఆధ్యాత్మికమూ కాదు కేవలం శారీరకమూ కాదు. రెండిటి కలయిక.

ఉత్తములు ప్రేమ భంగమయితే ఆ సత్యాన్ని గుర్తిస్తారు. తమ బాధను మరచిపోవాలన్న అత్యాశకు పోరు - పోయినవారు [illegible]వారో, అసహజ ప్రవర్తనులో మాత్రమే అవుతారు - కాని ఆ బాధను గూర్చి వ్యర్థ దీనాలాపాలతో ఏడుస్తూ కూచోరు - శుష్కవిలాస జీవనంలో మత్తులో మైమరచిపోరు కూడ. తమ భావాన్ని చేతులార చంపుకోబోయి తమనే చంపుకోరు. మరోచోటికి దానిని త్రిప్పుకోరు. ఇతరుల కరుణకోసమని కాళ్ళా వేళ్లా పడి బ్రతిమాలరు.

సత్యాంశాన్ని, వాస్తవికతను గుర్తిస్తారు, దెబ్బ తిన్న గుండె ఎన్నటికీ రక్తమే కారుస్తుంది కాని అందులోనుండి పాలు వెలువడవు. ఆగాయాన్నలా చేతనొక్కిపట్టుకు నే మరింత ఆర్ద్రీభావంతో బాధితులవేపు చూస్తారు. తమకై మాత్రమే కాక ఇతరులకై కన్నీరు విడవడం నేర్చుకుంటారు. ఇలాంటి ప్రేమభంగాలకాకరమైన సమాజవ్యవస్థలోని మూలకారణాలకై దేవులాడి కనుక్కుంటారు. వాటి వ్రేళ్లను నరికివేసేందుకు కంకణం కట్టుకుంటారు. భావాలు, భావవ్యతిరేకతలు కేవలం తలలో పుట్టవని, వాని మూలం సమాజంలో, మన వాతావరణంలో మన వ్యవస్థలో, మన సంప్రదాయాగత ఆచార వ్యవహారాలలో, నైతిక దృక్పథాలలో ఉన్నదని కనుక్కుంటారు. వాటి విచ్ఛిత్తికై తెగబడి పోరాడుతారు.

అలాగే ఆకలితో మాడే ఉత్తముడు తన ఆకలికే కాక కోటానుకోట్ల ఆకలికి మూలకారణమైన భావాల ప్రత్యవస్థపై యుద్ధం ప్రకటించి పోరాడుతాడు. ఆకలిని మరచిపోడు. అందుకై దొంగతనం చెయ్యడు. అది తీర్చుకునే హక్కు తనకూ తనలాంటివారికీ కూడ సాధించడంకోసం సర్వస్వాన్ని సమర్పణ చేస్తాడు.

క్షుధార్తులూ ప్రేమార్తులూ మరింత సానుభూతితో ఇతరుల కష్టాలను, ఆ వేదనలను అర్థంచేసుకోగలరు. వానిని మూలమట్టంగా తుడిచివేయగలరు కూడ. బాధితులను బాధితులే అర్థం చేసుకోగలరు. బాధలనుగూర్చి చదవడం, వినడం వేరు - అనుభవించడం వేరు. లేమిడిని గూర్చి, దాని పదును గూర్చి ధనవంతుల కెంత చదివినా కనీసం వారి ఊహకైనా అందదు. లక్షరూపాయల పైన ముత్తాలను గూర్చి పేదవాని కేమాత్రం భావచిత్రణం ఏర్పడుతుందో అంతే వీరికీనీ. దమ్మిడీ లేక చావడమంటే ఎలాఊహ కందుతుంది ధనికునికి? కొందరర్థమైనట్టు నటిస్తారు. అది నటనకు మించినది కాదని ఏ మాత్రం నిజమైన సంఘర్షణ వచ్చినా తేలిపోతుంది.

అలాగే ప్రేమకోసం, వాత్సల్యంకోసం, సానుభూతివాక్యంకోసం కూడ ఆరాటపడి శూన్యహృదయాలతో ఏడ్చే అభాగ్యుల మానఘోష హాయిగా అవన్నీ అందుబాటులో ఉన్నవారికిగాని, వానిలోని గొప్పదనం తెలియక ప్రేమకోసమే ఆకాంక్షించని పశువులకూ పురుగులకూ కాని వినిపించదు - వినిపించినా ఆ మూలుగు వారి నొక వికలితధ్వనిగా కలవర పెడుతుంది.

ఈ బాధతో కొన్ని నెలలు గడిపాను. కాని ఆమె నే రాసిన పదిహేను రోజులకైనా సరే ఒక ఉత్తరం రాస్తుండేది. అయితే మా యీ ఉత్తరాలలో ప్రేమను గూర్చి గాని, నా హృదయవైకల్యంగూర్చి గాని ఒక్క అక్షరం లేదంటే మీరు ఆశ్చర్యపడనక్కరలేదు.

నీకోసం చచ్చిపోతున్నానని ఆమెకు వ్రాయడంవల్ల లాభం లేదని నే నెఱుగుదును. ఆమె మరింత నొచ్చుకుంటుంది విచారపడుతుంది. అంతే. అలాగే మీరేమీ బాధపడకండి - నాకా భావం లేదు కాబట్టి నే నిలా చేయవలసివచ్చింది. ఎందుకలా ఆందోళన చెందుతారు - అని ఓదార్పులు పలికి నన్ను సంతోషపెట్టలేనని ఆమెకూ తెలుసు.

ఇరువురమూ పరస్పరం అర్థం చేసుకున్నాము - కనీసం అలా అనుకున్నాము. ఒకరికోసం ఒకరం బాధపడుతున్నామనడంలో సందేహం లేదు. కాని ఆ బాధ తొలగించేందుకై ఎవరికీ తమ భావాన్ని మార్చుకునే యిష్టం లేదు.

ఆమెకు నేను ప్రేమిస్తున్నానని తెలుసు. ఆమె ప్రేమించడం లేదనీ నాకు తెలుసు. కాని పరస్పరం ఫిర్యాదు చేసుకొనే స్థితిలో లేము. ఒకరినొకరు బ్రతిలుమాకునే స్థితిలోనూ లేము. మరి ఆమె తిరస్కారానికేదో బలీయమైన కారణముండాలని మాత్రం అనుకుంటూ వచ్చాను. తెలిసి తెలిసీ నేను నిరాకరించాక కోపపడి తెగతెంపులు చేసుకోక నన్నింకా ప్రేమిస్తూ, పైగా ఆ బాధను చెప్పకుండా నాతో మైత్రి నెందుకు నెరపుతున్నాడా అని ఆమెకూడ ఆలోచిస్తోందనుకుంటాను. తమ్ము తాము విమర్శించుకొని పరిదిద్దుకోవాలనే ప్రయత్నం తప్ప, మా యిద్దరిలోనూ మరొకరిపై తప్పను రుద్దాలన్న వాంఛ కలలో కూడా కలగలేదు. అంతరాంతరాలలో మాలో ఒకరికొకరిపై అమితానురాగం ఉందనేందుకింతకంటె గొప్పకారణం ఏంకావాలి?

కాబట్టే ఈసంగతినే ఎత్తకుండా ఇరువురమూ ఇరువురికీ అర్థమయ్యే లోకదుస్థితిని గూర్చి, సంఘ దౌష్ట్యాలనుగూర్చి, వాని తెగటార్చుకై పోరుసల్పే వారిని గూర్చి, ఆ వీరుల గాథలను కష్టపరంపరలను వినిపించే రచయితలు రచలను గూర్చి వ్రాసుకుంటూ వచ్చాము. నేనేదో పద్యం రాశాననో, కథ రాస్తున్నాననో మాత్రమే నా స్వంతసంగతి రాసేవాడిని. నే నేదో పుస్తకం చదివాననో, ఏ పురాతన

చరిత్రప్రసిద్ధ క్షేత్రమో యూశాసనో మాత్రమే ఆమె రాస్తూవచ్చేది.

అఖరు జాబులో మట్టుకామె ఒక్క మాట వ్రాసింది. *"I think you have been dissoppointed in me"* అని.

నేను వెంటనే రాశాను: *"If at all I have been satisfied with any woman that is you"*

రెండూ నిజమే, రెండూ అబద్ధమే.

అఖరుకామె కొన్ని నెలలకు తిరిగీ వచ్చింది. వచ్చిన వెంటనే ఆమె కన్పించింది. చూడగానే నాలో ఉబికి వస్తున్న సంతోషాన్ని కప్పిపుచ్చుకొని అతి సామాన్యంగా పలుకరించాను. ఆమె ఏదో పొడి మాటలతోనే సమాధానం చెప్పింది.

కాని మరుసటిరోజుమట్టుకు మహోత్సాహంతో మేము మూడు గంటలసేపు మాట్లాడుకున్నాము. ఆ యింతసేపటిలో ఆమె కోపపడింది. కోపం తెప్పించింది. నవ్వింది. నవ్వించింది - నొప్పించింది. నొప్పిపడింది.

ఇంటికివెళ్లి పోయింది.

అఖరుకు ఆలోచిస్తే మేమేమి మాట్లాడుకున్నామో నాకొక్క అక్షరం జ్ఞాపకం లేదు. ఆమెస్థితి కూడ అంతేనో కాదో చెప్పలేను. అంతే అయిఉండాలనిమట్టుకు ఆశించాను.

ఇలా చాలకాలం యథారీతిగా గడిచింది.

## 9

"నాపట్ల నీవైఖరి ఏమిటి?"

"మీకు తెలీదా?"

"తెలుసు ననుకుంటాను - కాని తెలీదు."

"నానోటితో చెప్పించాలనా?"

"కాదు నాకు తెలీదు."

"మీరంటే నాకెంతో ఇష్టం-" ఈమాటలామె ఇంగ్లీషులో అన్నది *I like you very much."*

నా వెన్నెముకలో ఏదో విద్యుచ్ఛక్తి మూలాధారంలోనుండి సహస్రారంలోనికి ప్రవహించింది. ఈలోగా ఆమె అందుకుంది... "

"...అయితే ఇది మీకు నాపైనున్న ఇష్టంలాంటిది కాదు. మీరు ఆశించేలాంటిదీ కాదు..."

"అయితే మరేమిటి?"

"మీరంటే నాకున్న అనురాగం ప్రేమంత గాఢమైన వాంఛ కాదు—"

"ప్రేమంటే ఏమిటి?..."

"ఏమిటో నాకు తెలీకపోవచ్చు. కాని ఇది ప్రేమకాదనిమట్టుకు నాకు తెలుసు. మీరంటే నాకెంత ఇష్టమో చెప్పలేను - అదెందుకో చెప్పలేను-అది ఎలాంటి రూపంతో వ్యక్తీకృత మవుతుందో కూడ ఇప్పటివరకు నాకు తెలీదు..."

కారుహారన్ వినిపించింది - సంభాషణ పుటుక్కున తెగిపోయింది. ఆమె మిత్రుడు వచ్చాడు.

ఈ సంభాషణ అలా కొనసాగేఉంటే ఎంత బరువు తీరిపోయేదో, తర్వాతి మార్గం ఎంత సుగమ మయ్యేదో ఊహించుతాను. ఒకరినొకరు స్పష్టంగా అర్థం చేసుకోగలిగి ఉండేవారమేమో - ఏమో!

ఆయన నాకు గూడ పరిచితుడే. ఈమె నాకొకసారి అతనిని పరిచయం చేసింది - ఏవో కొన్నిటిపై చర్చించాము కూడ. అతనికింతో ఇంతో సాహిత్యపిపాస ఉన్నదనీ, నా అభిప్రాయాల దామె ద్వారా తెలుసుకొని కొంత అభిమానం ఏర్పరుచుకున్నాడని మాత్రమే నాకు తెలుసు.

మా ముఖాలలోని గభీరతను చూచి మేమేవో వినోదంగా మాట్లాడ్డం లేదని, ఏవో గొప్పవిషయం మాట్లాడుకుంటూ ఆపివేశామని అతను గ్రహించాడు. లక్షక్షమాపణలతో వెళ్లిపోతానన్నాడు. అతనెంత ఆవేశపడిపోయాడంటే కుర్చీ చేతిని గట్టిగా పట్టుకున్నా అతని చేయి వణకిపోతున్నది. అతనంత కళవళపడ్డం దేనికో ఆమె కన్ని క్షమాపణలు చెప్పుకోవడం దేనికో నాకర్థంకాలేదు. మేమిరువురూ మిత్రులమని యెరిగినవాడు-ఇరువురినీ యెరిగినవాడు - ఇక సంకోచం దేనికి? కాసేపదీ ఇదీ మాట్లాడుకున్నాం. అతని భావప్రకోపం కనిపిస్తూనే ఉంది. పదేపదే అతను క్షమాపణలు చెబుతూనేఉన్నాడు. ఎందుకింత బాధ అన్నాను - విసుగుతో.

"ఆమెకు కోపం వచ్చినట్టుగా ఉంది. ఆమెకు కాదు గాని, ఆమె కళ్లకు భయపడుతున్నాను. అలా చూడండి" అన్నాడు.

నాకు సంకోచం కలిగింది. ఇలా తేలికగా మాట్లాడ్డం నాకలవాటు లేదు. అంతగా ఆమెను ప్రేమించినా అప్పటికే కాదు - ఈనాటికీ ఆమె అంగికభంగిములనో, రూపాలనోగూర్చి ఒక్క మాట అనలేదు, అనలేను. అలా అనడం చాల చౌకబారుతత్త్వ మనుకుంటాను. ఆమె నా అభిప్రాయాలు బాగా యెరుగున్నది కాబట్టే చాల కించపడింది. నేనామెను తేలికగా భావిస్తానేమో అని అనుమానించిం దనుకుంటాను. అంతేకాక తన మిత్రునిపట్ల నాకు తేలికైన భావం ఏర్పడ్డంకూడ ఆమెకు సుతరామూ ఇష్టం లేదని ఆమె ముఖం చెబుతూనే ఉంది.

నేనే వారి సంకోచం తగ్గేట్టు ఏదో మాట్లాడి పంపివేశాను - తర్వాత అతనో పెద్దపిల్లవాడని, అందుకే అతనిపై నాకొక విధమైన మమకారం ఏర్పడిందని ఒకసారామెతో చెప్పాను. అంతకంటె లోతుగా అతని విషయమై ఆలోచించలేదు.

నా మనసు చాల బాధపడుతున్నది. ఈమె అభిప్రాయ మేమిటి? ప్రేమించడం లేదని ఆమె ఎన్నిసార్లు చెప్పినా నామనసు నమ్మడం లేదు. అలా అయితే తెలిసిన తర్వాత కూడ నాతో ఇంత ఇష్టంగా మెలగుతూ, తర్వాతకూడ నా ప్రేమ ప్రసంగాలు వినడం దేనికి? దాక్షిణ్యంతో కాదని నాకు తెలుసు - సులభంగా ఆమె కిష్టంలేకపోతే నా మాటలు వినవలసిన అవకాశాలను తప్పించివేయవచ్చు. పైగా నన్ను కలుసుకునేందుకై, నాతో మాట్లాడేందుకై నా అభిప్రాయాలు, నా బాధలు తెలుసుకునేందుకు నా యంతగానూ ఆసక్తి చూపడం ఎందుకు? ఆమెలో ఏదో సంఘర్షణ బాధ ద్యోతన మవుతూండడం ఎందుకు?

ఇదంతా వట్టి బూటకమేమో - కాని అలా అనుకునేందుకు మన సొప్పదు. అంత నటించవలసిన అవసర మామె కేమి వచ్చింది. ఆమె కన్నులలో నీరు గిర్రున తిరగవలసిన అవసర మేముంది?

వీటన్నిటిమూలంగానే ఆమె తప్పకుండా నన్ను ప్రేమిస్తున్నదని, ఏదో బాహ్యకారణాలవల్ల, పరిస్థితులవల్ల వెల్లడించలేకపోతున్నదని భావించాను. అందులోను ప్రేమ అంటే నేనెంత గా[illegible] అర్థంలో వాడుతానో తెలిసినందువల్ల కూడ ఆమాటనేందుకు భయపడి ఉంటుంది.

కాని ఒక్క సంఘటన నా విశ్వాసాన్ని చెదరగొట్టింది. ఎలాగో సర్దుకొని ప్రియమిత్రులంగా గడపగల పరిస్థితి ఏర్పడుతుండగా దానిని విచ్ఛిన్నం చేసింది.

నేనామెపై వ్రాసిన కావ్యాన్ని, గీతాలను ఒక సంపుటిగా ప్రకటించి, ఆమెకంకిత మివ్వాలని చాలకాలం క్రితమే నిశ్చయించుకున్నాను. ఇందులో నాకేమాత్రం అసహజత కనిపించలేదు. ఆమె నడగవలసిన అవసర ముంటుందని కూడ అనుకోలేదు. కాని అందుకేదో ఒక తరుణం రావాలని చూస్తున్నాను. ఆమె జన్మదినం నాడు - నా కావ్య సంపుటిని చక్కని చిత్రాలతో - ముద్దు-

(20-వ పేజీ చూడండి)

# పెళ్ళిచదువు

శ్రీ భట్టిప్రోలు హనుమంతరావు

[ప్రదేశము: చౌదరయ్యగారి యిల్లు. హాలు - ఖాళీగా ఉంటుంది. ఒక చిరిచాప మాత్రం పరచియుంటుంది. చౌదరయ్య నలభై యేభై నడిమివయస్సు, సాధారణ పల్లెటూరి రైతుమనిషి.

సమయం ఉదయం 10 - 11 గం. మధ్య.]

(చేతిలో తెలుగు దినపత్రికతో చౌదరయ్య ప్రవేశం)

చౌద: (కోపంతోనూ చిరాకుతోనూ) విష్టదరిద్రుడు; పుట్టాడు నాపాలిటి యముడై. నెత్తీనోరూ మొత్తుకొన్నా పుస్తకం పట్టినపాపాన పోతేనా. అబ్బబ్బ! ఎముకలు కొరుక్కుతింటున్నాడు. ఆ మున్సబుగారి పిల్లలను మాస్తేముచ్చటవుతుంది; చిచింద్రీల్లాగా అట్టే పైకిపోయారు. చదువంటే అందరికి అబ్బుతుందీ? ఎవరికో సరస్వతీప్రసన్నమున్న అదృష్టవంతులకు గాని? ఈతొ్వష్టాన్నికి చదువెందుకంట ముల్లుకర్ర యిచ్చి పొలంతో లెయ్యక! ఇంతకూ ఒకళ్లనన్న పనేముంది? బుద్ధి గడ్డితిన్నది...అసలు దీన్నియేం చేసినా పాపంలేదు...వద్దే అంటే వింటేనా? వెధవపట్టుదల, అబ్బాయి ఉద్యోగాలు వెలగబెట్టి తన్ను అందలాలెక్కిస్తాడని గంతు లేసింది. తెలిసింది అబ్బాయి పస....తోటివాళ్లు తొడగోసుకుంటే మెడగోసుకున్నట్టుంది నా బ్రతుకు. యేయ్! ఇట్రా.

(తులశమ్మ ప్రవేశం. వయస్సు 35 సం॥ ఉండవచ్చు.)

తుల: ఎవరిమీద ధామ ధూములు చేస్తున్నారు?

చౌ: ఆ వెదవ యేడీ?

తు: ఎవరూ?

చౌ: నీ కేమన్నా మతిపోయిందా? అలా అడుగుతావు! నీ కొడుకూ!

తు: వాడేమన్నా తప్పు చేశాడా యేం?

చౌ: నీవూ వాడూ ఇంతవరకు చేసినవి చాలక ఇంకా చేయాలి!

తు: ఇంకెందుకు వాడిప్పుడు? మరి.

చౌ: చెంబెడు పేడనీళ్లు మొగాన కొట్టటానికి. పుట్టాడు, ఇల్లూ వళ్లూ గుల్లచేసి యేడ్పించటానికి.

తు: అదేమిటి అట్లా తిట్టిపోస్తారేం?

చౌ: తిట్టాలా చీల్చి చెండాడాలా? పరమహంస...అసలు వాడేడీ? ఎక్కడున్నా దాచావా యేం?

తు: బాగానే ఉంది! దాయటం దేనికి? సంగతేమిటో చెప్పకుండానే గోల చేస్తున్నారేం?

చౌ: విను నీ కొడుకు ప్రతాపము... మన దద్దమ్మ పరీక్ష తప్పి యేడ్చాడు.

తు: (నిర్ఘాంతపడి) అయ్యో.

చౌ: విన్నావా? వద్దేఅంటే వినకుండా స్కూల్లో జేర్పిస్తివే? కొడుకు చదువుకోసం బస్తీలో కాపరంకూడా వెలిగిస్తివిగా. వీమొగాన మూడువేలు కుమ్మరించాను. బూడిదలోపోసినట్లయిపోయింది. ఇట్టికుంకేనా ఉద్యోగాలుచేసి నిన్నూ నన్నూ సుఖపెట్టేది...జోలె కట్టుకొని అడుక్కుతింటానికి గూడా పనికిరాని వెధవ... అబ్బబ్బ!! కాసినిమంచినీళ్లు తెచ్చిపెట్టు.

(తులశమ్మ ఇంట్లోకివెళ్ళి గ్లాసు పట్టుకు వస్తుంది. చౌదరయ్య తాగి గ్లాసు క్రింద బెడుతూ.)

చౌ: తప్పితే తప్పాడు. అందుకు విచారించటంలా. ఇప్పుడు అనేకచిక్కులు వచ్చికూచున్నైగదా.

తు: చిక్కులేమున్నయ్యండీ ఇందులో.

చౌ: ఏమి చేయటానికి పాలుపోకుండా వచ్చింది. నట్టేట్లో పడవ మునిగినట్లయింది.

తు: (అర్థంగానట్లు) దీనికింత ఆలోచన దేనికండీ? లోకంలో అందరిలాగానే మనమూనూ! చదివించితే చదివించటం...

చౌ: చదువుగాదు చట్టుబండలు. ఆ యోగ్యతే ఉంటే ప్యాసే అయ్యేవాడు... వాడి చదువురాత ఈ సంవత్సరంతో తుడుచుకుపోయింది. ఒకొ్కక్క క్లాసులో ఇలా రెండుమూడు సర్లీలు కొడ్తుంటే ఇక తేరుకోవటం ఎప్పటికి? ఇప్పటికే రుణం ఒకటిన్నర దాటింది.

తు: పోనీ అంత ఇబ్బందేముందీ? మాన్పించేయండి. ఇంటిపట్టునే ఉండి పొలంపని చూసుకుంటాడు.

చౌ: అది ఎలాగో కాయమేననుకో! ఎంత నామర్దా!...నే వేసిన యెత్తులన్నీ మట్టిలో కలసిపోయినై. వ్యవహారం తల్లక్రిందులై కూచుంది...ఈ రోజుల్లో కనీసం స్కూలు ఫైనలన్నా ప్యాసు కాని చవటపెద్దమ్మకి పిల్ల నెవ డిస్తాడంట.....వెంకట్రాయుడి సంబంధం స్థిరపరుచుకొన్నా బాగుండిపోయేది. (నిట్టూరుస్తాడు)

తు: నే చెబితే విన్నారూ?

చౌ: చాల్లే! వీడిల్లా అఘోరిస్తాడని కలగన్నానా?

తు: వాళ్లిస్తామన్నది ఐదువేలే గదూ?

చౌ: అందుకనేగా మరి.....చూస్తూ చూస్తూ అంత తక్కువకి ఎలా ఒప్పుకొనటం? నే ననుకొన్నట్లు నీను కాలేజి మెట్టెక్కినట్లయితేనా?

తు: ఏమయ్యేదంటారేం?

చౌ: పదివేలకి చిల్లిగవ్వతగ్గినా ఒప్పుకొనేవాళ్లమా? ఏ సబ్‌జడ్జి కూతురో, ఏ కలెక్టరు మేనగోడలో నీకు కోడలు కాకపోయిందీ. (జాలిగా) ఆ అదృష్టం మనకు లేదు...రోజులు మంచివి కావు...వెంకట్రాయుడి సంబంధమే మనకు రాసిపెట్టియున్నది.

తు: ఎవరికెంత ప్రాప్తమో అంతే. తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలం రమ్మంటే ఎలా వస్తుంది?

చౌ: కాని...ఆ సంబంధంకూడా చెయిజారిపోతుందేమోననే నా భయం. వెంకట్రాయుడుమాత్రం చూస్తూచూస్తూ రత్నంలాంటి పిల్లను, ఈ తప్పినవాడికిస్తాడని నమ్మకమేముంది?

తు: ఆ పిల్లగూడా స్కూలు ఫైనలే చదువుతోందన్నాడుగదూ?

చౌ: నా భయంకూడా అదే కొంపదీసి ఆపిల్ల పరీక్షపైందేమో? తొందరగా జాగ్రత్త పడకపోతే లాభంలేదు. చేతులు కాలింతర్వాత ఆకులుపట్టుకోటం దేనికి?

తు: అందుకని ఇప్పుడేం చేద్దామంటారు?

చౌ: ఈరోజే తెనాలివెళ్లి తాంబూలాలు పుచ్చుకొని సంబంధం స్థిరపరుచుకు వస్తాను.

తు: అంతకక్కుర్తి దేనికండీ.

చౌ: ఇది నా కక్కుర్తి అంటావా?

(కోపంతో) మీ మొహాన క్రుమ్మరించిన ఆమూడువేలన్నా పూడద్దా? మన అబ్బాయి తెలివితేటలు పూర్తిగా బైటపడ్డ తర్వాత వాడి మొహం నీ మొహం చూచేదెవరంట?

తు: వాళ్ళకిమాత్రం ఈపాటికి తెలియదంటారా?

చా: అప్పుడే తెలిసేడిసిందాయేం?

తు: పోనీ మిమ్మల్నే వాళ్ళు అడిగితేనో?

చా: ఆ మాత్రం బుజ్ఞ నాకు లేదనే నీ యుద్దేశ్యమా? మా సీను మేనమామ లింటి కెళ్ళాడనీ, నాకు వాడినంబరు తెలియదనీ, చెప్తాను. అసలు రిజల్టుపడ్డ సంగతే తెలియనట్లుంటాను. ఇహ వారేంచేస్తారేం?

తు: తర్వాతనైనా వారికి తెలియదంటారా?

చా: తెలిస్తేమాత్ర మేం? తాంబూలా లైతే సగంపెళ్ళి ఐపోయినట్లేగదా. తర్వాత తెలిసినా ఫర్వాలేదు.

తు: మీ రేమన్నా అనండి. ఇంత తొందరపడటం నాకేం బాగుండలేదు. మగపెండ్లివాళ్ళం మనమే వాళ్ళింటి కెళ్ళడ మేమిటి?

చా: చాల్చాల్లే కట్టిపెట్టు శ్రీరంగనీతులు. ఇంతదాకా తెచ్చింది అసలు నీవే... (సాలోచనగా) ఐనా మొన్న ఉత్తరంలో వ్రాయనే వ్రాస్తినిగా...సంగతి సందర్భాలు ఆలోచించి వస్తానని...ఇప్పుడు నేను వెళ్ళడంలో బేసబబేమీ లేదు అన్నిందాలా వెళ్ళిరావడమే ఉత్తమం.

తు: సరే. మీ యిష్టం వచ్చినట్లుగా చెయ్యండి...లేనిపోంది నా కెందుకు....

చా: ఆ ఉత్తరయ్యం యిటు పడెయ్యి.

(తులశమ్మ తెచ్చి యిచ్చింది)

ఏమైనాసరే తాంబూలాలు పుచ్చుకోంది రాను...మన వెధవాయి యింటికి వస్తే రెండవకంటివాడికి తెలియకుండా మీ అమ్మగారింటికి వెళ్ళిపొమ్మను... సాధ్యమైనంత దగ్గర్లోనే లగ్నం పెట్టించుకొస్తా... ఇవాళా రేపూ పరీక్షసంగతి పురుగుకైనా తెలియనీయకూడదు. జాగ్ర....నే వెళ్ళివస్తా.

తు: ఇప్పుడు బస్సులేదల్లే ఉంది.

చా: బస్సుకోసం కూచుంటే బాగానే ఉంటుంది. గుఱ్ఱబ్బండీయైనా చేసుకువెళతా. తప్పుతుందీ.

తు: సరే. వెళ్ళిరండి.

చా: నే చెప్పినమాట జాగ్రత్త.

(తెర)

(26-వ పేజీ చూడండి)






"[illegible] గురించి చెప్పరూ?" [illegible] అన్నాడు సత్యం.

"నాగురించా?" అంటూ ఆశ్చర్యంగా ఆగిపోయింది సుశీల.

"ఏం అంత ఆశ్చర్యపోతున్నారు?"

"ఆశ్చర్యంగానే వుంది. నాగురించి ఏం చెప్పను? నేను అతిసామాన్యస్త్రీని. నాలో పురుషులరక్తం లేదు. నేను లాటరీలో పది వేలు సంపాయించలేదు. సంఘాన్ని ఎదిరించలేదు. అతి సామాన్యంగా గడిచే నా జీవితంలో ఏముంది చెప్పేందుకు?"

"నేను మీ జీవితం సాహసాల్తోనూ, ఏవో అనుభవాల్తోనూ నిండిందని అనటం లేదు. అతి ప్రశాంతంగా కనిపించే మీ లోంచి ఆ కథ లెలా వస్తున్నాయా...?" అని తల ఎగర వేశాడు సత్యం.

"భారతదేశంలోని ప్రతి పదో స్త్రీ జీవితం నా జీవితంతో శ్రుతి కలుపుతుంది. అంటే యీ ముప్ఫైఅయిదు కోట్లలో ఎంత మంది నాలాటివారు వున్నారో చూడండి. అందువల్ల నాలో ప్రత్యేకత లేదన్నాను [illegible]ని మీకు చెప్పకూడదని కాదు. నాకు [illegible]ప్పకూడనివేమీ లేవు." అంది సుశీల నవ్వుతూ.

"ఇదే ఆఖరుసారి యింక అడగను" అన్నాడు సత్యం బుంగమూతితో.

సుశీల నవ్వి "కోపంలో మీ మొహం వుత్త బండబ్బాయిమొఖంలా వుంటుంది. నా జీవితంలో థ్రిల్స్ లేవు. వినండి నాలుగు ముక్కల్లో చెప్తాను."

సత్యం వుత్సాహంగా తలెత్తాడు.

"అమ్మ ముఖం ఎరగను. నాన్న బీద వాడు. ఆ బీద నాన్నగూడా పదో ఏట పోయాడు. తదనంతరం బస్తీలోని మామయ్య యింటి కొచ్చాను. అత్త ఎంత చెప్తే అంత మామయ్యకి. నన్ను వదిలించుకొనేందుకు వాళ్లు నాకో పెళ్లిగూడా చేశారు. ఆయనకి నూకలు లేక, నన్ను బాలవితంతువును చేసి పోయాడు. మనువర్తిపేరిట రెండువేలూ, యీ యిల్లూ వచ్చాయి. అప్పటికి పదహారో ఏడు. సేవాసదనంలో జేరాను. స్కూల్ ఫైనల్ పాసయి, ట్రైనింగ్ చదివాను. రెండేళ్ల క్రితం కార్పరేషన్లో టీచరుగా జేరాను. నెలకి నలభైఎనిమిది వస్తాయి. యింట్లోవున్న ఆ రాజమ్మకి యిరవైరూపాలు యిస్తాను; భోజనం పెడ్తుంది. ఆరునెలలనుంచీ మీరు చూస్తున్నారే-మేడమీద గది. ఆ గదిలో నా మకాం. ఆ రాజమ్మ యింకా నలుగురైదుగురికి వంటచేసిపెట్టి తన పొట్ట పోసుకుంటుంది. ఆ రాజమ్మ యీ సుశీలకి సాయం. ఇది యీనాటిదాకా నాచరిత్ర" అంది గుక్క తిప్పకోకుండా సుశీల.

"మీరు భలేవారు. 'కట్టెకొట్టె తెచ్చె' అన్నట్లు పాతికేళ్ల మీ జీవితాన్ని పది మాటల్లో చెప్పారే!"

సుశీల తలెత్తలేదు. యిద్దరూ సందుమలుపు తిరిగారు. సుశీల తలమీద నీరెండ పడుతోంది. ఆ నీరెండలోని కాంతిని గుప్పెట్లో కిముడ్చుకోవాలనే తాపత్రయానికి ఎంత అర్థమో సుశీలని-అసలు సుశీలని-పట్టుకోవాలి అనుకోడంలో కూడా అంతే అర్థం. సత్యం తలవంచుకు నడుస్తున్నాడు. సుశీల బహు చిత్రమయిన మనిషి. తన కష్టాల్ని - యిబ్బందుల్ని ఎంత వోర్పుగా విందో పైగా తనకే కష్టాలు లేనట్లు మాట్లాడుతుంది. ముళ్లబాటల్లోంచి నడిచి-అవి పువ్వులని సరిపెట్టుకునే సహనం ఎవరు నేర్పారో యీమెకు?

"లోపలికి రారూ?" అనే సుశీల కంఠంతో యీ లోకంలోకి వచ్చిపడ్డాడు. సత్యం మెట్లు ఎక్కుతున్నాడు. సుశీల రాజమ్మతో టీ పెట్టమని చెప్పేందుకు వెళ్లింది.

ఆరునెలలనుంచి చూస్తున్నా, ఆ గది నేడెందుకో సత్యానికి కొత్తగా కన్పడింది. ప్రతివస్తువూ అమెరిగ్గా, పొందుగా, శుభ్రంగా అమర్చింది సుశీల. సుశీలకు రాని పనేమిటో? అల్లికలు, కుట్లు అన్నీ నేర్పుగా కుట్టి టేబుల్ మీద కిటికీలకు తెరలు కట్టింది. ఎంతటి క్రమశిక్షణకి ఎంత పవిత్రత! వాలుకుర్చీమీద కూచున్నాడు. సాయంత్రపుగాలి ఏవో సందేశాల్ని మోసుకు వస్తోంది.

అడుగుల చప్పుడుకు తలెత్తి చూశాడు సత్యం. సుశీల మొహం కడుక్కుని గదిలోకి వచ్చింది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది సత్యానికి తను మధ్యాహ్నం భోంచెయ్యనట్లు.

బొట్టు పెట్టుకుంటూ 'దీపాలవేళ అయింది. యిప్పుడు టీ ఏమిటి. భోంచెయ్యమంటోంది రాజమ్మ. మీరు కూడా రండి. యిద్దరం భోంచేద్దాం' అంది సుశీల.

తన ముఖం పట్టి కనుక్కుందా తను మధ్యాహ్నం భోంచెయ్యలేదని. ఇద్దరూ ఒకే పంక్తిని కూచుని నవ్వుకుంటూ భోంచేశారు.

* * *

ఆరునెలల క్రితం సుశీలతో పరిచయం అయింది సత్యానికి.

ఒకనాటి మధ్యాహ్నం ఆఫీసులో కూచుని టపా చూసుకుంటున్నాడు సత్యం. ఆరు భాగాలుగా వచ్చింది. ఒక నవలిక పోస్టులో. రచయిత ఎవరా అన్నట్టు చూశాడు సత్యం. ఎవరో స్త్రీ 'సుశి' అని రాసిపంపింది. అడ్రసుకూడా మద్రాసులోనే. మొదటిపేజి ఎలా వుంటుందో చూడబోయి నవల చివరంటా పూర్తిగా చదివాడు. తనికి చాలా బాగుంది. కాని ఆ కథకు పారితోషికం యిచ్చి ప్రచురించేపాటి శక్తి తన పత్రికకు లేదు.

'తేజస్సు' ప్రతివారమూ వెలువడటమే బ్రహ్మప్రళయంగా వుంది. డబ్బు యివ్వకుండా అచ్చువెయ్యడానికి మనస్కరించదు. డబ్బిచ్చే తాహతు 'తేజస్సు'కి లేదు. సత్యంలో నిజాయితీఅనేది పూర్తిగా చావకపోవడంవల్ల డబ్బు తను యిచ్చుకోలేనని రచయితకు తెల్పుతూ - వారిఆమోదం పొందినతర్వాత ఆ రచనలు అచ్చువేసేవాడు.

ఇంట్లో వుద్యోగం వెలిగించరాదా అనే భార్య ఎత్తిపొడుపులుగా పిల్లలు ముగ్గురికీ సరిఅయిన మందూ-మాకూ యిప్పించలేని తన నిస్సహాయం, 'డబ్బూ దస్కం వున్న వాళ్లు పత్రికలూ, పుస్తకాలూ వేసి విజ్ఞానం నలుదెసలా వెదజల్లాలిగాని, భార్యాపిల్లల్ని పోషించలేని నీకెందుకీ బాధ' అనే హితుల బోధలూ, అన్నిటినీ సహిస్తూ తన జీవితలక్ష్యం అనుకుని అలా కుంటిగా 'తేజస్సు'ని లాక్కొస్తున్న సత్యానికి

సుశీల రాసిన 'తపన' ఏదో కొత్త వార్త మోసుకొచ్చింది.

తను పైకం యివ్వలేనని, అందుకు అంగీకరిస్తే రచన తను పత్రికలో వేసుకుంటాననీ రాసిన వుత్తరం చూసుకు సుశీల నవ్వుకుంది. ఆ పత్రికా సంపాదకుడు వుత్త అమాయకుడు అని వెంటనే కనుక్కుంది. అసలు రచనలు వెయ్యటమే వుపకారంగా భావించే ఎడిటర్లు చాలామంది వున్నారు గాని పారితోషికం యివ్వలేనంటూ మనవి చేసుకునే మనిషి యితనొక్కడే కాబోలు.

పారితోషికం అక్కర్లేదని సుశీల తక్షణం రాసింది. 'తపన' 'తేజస్సు'లో పడింది.

తర్వాత సత్యం తన కృతజ్ఞత తెల్పుకోడానికి జార్జిటవున్‌లోని సందులన్నీ తిరిగి చీకటి-చీకటి పడుతూండగా సుశీల వుండే యిల్లు కనుక్కున్నాడు. అది శనివారం సాయంత్రం. రాజమ్మ బియ్యం ఏరుకుంటోంది. సుశీల సూదీ దారం పుచ్చుకు ఏదో కుడుతోంది. ఫలానా నెంబరు యిల్లు యిదేనా?-అని ప్రశ్నిస్తూ ప్రవేశించాడు సత్యం.

సుశీల తలెత్తి చూసింది. వుంగరాలు తిరిగిన క్రాపు. ఆ వుంగరాలు నుదురు మీద పడుతున్నాయి. కళ్లల్లో అసంతృప్తి-అశాంతి. చామంచాయి. పెద్దముక్కు, విశాలమైన నుదురు, కాళ్లకి చెప్పులు లేవు. తెల్లలాల్చి, కలకత్తా అంచు పంచె. బట్టలు కూడా కాస్త మాసివున్నాయి. చేతుల్లో రెండు పుస్తకాలు. తటాలున చూడగానే మనిషి పెద్దమనిషిలా కనుపించాడు.

సమాధానం చెప్పకుండా సుశీల తనని ఆపాదమస్తకం పరిశీలిస్తూంటే సత్యం ఖంగారుపడ్డాడు. కొంపతీసి తను తప్పు నెంబరింట్లో ప్రవేశించలేదుగదా! అని తటపటాయిస్తున్నాడు.

"సుశీలగారు వుండేది యీ యింట్లోనేనా?"

"నేనే - మీ కేం కావాలి?"

సత్యం ఖంగారుపడ్డాడు. ఆడంబరంలేని యీ సుశీల - తను వూహించుకున్న రచయిత్రితో సరిపోడంలేదు. ఆ కళ్లుమటుకు తనని చాలా స్నేహంగా పల్కరిస్తున్నాయి

ఒకరి నొకరు ఎరుకపర్చుకున్నారు. ఆ తర్వాత సత్యం ప్రతి శనివారం సుశీలని కలుసుకుంటుండేవాడు. ఆ పైన సుశీల అతనికి రచనలద్వారా చాలా సాయం చేసేది. అతనివద్ద ఒక్కకాని పుచ్చుకునేది కాదు. ఈ ఆరునెలలలో సుశీల రచనల వల్లనో-సుశీల సత్యాని కిచ్చిన ఆత్మబలం వల్లనో పత్రిక మూడువేలదాకా అమ్ముతోంది. సత్యం తను సుశీలకు చాలా బాకీ పడుతున్నానని అనుకునేవాడు. సత్యం పత్రిక కాస్త ఒకదారిన పడిందికాని ఇంటి వ్యవహారాలూ - డబ్బూ దస్కం అవి మొదలుపెట్టిన చోటునే వున్నాయి



సత్యం పెద్దపిల్లకు ఆరు, రెండోవానికి మూడు, చంటిపిల్లకు తొమ్మిదో నెల. దాని పోతపాలు, భార్యకి రోగం, వీటికి తోడు భర్త అప్రయోజకుడనే కసీ - యిదీ అతని జీవితక్రమం. డిగ్రీ పుచ్చుకోగానే వున్న కాస్త ఆస్తీ జర్నలిజంలో పెట్టేశాడు. మరో వుద్యోగం చేశేందుకు అతని ఆత్మ వొప్పడం లేదు. 'తేజస్సు'లో పోతున్న అతని విశ్వాసాన్ని సుశీల లేవనెత్తింది. సుశీలకి తన కష్టాలను చెప్పడంలో సత్యం కొంచెం కూడా వెనుకాడలేదు. సుశీల అన్నీ వోపిగ్గా వినేది. చాలా తక్కువ మాట్లాడేది. సత్యంతో ఏ వొక్కనాడూ తనకీ యిబ్బంది అనే మాట కూడా అనలేదు. ఆ స్నేహంతో సుశీల హృదయకవాటం తెరుచుకుంది.

* * *

1941 రెండవ ప్రపంచయుద్ధం. సత్యం పత్రిక కాస్త దారిలో పడుతోంది. సంసారం కూడా బాగానే సాగుతోంది. ఒక శనివారం సుశీలయింటికి వొచ్చాడు. ఏవో మాటల్లోపడి "తన దగ్గిర మూడువేలుంటే చక్రం తిరుగుతుంది" అన్నాడు సత్యం.

"ఎల్లా?"

"నే నెరుగున్న ప్రెస్సువాడు యుద్ధానికి భయపడి టైపులూ మిషనూ అమ్మేసి పోతున్నాడు. 3500 లు చెబుతున్నాడు. నాదగ్గిర 500 లున్నాయి మిగతాది వుంటేనా?"

"విషయమేమిటో స్థిమితంగా చెప్పండి" అంది సుశీల చేరుమాలు చివర నగ్లిషీ చేస్తూ.

సత్యం సమస్తం విశదంగా తెలియజెప్పాడు. పత్రికకు ప్రెస్‌వుంటే ఎంతో లాభం. ప్రింటింగ్ ఛార్జీలు కలిసొస్తాయి. ఎంత లేదన్నా నెలకి మరో నూరొందలు మిగులుతాయి. అంటూ గుక్కతిప్పుకోకుండా లెఖ్ఖలూ అవీ చెప్పాడు.

"మా ఆవిడవంటిమీద నగలు అమ్మేదామని వుందిగాని, ఆమెకి నామీదా, నా ప్రయోజకత్వం మీదా కొద్దిగా కూడా నమ్మకం లేదు."

"ఆ ప్రెస్‌వాడు ఎన్నాళ్లదాకా ఆగుతాడు?"

"ఇంకో పదిరోజులు వుండవచ్చు. అయినా అది మన తాహతుకిమించిన పని" అని వూరుకున్నాడు సత్యం.

సత్యం వెళ్ళేక సుశీల చాలాసేపు ఆలోచనల్లో పడింది. 'మూడువేలుంటే చక్రం తిరుగుతుంది.' పదేపదే వినిపించాయి ఆ మాటలు. తనకిమటుకు ఎవరున్నారు? వుండేందుకు యిల్లుంది. జీవనోపాధికి వుద్యోగం వుంది. అత్తారిచ్చిన రెండు వేలూ, వడ్డీ చిన్నంచిదరా, మెళ్లో మూడు పేటల గొలుసూ యివన్నీ కలిపితే మూడు వేలూ అవకేం? ఒక మంచివాడు బాగు పడతాడు.

పై శనివారం సత్యం వచ్చాడు. చాలాసేపు ఖబుర్లయాయి. "ప్రెస్‌వాడు ఏమయ్యాడు?" అని ప్రశ్నించింది సుశీల.

"యింకా ఎవరూ ఎక్కడం లేదు. నేను చాలాచోట్ల ప్రయత్నించాను. లాభం లేకపోయింది" అన్నాడు నిరుత్సాహంగా.

"మీరు సోమవారం మధ్యాహ్నం పన్నెండుగంటలవేళ ఒకసారి యిలా రాగలరా?" అంది సుశీల.

"అల్లాగే" అన్నాడు సత్యం.

సుశీల ఏనాడూ తనని ఏ పనికీ సాయం రమ్మని అడగలేదు. అకస్మాత్తుగా సోమవారం రమ్మనడం సత్యానికి వింతగా తోచింది. తలబద్దలు గొట్టుకున్నా కారణం దొరకలేదు.

సోమవారం సత్యం వచ్చేవేళకి సుశీల సిద్ధంగా వుంది. ఇద్దరూ సెనాబజారువైపు నడిచారు. సుశీల యీవిషయం, ఆవిషయం మాట్లాడుతోంది.

నెమ్మదిగా బాంక్ గుమ్మం దగ్గిర ఆగారు. సుశీల మెట్లు ఎక్కుతూ "అన్నట్టు చెప్పడం మరిచాను. నా మనువర్తి తాలూకు రెండు వేలూ, యింకా నగా నాణెం అమ్మిన మొత్తం అంతా కలిసి మూడువే లున్నాయి. అవి తీసుకుందామని మిమ్మల్ని రమ్మన్నాను. ఆ డబ్బుతో ప్రెస్సు కొనండి," అంది సత్యంవంక చూడకుండా.

కాళ్లకింద భూమి కుంగిపోతున్నట్టు అనిపించింది సత్యానికి. నిజమా! తన చెవులను నమ్మలేకుండా వున్నాడు. సుశీల తన సర్వస్వం యిచ్చేస్తోందా? తనీ త్యాగానికి అర్హుడా? వణుకుతున్న అతని వేళ్ళని చేతులోకి తీసుకు మెట్లెక్కింది సుశీల. సత్యం కళ్లమ్మట నీరు తిరిగింది.

వరాండాలో బెంచీమీద కూచుని సత్యం తనకి డబ్బు వద్దని చెప్పాడు. తనకోసం సుశీల యిలా చేయడం మంచిది కాదన్నాడు.

"దీంతో పత్రిక బాగుపడుతుంది. అయినా మీకోసం కాదు. పత్రికకోసం," అంటూ అతని మాటల్ని నెట్టేసింది.

చివరికి ప్రెస్ ఆమెపేరనన్నా కొననిమ్మన్నాడు. సుశీల కళ్లు ఎర్రబడ్డాయి. "ప్రెస్సు నా పేర కొనుక్కునేట్టయితే - మిమ్మల్నెందుకు పిల్చేదాన్ని. వూరుకోండి పిచ్చిమాటలు మీరూనూ."

భార్యతో తన అదృష్టంగురించి చెప్పడమా మానడమా? సుశీల ఆ సాయంత్రం మాటల సందర్భంలో 'యీ విషయం మనిద్దరి మధ్య - పెదవి దాటకూడదు.' అని ఆంక్ష పెట్టింది. పైగా యీ సంగతి భార్యతో చెప్తే, మరో అర్థం కల్పించవచ్చు. సుశీల స్నేహంకోసం యిచ్చిందంటే అది ఆమె కందని సమస్య.

రోజులు దొర్లుతున్నాయి. సత్యం ప్రయోజకుడయాడు. వృద్ధిలోకి వచ్చాడు. నెల నెలా రెండుమూడు వందలు మిగుల్తున్నాయి. రెండుమూడు సార్లు "యీ ఐదు వందలూ వుంచండి" అంటూ సుశీలకి యివ్వబోయాడు.

"నేను మీకు అప్పుగా యివ్వలేదు. యిస్తే పుచ్చుకునేదాన్ని" అని నవ్వి వూరుకునేది ఆమె.

* * *

రాజుల్ని బికారులుగా చేస్తే యుద్ధం, బికారుల్ని రాజులుగా చెయ్యడం సహజం. యుద్ధజ్వాలలు అలుముకుంటున్నాయి. ఎక్కడవాళ్లక్కడ పట్నం నుంచి పారిపోతున్నారు. సత్యం భార్యాపిల్లల్ని పుట్టింటికి పంపించేశాడు.

"నువ్వెందుకీ పట్నంలో? వెళ్లిపోరాదా? ఇక్కడ ఆడవాళ్లుండే పరిస్థితులు లేవు. అన్నాడు తనభార్య వెళ్లిన వారానికి సుశీలతో సత్యం.

"మీకు చుట్టాలూ పక్కాలూ వున్నారు. నాకెవరున్నారు? ఎక్కడికి పోయినా ఒకటే. ఇక్కడైతే నాసొంతయిల్లు అని అన్నా వుంది. పొరుగూర్లో నే చేసేదేమిటి?" అంది సుశీల.

మద్రాసునిండా ఖాళీయిళ్లు. పనివాళ్లు దొరకడం మహాగండంగా వుంది. బ్లాక్ అవుట్. హోటళ్ళు లేవు. షాపుల్లేవు. సినిమాల్లేవు. నానాఖంగారుగా వుంది. సత్యానికిడబ్బు మటుకు రెండుచేతులా దొరుకుతోంది. ఈమధ్య భార్యాపిల్లలు లేకపోవడం, పూర్వమంత ఆర్థిక చిక్కులు లేకపోవడంవల్లా సత్యానికి కాస్త వూపిరి తీసుకునే సమయం దొరుకుతోంది. అతను ఎక్కువ కాలం సుశీలవద్దే గడుపుతుండేవాడు.

కిందవాటాలో వుండే రాజమ్మ అందరికీ మల్లే ప్రాణాలకు భయపడి పట్నం వదిలి పారిపోయింది. సుశీల వొక్కర్తే

(29-వ పేజీ చూడండి)

# ప్రేమించాను

(14-వ పేజీ తరువాయి)

లాలికే రూపంతో ప్రకటించి ఆమెకు అంకిత మివ్వాలని అందుకై ప్రయత్నాలు కూడ చేయసాగాను. ఆ పద్యాలు ఆమె విన్నవే - చాల ఆనందం కలిగించినవే కూడ.

కాని ఆమె తన పుట్టినరోజు నాకు చెప్పలేదు. తన మిత్రులు తన కారోజు పార్టీ యిచ్చారు. ఆ సంగతీ నాకు చెప్పలేదు. తర్వాత ఎందుకు కన్పించలేదంటే అప్పుడు చెప్పింది. నా మనస్సు చివుక్కుమన్నది. నా నడుములు విరిగిపోయ్యాయి. నాబాధ నంతా కనబరచడం నా కలవాటు లేదు. దైన్యంతో ఇతరుల యెదుట మాట్లాడ్డం నాకు చేతగాదు.

అప్పుడు నా ప్రణాళికను మెల్లగా చెప్పి ఎందు కలా చేశావన్నాను. గుడ్లు మిటకరించి ఊరుకున్నది. కనీసం తర్వాతైనా ఆ పుస్తకం అంకిత మివ్వనా అని అన్నాను ఎత్తిపొడుపుగా. నిజంగానే ఆమె అదెలా సాధ్యం, ఇవ్వకండి అని ముక్తసరిగా చెప్పి ఊరుకుంది.

అప్పుడు నా గుండెలో ఎవరో - కాదు ఆమే చేతులారా - బాకుతో పొడిచి నవ్వుతున్నట్టుగా తోచింది. ఈమె నన్ను తన వర్గానికి చెందిన మిత్రులలో ఒకనిగా భావించడం లేదని, చక్కగా మాట్లాడుతున్నానుగనుక హాయిగా వినేంతవరకే తనమైత్రి అని అనుకున్నాను. ఆమె ధనికులబిడ్డ అన్న సంగతి చాలకాలంతర్వాత మొట్టమొదటిసారిగా జ్ఞాపకం వచ్చింది. కన్నెమరాహోటళ్ళలో పార్టీలివ్వగలిగి, డాన్సు జేయగలిగి కార్లలో కెళ్లగలిగి, బంగళాలో నివసించదగినవారినే ఆమె తనతో సమానులుగా చూస్తుందేమో నన్న అనుమానం తొలిసారిగా కలిగింది.

చాలమంది చాలచోట్ల చేరినప్పుడు, తమ అనుకూలం కొద్దీ ఇతరులతో పరిచయం చేసుకుంటారు. అది అంతవరకే.

జైళ్లలో వివిధ శ్రేణులకు చేరినవారం కలిసేవారం. అందులో వర్గవిభేదం, ధన విభేదం లేకుండా, అక్కడున్న ఇతరుల కన్న మన భావాలకు దగ్గర నున్నవారితో సాహచర్యం చేయడం జరుగుతుంది. అతి ప్రాణస్నేహితులంగా మెలగుతాము. ప్రతి ఉద్యమంలోను ఇది చూచాను. కాని తర్వాత జైలుగోడలు దాటగనే వాలంటీరు వాలంటీరే. నాయకుడు నాయకుడే. షావుకారుషావుకారే. బీదవాడు బీదవాడే. జైళ్లలోనూ తరగతులున్న వనుకోండి - వానిలో కూడా విభేదాలున్న వని చెబుతున్నాను.

అలాగే స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ కొందరు మిత్రులవుతారు. తర్వాత విడిపోయి సంఘంలో తమ తమ హోదాలతో ప్రవేశిస్తారు. ఇక వారిలో కోతలు తప్పవు. నిలువుకోతలూ అడ్డుకోతలూ కూడా. ఫాక్టరీలోనూ, ఫరమ్లలోనూ స్కూళ్లలోనూ పని చేసే సహోద్యోగుల సంగతికూడ అంతే— ఈ తాహతు వ్యవహారం అన్నిటా అలాగే నిలిచి గడ్డకట్టుకొని ఉంటుంది.

ఈమె మైత్రీ మేము కలిసేయింటి ఆవరణ దాటదనుకున్నాను. ఆమె అంతటితో వేరే ప్రపంచంలోకి వెడుతుంది. అంతే కాకపోతే తనకోసం వ్యధపడుతూ రక్తంతో రాసిన కావ్యం తనకు అంకిత మిస్తానన్నా అదేదో కాఫీ యిచ్చినప్పుడు థాంక్సు వద్దు అన్నట్టు అనగలదా?

ఇతరులంటూ రన్నది నిజమే - అయితే అమాత్ర మంటూరని ఆమె తన మిత్రులను పోగొట్టుకోగలదా - నేను నమ్మలేను. ఒక భావం, ఒక అనురాగం ఏదైనా కార్యరూపంలో కనిపించాలి. కొన్నిటిని చేసేందుకు ప్రేరేచాలి. వట్టి శుష్క ఆధ్యాత్మికాదరం శుష్కప్రియం మాత్రమే కావచ్చు.

ఈ సంఘటనలో నాతో ఆమె ప్రేమించలేనని చెప్పినప్పుడుకూడ కలగని గొప్ప తుపాను చెలరేగింది - ఆనాటికీ ఈనాటికీ అందులో నుండి బయటపడలే కున్నాను. ఈ చర్చలలో మరొకసారి విసుగెత్తిపోయి హఠాత్తుగా నెళ్లి "సెలవు. మరీ కలుసుకో కలసిన అవసరం లేదు." అని చెప్పాడు. ఆమెకు మాటమాడేందుకు కూడ అవకాశ మివ్వలేదు - అలా స్తంభీభూతురాలై నిలుచుంది. ఆతర్వాత ఆమె చాలరోజులు కనిపించలేదు.

అమాంతంగా తీవ్రమైన జ్వరం వచ్చి స్మారకం తప్పి పడిపోయాను. క్రమంగా నా రక్త మాంసాలు క్షీణించసాగాయి. రక్తపు పోటు హెచ్చింది. ఏ డాక్టరు చూచినా ఒక్క నిర్ణీతరోగం క్రిందికి జమ కట్ట లేకపోయాడు.

వారంరోజుల తర్వాత ఆలోచించుకునే శక్తి కలిగింది. ఆమెను మరచిపోలేకపోయాను. ఆమెను అసహ్యించుకోలేకపోయ్యాను. ద్వేషించలేకపోయ్యాను. ఆ శక్తినికూడ ఆమె నాలోనుంచీ అపహరించి వేసింది. నన్ను పాతాళలోకంలోకి త్రొక్కిపట్టింది - నాముందు పాతసంగతులు కనిపిస్తున్నవి - పాతమాటలు వినిపిస్తున్నవి.

## 10

"నాకు మీరంటే చాల యిష్టం"

"ప్రేమకూ దీనికీ స్థాయిలో మాత్రమే భేదం"

"ప్రేమంటే మీ రనేంత విశాలమైన అర్థమే ఉంటే నాదీ ప్రేమే కావచ్చు."

"మీ రంటే నా హృదయం జొత్తిగా స్పదించనే స్పందించ దనుకుంటె - అది పచ్చి అబద్ధం."

"నా అనురాగం నిజమైనదా కాదా అని చాల తీవ్రంగా ఆలోచించుకుంటున్నాను. అందువల్ల మౌనంగా ఉన్నాను."

"ప్రేమకూ దీనికీ ఒకటే భేదం - ఇది కాయికం కాదు."

"ఒక్క స్పర్శ తప్పితే మిగత వన్నీ ఇందులో ఉన్నవి."

"తల్లిపైనో తమ్మునిపైనో మరో స్నేహితునిపైనో ఉన్న అనురాగానికి ఋజువేమిటి? అ దెలాంటి క్రియారూపం ధరిస్తుందంటే ఏం చెప్పం?"

ఇలా లక్షసార్లు లక్ష రీతులుగా ఆమె తన భావాన్ని వెలువరించింది. ఆమెకు ఏమాత్రం ఇష్టం లేదని, కేవలం బాగా మాటలాడుతూంటే కాసేపు వినా లన్న ఆసక్తి తప్ప ఇది మరేమీ కాదనీ చెబుతున్న నా మాటలకు సమాధానంగా అలా అనేది.

అవన్నీ మనసారా చెప్పినవే అనేందు కేమీ సందేహం లేదు.

ఈ చర్చలలోగాని, మా అనుదిన సమావేశాలలోగాని నే నామె ఉద్రిక్తతను రేపే మాట లనను-ఆమెతో ఏకాంతంగా కలుసుకోవడ మంటూ లేదు. మా యిద్దరిమధ్యా అనుక్షణం కనీసం ఒక్క గజం దూరం వ్యవధాన ముంటుంది. ఆమె నీడనుకూడ [illegible]లిన పాపాన పోలేదు. ఆమె అందచందాల గూర్చో, ఆమె వన్నెచిన్నెల గూర్చో ఒక్క మాట అనను. వాంఛాపూరిత దృక్కులతోకూడ చూడను. ఇవన్నీకూడ ఆమెలో ఈ భావం కలగకపోవడానికి కారణమేమో!

పైగా నా మనస్తత్వ పరిభాషనూ వివేచననూ అంతా ఉపయోగించి, ఆమెకే మాత్రం మమత లేదని ఋజువు చేసేవాడిని. అస్పష్టచైతన్యం అగాధాలలో అతిద్వేషం ఉన్నా ఆశ్చర్యపడ నక్కర లేదని కూడ ఒకసారి అన్నాను. ఈ శుష్క ఆధ్యాత్మికప్రేమ, ఆచరణలో గొంతులో నీరు పోసేందుకుకూడ ప్రేరేచని వెనరు వట్టి శుష్కప్రియం అన్నాను.

ఈ మాట లనడానికి కారణం లేకపో

లేదు. నే నింత యాతన ననుభవిస్తున్నా, తనకోసమే నే నిలా కృష్టిస్తున్నానని తెలిసినా తన అనుదిన జీవితం, తన విలాస యాత్రలూ, వినోదప్రదర్శన దర్శనాలూ, యథావిధిగా సాగుతున్నవి.

ఒకసారి అన్నాను.

“మరయితే నే నీ ప్రేమనుగూర్చి మాటలాడ్డం ఇక మానేస్తాను.”

“అక్కర్లేదు.”

“మరయితే......”

“నా కలాంటి భావం ఎన్నడైనా కలిగితే తప్పకుండా వెల్లడిస్తాను. దాన్నే మాత్రం నిరోధించను. మీతో మాట్లాడుతున్నప్పుడా భావమే జ్ఞాపకం రాదు.”

“అందు కెవరు కారణం?”

“మీరే.”

“ఔను నే నిలా ప్రేమిస్తూన్నానంటూ ఉంటే నీకేదో సంబరంగా ఉంటుంది కదూ...”

“అలా మాట్లాడకండి.”

“మరి...”

“దయచేసి మాట్లాడకండి.

ఆ తర్వాత రెండు రోజులు మాట్లాడలేదు.

ఇవన్నీ జ్వరంముగతలోనే అనుకుంటుంటే ఆమెకు నాపై ప్రేమ లేదనుకోవడానికి మనస్కరించలేదు. ఇందులో ఆమె దాచిపెడుతున్నది. ఏదో జాతీయమైన కారణం ఉంది. అనుకున్నాను.

ఆమె ఈ నా జ్వరంరోజుల్లో మానసికంగానే గాక శారీరకంగా కూడ చాల బాధపడుతున్నదని, బయటకుగూడ రావడంలేదని మిత్రులద్వారా తెలిసింది. మాట పట్టింపుకోసం ఎందు కిలా చేయాలని పించింది. వెంటనే ఒక జాబు రాశాను ఆమె వచ్చింది.

పాపం ఎంత ముఖం చిన్నబోయిఉందని, మామూలు పదేళ్లు ఉన్న వయసు కన్నా తక్కువగా కనిపించే మనిషి, పదేళ్లు ఎక్కువగా కనిపించింది. చెక్కిళ్లపై చెవికింద చర్మం కొద్దిగా ముడతలు పడింది. కళ్ళక్రింద నల్లజీర లేర్పడినవి. కళ్లలో నీరు గిర్రున తిరుగుతున్నది.

క్షమించమన్నాను. కాని అసలు మా యిరువురి, నడుమ ఇంత బలీయమైన అనురాగం తోపాటు, ఈ ప్రేమ అనేమాట పలికేందుకు కూడ గాభరాపడజేసే అంతరాయ మేమిటని నాలో రేగుతున్న అనుమానం ఊరుకోనీ లేదు. తటాలున అనుకున్నాను.

“ఈమె వరినైనా ప్రేమిస్తున్నదేమో?” కళ్లలోకి అతి నిశితంగా చూస్తూ ఆలోచించేందుకూడ అవకాశం ఇవ్వకుండా అడుగుదా మనుకున్నాను. కాని ఏం నొచ్చుకుంటుందో ? అని మానివేశాను. యథారీతిగా ఏవో మాట్లాడాను. కాని నా సందేహం మెదలుతూనే ఉంది. ఆమె వెళ్లింది. నా ఆలోచన సాగుతూనే ఉంది.

ఒకవేళ మా శ్రేణీ కారణమేమో !

మే మిరువురమూ మధ్యతరగతి బుద్ధిజీవుల వర్గానికే చెందినవారమయినా ఆమె శ్రేణికి చిట్టచిటారికొమ్మపై ఉంది. నేనో అట్టడుగున ఉన్నాను. ఒక వర్గమే కావచ్చు కాని ఎంత తారతమ్యముంది !

ఏ ప్రజాఉద్యమంలోనో కలిసి పనిచేస్తే కొంత ఐక్యత ఏర్పడుతుంది. ఇక్కడ అదీ లేదు. నేను ఉద్యమాల కంకితమైన శ్రేణిలోనివాడిని. ఆమె ఉద్యోగాల కంకితమైన శ్రేణికి చెందినది.

ఆమె మిత్రులు కన్నెమరా హోటలులో కనిపిస్తారు. నామిత్రులు టీషాపుల్లోకి వెళ్లేందుకు కూడ ముందు జేబులు తడువుకొని వెడతారు. ఆ వర్గంలో నాకు మిత్రులు చాలమంది ఉన్నా నిజమైన మిత్రులు నా కీ వర్గంలోనివారే.

సనాతనాచారాలు, వ్యవహారాలు, కులమత వివక్షతలు, జాతకాలు గ్రహశాంతులు వాని కంకితమైన శ్రేణి ఆమెది.

వాటికి పూర్తిగా వ్యతిరేకమే గాక వానిపై పోరాటం సాగించే బృందం నాది.

కారులోకాని ఆమె తిరగదు.

బస్సులో వెళ్ళేందుకుకూడా నాకు డబ్బుండని రోజు లెక్కువ. ఆమె వారి అభిరుచులూ, అలవాట్లూ విలాసపరతంత్రమయినవి. బతుకగల గడ్డమే విలాసమైన వర్గం నాది.

సంస్కారం, కులీనత, తెలివితేటలు, సంఘంలో ప్రాపకం స్థాయి వీనిలో సమానత ఐక్యత ఉన్నది. కాబట్టే ఈమాత్రం సమాగమానికైన అవకాశం. కాని మామూలుగా, యాదృచ్ఛికంగా మేము కలసే తావులు ఒకటి కాదు. వెళ్ళేచోటు ఒకటి కాదు. బతికే తీరులు ఒకటి కావు.

అని ఆమెకు తెలిసి నన్ను వేరుగా చూస్తుందని అనుకుంటే అన్యాయంకన్న ఘోరముది. మా పూరికొంప కెన్నిమారులో ఆమె వస్తుంది. మే మిచ్చిన కలో అంబలో తాగుతుంది. నాకోసం మైళ్ళకొలది నడుస్తుంది. నాపై గొప్ప గౌరవాలున్నవని అనుక్షణం ఆమె కళ్లలో, ప్రవర్తనలో ఋజువులు కనిపిస్తాయి. నీవు నడవలేవేమో, ఎండలో ఎందుకు రావాలి అంటే అది అవమానంగా భావించి కోపపడుతుంది.

ఒకసారి ఎండలో వచ్చింది. అన్నం తినలేదు. తినమన్నాను. ఒప్పుకుంది. ఇద్దరం కూచున్నాము. గదిలో ఓ మూల మాసిన బట్టల బుట్టా, మరోవేపు పిడకల సంచీ, గోడకు దారంకట్టి వేలాడదీసిన ఉదికిన బట్టలూ, అతిసామాన్యమైన తిండీ - ఆమె సిగ్గుపడింది. కాని సంకోచించ లేదు - కించపడలేదు.

అందులోనా నెలల తరబడి ఉపన్యాసాల మూలంగా ధనదరిద్రతా భేదం, దేశానికీ ఉద్యమాలకూ అంకితులైనవారు తమ సుఖసంపత్తి నెలా వదులుకోవలసి వస్తుందో ధనం మీది గౌరవ మెంత పరమ నీచమో ఇవన్నీ తెలుసుకొంది. ఆభావాలపై చాల విశ్వాసం కుదుర్చుకున్నట్టు కనబడుతున్న మనిషి. హైవర్గాలవారి విలాసజీవితంలోని అవినీతిని, స్వేచ్ఛాచారిత్వాన్ని, పరశ్రమోప జీవనాన్ని అసహ్యించుకునేవాడనని తెలిసిన మనిషి.

కాని మేము సహజంగా కలుసుకునేందుకు, జీవన సహచరులంగా మారేందుకు వీలు కల్పించని ఓ పెద్ద కంచుకోటలో ఇది ప్రధానమైన భాగమని మటుకు ఒప్పుకోక తప్పదు. ముఖ్యంగా అంతరాంతరాలలో గడ్డకొనిఉన్న జీవన దృక్పథంలో మార్పు రానీకుండా ఉన్నది ఈ శ్రేణీ విభేద మనకతప్పదు. ఆమె ఎంత విన్నా, ఎంత చదివినా కొన్ని బలీయమైన కట్టుబడులకులోబడిన వ్యక్తి. పైగా తనవారు తన్నుగూర్చి ఏ మనుకుంటారో అని పిరికిగా భావించే మనిషి కాకూడదా?

ఏమైనా ఆమె నన్ను ప్రేమిస్తున్నది. నాతో కలుసుకుని మాట్లాడేందుకు తహతహపడుతుంది. కాని-అందుకై నా మైత్రికై ఏ కించిత్తైనా త్యాగం చేసేందుకు సిద్ధపడుతుందా?

చెప్పలే ననేందుకు సిగ్గుపడుతున్నాను.

ఒకసారి జబ్బుతో పడి ఉన్నాను. కొంపలో ఎవరూ లేరు. చాల బాధపడుతున్నానని ఆమెకు తెలుసు. కాని రాలేదు. ఎంతో విచారపడిఉంటుంది. కాని రాలేదు. అప్పుడే అన్నాను ; ఇంత ఆధ్యాత్మిక ప్రేమ చచ్చే గొంతుకలో ఉద్ధరిణ నీళ్లు పోసేందుకు ప్రోత్సహించక పోతే దానిని సముద్రంలోనో పడలి చేతులు కడుక్కోవడం మంచిదని.

అలా అంటే చాల నొచ్చుకుంటుంది. కళ్లలో నీరు సుళ్లు తిరుగుతుంది. నే నది చూడలేను. ఆమెలో జరిగే సంఘర్షణ చాల

బలీయమైనది. నా దృక్పథంతో ఆమెను చూచి, నా అలవాట్లతో ఆమెను పోల్చి నైతికంగా జడ్జిచేయడం అక్రమమని నిర్ధరించుకున్నాను.

అదీకాక ఈ ప్రేమా, ఇష్టమా, ఏమిటి అని కొట్టుకు చావడ మెందుకు? ఆమె మిత్రులని గుర్తించి అందులో ఆనందించక పోవడ మెందుకు? యక్షప్రశ్నలు వేసి వేధించడ మెందుకు?

కాని మరి నా ఆవేదన, బాధ -? నన్ను నేను నిగ్రహించుకోలేకపోతున్నాను - కృషించి పోతున్నాను. నడుములు విరిగి పోయినవి. ముసలితనం రోజులలో వస్తున్నట్టున్నది. భవిష్యత్తులో అచంచల విశ్వాసంతో, నానా బాధల కోర్చి స్వర్ణయుగం కోసం పోరాటం సాగించడంలో నే మహానంద మనుభవించే నాగుండె చీకటికోనల్లో నిరాశా నిస్పృహా పిశాచాలు కాపురం పెట్టాలని చూచిపోతున్నవి.

ఈ వెధవ బ్రతుకేమిటని చచ్చిపోదామనుకున్నాను. వెంటనే, నా మిత్రునికి రాశాను. అతను తక్షణమే నాకిలా రాశాడు.

"నీవంత దిగజారిపోయి చావాలనే స్థితికి వచ్చి ఉంటే తత్‌క్షణమే చచ్చిపో. నీకోసం ఒక్క కన్నీటిచుక్క విడువను. పిరికి వెధవ అని పండ్లు కొరుకుతాను."

అతను నిజమైన మార్క్సిస్టు.

కళ్లె మంపరం వదిలింది. పదిసార్లు చదివాను. ఇరవైసార్లు అర్థం చెప్పుకున్నాను. లక్షసార్లు ఆలోచించాను. నిర్ణయం మార్చుకున్నాను. ఆమెను వెళ్లి క్షమాపణ చెప్పుకున్నాను.

ఈవిషయం ఆమెతో చెప్పకుండా ఉండలేక పోయ్యాను. సమగ్రంగా వినింది. ఆమెకళ్లవేపు నాకథ ముగిశాక చూచాను - భయభ్రాంతుడనయిపోయ్యాను. నేను చచ్చిపోయే ఉంటే ఆమె ముఖ మింక ఎలా అయిపొయ్యేదో ఊహించుకోలేను - ఆమె మాట్లాడలేక పోయింది. గుండె టపటప గజందూరంలో ఉన్న నాకు వినిపిస్తున్నది.

చాల సేపయాక మెల్లగా తలవంచి అన్నది. "మిమ్మల్లను చావనీను - మీరు కావాలంటే ఏంచేయమన్నా చేస్తాను. ఏమైనాసరే - నన్ను మీరర్థం చేసుకోలేకపోతున్నారు. నన్ననుభవించాలనుంటే రెండుచేతులా అనుభవించండి. ప్రేమ మాత్రం కోరకండి - అని ఆమె వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

ఆమె ముగించకముందే సిగ్గుతో క్రుంగిపోయ్యాను. ఆకాశం బద్దలై నా నెత్తిన పడిపోతున్నట్టయింది. భూమి విరిగి పాతాళంలోనికి కూరుకొనిపోతున్నాను - ఆమె తర్వాత ఏమన్నదో నాకు వినిపించలేదు. చరాలున లేచి బయలుదేరాను. వెళ్లిపోతున్నాను. పోతూనే ఉన్నాను - నాకు తెలివి వచ్చి చూచుకునేప్పటికి ఏడు మైళ్ళదూరం వచ్చానని గ్రహించాను -

"నన్ను వదలి వెళ్లకండి - నేను బ్రతుకలేను......"

అని ఆమె నేను వస్తుంటేగా అరిచి చెప్పిన మాటలు చెవులలో గింగురుమంటున్నట్టు అప్పుడప్పుడే తెలిసుకోగలిగాను.

"మీమైత్రి నాకు కావాలి. మీ మాటలు నేను వినాలి. మీరు చూపే విశ్వకళ్యాణ మార్గం తెలుసుకోవాలి. నా తుప్పుపట్టిన బుర్రను దులిపి వేయండి. బాధితప్రజాసేవన మార్గం చూపెట్టండి. నన్నొంటరిగా వదలి వేయకండి. నా పాత విశ్వాసాలను నిర్మూలించారు. నా పాత జీవితంలో తుఫాను లేపారు. నా సుఖమయ శాంతి సంతృప్తజీవితం పునాదులు కదిల్చివేశారు - నన్నిలా శూన్యంలో వదలివేయకండి..." అని ఎప్పుడో అన్న మాటలు కళ్లయెదుట లక్ష సూర్యబింబాలలా కనిపిస్తున్నవి.

గబాలున కళ్లు మూసుకొని వెనుదిరిగాను -

## 11

సరిగ్గా పదేళ్ల తర్వాత తిరిగి నివసించిన నా పంచె గొంతెండిపోయింది. పదేళ్లుగా నిన్ను చీకటింట ఉన్న గదిలో దీపం ముట్టింతామని, పొగమారిన చిమ్నీ తుడిచి పెను సుంతగా చేయిజారిపోయింది. విరిగి వేయి ముక్కలయింది. తుడుద్దామని చీకటిలో తడుముకుంటూంటగా గాజు ముక్కలు గుచ్చుకొని నెత్తురు కారుతున్నది.

నా వెన్నెముక వంగిపోయింది. కడుపులో పేగులు పాముల్లా పెనవేసుకుంటున్నవి. తలలో లోపల పట్టిన బూజెంతున్నదో చూదామని కావచ్చు కళ్లు లోనికి నొక్కుకున్నవి. ఆరడుగుల దూరంలో నున్న వస్తువులు తప్ప చూడలేకపోతున్న చూపు లిప్పుడు, నా కాలి బొటనవేళ్ళు తప్ప ఆపైకి చూడలేకపోతున్నవి. కొండ ఎదురుపడితే మొండిగా దాగి వదలమనే గుండె. పంచుటాకును దాటలేక పటపట కొట్టుకొంటున్నది. ఆ మిగతలు నడిచిన అడుగులు ఘట్టాంగులు పడిపో... ఈడిగల బడుతున్నవి. ఏడాదిలో అరవై యేళ్లు నిండినవి.

కొన్ని జీవితాలు కొన్నిటికి అంకిత మై పోతాయి. వాటిని మార్చి మరోదారికి మరల్చ బూనుకోవడం వట్టి తెలివితక్కువ. ఆనందంకోసమే కొందరు పుడతారేమో. ఆవేదన ముందు పుట్టి వెనకనే కొందరు పుడతారు. వీరు వారు కాలేరు. వారు వీరు కారాదు.

ఒకదానికోసం ఉద్దిష్టులైవారు మరి కొన్నిటిని కూడ ప్రోదిచేసు కొనవలెనని ఆతురపడరాదు. వారుమిగత వానిని త్యాగం చెయ్యాలి. జీవిత పరమావధి పరమ ప్రయోజనాల నిశ్చయాన్ని బట్టే సాధన సంపత్తి సంతరించుకోనాలి. ధనంతా హాతు

మాత్రమే సమకూర్చే విలాసమయ జీవితం వేరు. దరిద్రం, అడుగున పరచిన బండల బతుకు ప్రేరేచే కష్టజీవనం వేరు.

అలాగే హృదయ మాశించే భావ సంతృప్తి కూడ చాల అరుదుగా లభ్యమవుతుంది. ఒక హృదయం మరొక హృదయాన్ని ఆశించవచ్చు. ఆకర్షించవచ్చు - కాని అవి పెన వేసుకోవాలంటే సంఘం కల్పించిన సప్తసముద్రాలు, సప్తకులపర్వతాలు, అడ్డు వస్తాయి.

స్వతంత్రాలోచనలు, స్వతంత్ర ప్రవర్తనలు, స్వతంత్ర క్రియాకలాపాలు పుస్తకాలలో ఉన్నంత సులువుగా జీవితంలో కనిపించవు. ఒకొక్కరూ తమ వర్గం, శ్రేణి, తాహతు కుటుంబం, పరిసరాలు, ఇవన్నీ కలగా పులగంగా తలలోకి కూరిన భావాలు, దృక్పథం వీనికి బానిసలు. స్వతంత్రంగా ఆలోచించినట్లు కనిపించే వారు ఆచరణలో మరింత బానిసలకు బానిసలు. బానిసల గుండె లెంత మంచివైనా వారి తలలు తాకట్టులో నుంటాయి. అందుకు వారి స్వభావ దౌష్ట్యం కారణం కాదు. వాని వేరులు వ్యవస్థలో పాతాళం వరకు పాతుకొని ఉన్నవి. వానిని నఱకాలి. అంతే కాని పైపై తుడుపుల కవిత్వ ప్రకాశంతో మెఱుపులు జిమ్మవు.

మనం కొన్ని వాస్తవాంశాలను గుర్తించము. గుర్తించినా వానిని ఒప్పుకునేందుకు భయపడి కళ్లు మూసుకుంటాము. అజ్ఞానంలోనే కొస్త హాయి ఉన్నదని గట్టిగా పట్టుకుంటాము.

నేనింకో విధంగా ఆమెలాంటి తాహతులోనే ఉండి, ఆమెతో సరాసరి తిరగగల అలవాట్లూ అనుకూలాలూ ఉండి, కొంపా కారూ చెక్కుబుక్కూ ఉండి, ఆ శ్రేణిలో నే ఒకడనైఉంటే ఇంత కాదు, ఇందులో లక్షవంతులు తక్కువ సంస్కారమున్నా, ఇందులో కోటివంతులు తక్కువ ప్రేమ చూపిఉన్నా పరిస్థితులు మరొక విధంగా మమ్మలను కలిపిఉండే వేమో ఏమో!

ఇందుకు మే మిరువురమూ బాధ్యులం కాదు. అనవసరంగా అందుకై ఆందోళన పడీ లాభం లేదు. జీవితాన్ని పాడుచేసుకొనీ పాముకోగల దేమీ లేదు. అట్లని నేను దెబ్బతిన్న గుండెకు కట్టుకట్టి గాయపడనే లేదని డంబాలు నరకడంవల్లకూడ వచ్చే గొప్పదన మేమీ లేదు. దానిని మాన్పుకో నివసరమూ లేదు; దానికై విలపించవలసిన పనీ లేదు. అదొక తప్పింపరాని సత్యమనుకొని, చేతనైనంతలో, బతికిఉన్నంత కాలం తిరిగీ నా పాత జీవితం గడపాలి. బాధితులను చూచి కన్నీరు విడవాలి. వారికి చేయూత నివ్వాలి. వారి గుండెకు నీళ్ళు తట్టాలి. తద్వారా నా గుండె నిబ్బరం నిలబెట్టుకోవాలి.

ఆమెపై ఈనాటికీ నా కేమాత్రం ద్వేషం కాని అసహ్యం కాని లేదు.

ఆమెను ప్రేమించాను.

ఆమె మంచి మనిషి.

ఆమె గొప్ప మనిషి.

ఆమెను ప్రేమిస్తున్నాను.

ఆమెకు నా మైత్రి కావాలి. నా ఆలోచనలు కావాలి. నా అనురాగంకూడ కావాలి. నేను కూడ - ఒక రూపంలో - కావాలి.

ఆమెహృదయంలో ఏ ఒక మూలయినా సరే నే నడిపోతే శూన్యమవుతుంది. మనసు చీకటిపడుతుంది.

ఆమె నన్ను సుఖపెట్ట లేదు. నే నామెను దుఃఖపెట్టలేను.

నన్నామె ప్రేమించలేదు. నే నామెను ప్రేమించకుండా ఉండలేను.

కాని నన్నామె వెళ్లిపొమ్మనలేదు. వెళ్ళిపోతే ఓర్చుకోలేదు కూడ. నేను వెళ్లిపోగలను. కాని వెళ్లను.

తిరిగీ ఆమెను చూస్తాను. మాట్లాడుతాను. ఆమెకు నూతన దృక్పథం కల్పించేందుకు ప్రయత్నిస్తాను. అందులోనైనా మే మిరువురమూ కలిసి ఆనందించగలం —ఏమో?

—సమాప్తం



# విజయావారి

# "పాతాళభైరవి"

మాయారంభ, స్వప్నసుందరి, మంగళ, చంద్రవంక, తిలోత్తమ, ఆకాశరాజు, మొదలైన జానపద చిత్రాలు దెబ్బతిన్న అనంతరం విడుదల అయిన విజయావారి "పాతాళభైరవి" జానపదచిత్రమై ఉండికూడా బాగా నడుస్తున్నది. "పేరులోన నేమి పెన్నిధి యున్నది?" జానపదమైనా, సాంఘికమైనా, ఆఖరుకు పౌరాణికమైనా, అందులో ప్రసిద్ధనామాలుగల తారలున్నా, లేకున్నా జనాన్ని ఆకర్షించినది చిత్రం. చిత్రంలో నిజమైన ఆకర్షణ ఉంటే జనం చూస్తారు,హర్షిస్తారు. చిత్రంతీసేవాళ్లవి మట్టిబుర్రలూ, మట్టిచేతులూ కాకుండాఉంటే చిత్రంలో ఆకర్షణా ఉంటుంది. "పాతాళభైరవి" తెలివితేటలుగా తీసిన చిత్రం. అందులో ఆకర్షణ ఉన్నది అందుకే దానికి విజయం చేకూరుతున్నది.

"పాతాళభైరవి" లో మొదటి ఆకర్షణ ఏమిటంటే అది పిల్లల పత్రికలో సీరియల్ గా వెలువడి ఆబాలగోపాలాన్నీ రంజింపజేయగల కథ. ప్రపంచమంతటా ప్రచారమైన అల్లాఉద్దీన్ లాంతరు కథ దీనికి ఆధారం మాంత్రికుడొకడు ధైర్య సాహసాలుగల యువకుడి సహాయంతో అపూర్వ శక్తిని హస్తగతం చేసుకోగోరి ఆఖరుకు ఆ శక్తిని ఆకుర్రవాడికే కోల్పోతాడు. ఆ ధైర్యసాహసాలు గల యువకుడు తన దారిద్ర్యాన్ని కోల్పోయి రాజకుమార్తెను కూడా వివాహమాడతాడు. ఈ అరబ్బీ దేశపు పిల్లలకథ పింగళివారిచేతిలో పడి పునర్జన్మ పొందింది. వీధిలో గొట్టికాయ లాడుకునే అల్లాఉద్దీన్ తోటరాముడైనాడు, మాంత్రికుడు నేపాళీమాంత్రికుడైనాడు. పింగళివారి పోషణలో ఈ పాత్రలు మూడింతలు పెరిగాయి. అంతేగాక మాంత్రికుడికి తోక కుక్కలాటి శిష్యుడూ, నాయకుడికి తోకలాటిస్నేహితుడూ ఏర్పడ్డారు. రాజుగారికి తోక శకారుడు, మేకపోతులాటివాడు, ఏర్పాటయాడు.మాంత్రికుడు కథలో ప్రవేశించకపూర్వమే తోటరాముడి సాహసాలూ, ప్రణయమూ, రాజుగారి బావమరిది కుప్పిగంతులూ కొంత వినోదం కలిగిస్తాయి.

ఈ ఇతివృత్తానికి కావలసిన వాతావరణాన్ని గోఖలే కళాసృష్టి సమకూర్చింది. మంత్రాలమర్రీ, బొడ్డుదేవరా, భూగర్భం

(48-వ పేజీ చూడుడు)



రాజరాజేశ్వరీవారి "సౌదామిని" లో

## సి. ఎస్. ఆర్., రజని

# పెళ్ళి చదువు

(16-వ పేజీ తరువాయి)

## రెండవ దృశ్యం

[వెంకట్రాయుడిగారింట్లో గది. గదిలో నాలుగు కుర్చీలు మధ్య టేబిలు – దానిమీద ఫలహారాలు. సమయం. మధ్యాహ్నం. 12 – 1 గం.ల మధ్య.]

(ఒక కుర్చీలో వెంకట్రాయుడు కూచుని యుంటాడు. వయస్సు చౌదరయ్యవయస్సే ఇంచుమించు. అతని కెదురుగా కుర్చీలో చౌదరయ్య. గుమ్మంలో కాంతమ్మ. సుమారు 35 – 40 మధ్యవయస్సు.)

కాం: అబ్బాయినికూడా తీసుకువచ్చినట్లయితే బాగుండేది.

చౌ: వాడు మేనమామల యింటికి వెళ్లి పదిహేనురోజులు కావచ్చింది. వస్తాడనే అనుకొని కొంచెం ఆలస్యంకూడా చేశాను. ఎందుకనో రాలేదు మరి.

వెంక: అన్నట్లు... శ్రీనివాసరావు పరీక్ష సంగతేమయిందండీ?

చౌ: రిజల్ట్సు రేపో యెల్లుండో వస్తాయంటున్నారే!

కాం: ఇవ్వాళే వచ్చినయ్యండి అన్నగారూ... అమ్మాయి ప్యాసైంది.

వెం: (ఆదుర్దా నటిస్తూ) ఆఁ... వచ్చినయ్యా... సరోజిని ప్యాసైందీ?

కాం: ఆఁ... శారదకూడా ప్యాసైందట.

చౌ: అదికూడా ప్యాసైందీ! అదే ప్యాసుకాగాలేంది నీ వెందుకు ప్యాసుకావు?... ఏదీ పత్రిక ఉందా?

వెంక: ఎందుకు లేదూ? నంబరెంతో చెప్పండీ!

చౌ: ఏడువేల...

వెం: ఎబ్బే! ఏడువేలెలా అవుతుందండీ? వాళ్ళ స్కూల్లోనే నలభైవేలతో ప్రారంభమవుతుంటే!

చౌ: ఐతే గుర్తులేదన్నమాటే! (చిరాకుగా) అబ్బబ్బ! వీడెప్పుడూ ఇంతే. ఏ విషయమూ మాతో మాటమాత్రం చెప్పడు గదా! స్నేహితులంత మేము చేయలేదు కాబోలు... సరోజను కనుక్కున్నారూ? నంబరు తెలుసేమో?

కాం: తెలియదంటోందే!

చౌ: ఐతే కావచ్చు... మేమడిగినా చెప్పడుగదా. అదేం పాపమో?

వెం: అదే తెలుస్తుందిలెండి! దీని కింత ఆదుర్దా దేనికి? శ్రీనివాసరావు పరీక్షఅయ్యే వుంటాడు.

చౌ: నా ధైర్యం కూడా అదే! వాడంటే మాష్టర్లకి ఎంతో ప్రాణం.... వాడి ఇంగ్లీషుమాష్టర్ని మొన్న అడిగిచూచాను. 'సీనుతప్పితే మా స్కూల్లో ప్యాసయ్యేవాడే లేడన్నాడు'... వాడి ధైర్యమేమిటో అప్పుడే కాలేజీలకు దరఖాస్తులు గూడా పెట్టేశాడు.

కాం: పైకి చదివిస్తారా అన్నగారూ?

చౌ: ఇంతవరకూ వచ్చి మానుకుంటామా? మా వాడికి కాకినాడలో చదవాలని బాగా ఉన్నట్టుంది.

వెం: అంత దూరం దేనికండీ? దగ్గర్లో గుంటూరుండగా?

చౌ: అదే నేనూ అనుకొంటున్నాను. పుట్టింతర్వాత ఇంతవరకూ వాణ్ణి విడిచిపెట్టి ఉండకపోతిమి!... నాల్గురోజులు కన్పించకపోతే ఎలాగో ఉంటుంది. ఈ నాల్గేండ్లనా కళ్లయెదుట ఉంటే తర్వాత ఎల్లానూ తప్పదు.

వెం: అంటే?

చౌ: అంటే యేముందిలెండి. తర్వాత ఏ యింజనీరింగుకో, డాక్టరీకో పంపించాల్సిందేగా.

కాం: ఇంజనీరింగైతేనే బాగుంటుందండీ... వాళ్ల వేణూ అదే చదువుతున్నాడట.

చౌ: సీను కూడా అదే పట్టుమీద కూచున్నాడు... కాని అంత పెద్దయెత్తు మనం యెత్తగలమా అనే ఆలోచిస్తున్నాను. బోలెడంత డబ్బు కావాలి.

వెం: ఏం బీదపోకిళ్లు పోతారండి బావగారూ?

చౌ: మీకేం అలాగే అంటారు. బస్తీలోనే ఉన్నారుకాబట్టి చదువులకయ్యే ఖర్చు తెలియటంలేదు... ఏమైతే యేం లెండి... చదువులేనివారికి ఈ రోజుల్లో గౌరవం లేదు.

కాం: అందుకనేగదండి ఎన్నో తంటాలు పడి మా కృష్ణుణ్ణి చదివిస్తున్నాము.

చౌ: ప్రొద్దు కూకొస్తున్నట్టుంది...... మళ్లా తిరిగి సాయంత్రమే ఇంటికి వెళ్లాలి.

కాం: రేపుదయం వెళ్లొచ్చులెండి.

చౌ: అమ్మో! వీల్లేదు... ఇంటిదగ్గర ఒక్కతే ఉంటుంది... వెళ్లాలి.

వెం: అలాగేలెండి. నేను బజారువెళ్లి కావలసినవి తీసుకొని మా పురోహితుణ్ణి పిల్చుకొనివస్తాను... ఈలోపల మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి.

చౌ: ఇదుగో ఈ డబ్బు తీసుకోండి. ఇది పెట్టి ఒక మంచి చీరా, ఒక డజను మామిడిపండ్లు పట్టుకొనిరాండి.

కాం: ఇవ్వాళ అటువంటి దేమీ అక్కర్లేదండీ అన్నగారూ!

చౌ: అలా కాదమ్మాయ్. క్రొత్త కోడలికి, తాంబూలాలు పుచ్చుకొనే రోజునే చదివింపులు చేయటం మా యింటి రివాజు (డబ్బు వెంకట్రాయుడి కిస్తాడు.)

కాం: అంటే కోడలికి బయానా యిచ్చుకుంటున్నారన్నమాట! (నవ్వుతుంది.)

చౌ: ఎబ్బెబ్బే! అలా అనకమ్మా! ఇది పూర్వంనుంచి వస్తున్న ఆచారం. పల్లెటూరి వాళ్లం కాబట్టి ఆ పద్ధతులే కావాలంటాం. అందులోనూ మీవదినె మరీమరీ చెప్పి పంపింది.

వెం: మీ ఆచారం ప్రకారమే నడుచుకొందాం లెండి.... నేను నాల్గింటికల్లా వచ్చేస్తాను:

కాం: వచ్చేటప్పుడు శారదను వెంట తీసుకురండి.

చౌ: త్వరగా రండి బావగారూ.

వెం: అలాగే.

(తెర)

## మూడవ దృశ్యం

[వెంకట్రాయుడుగారి యిల్లు. సరోజిని కృష్ణారావులు చదువుకొనే గది. ఒక డ్రాయరు, రెండువైపులా కుర్చీలు, డ్రాయరుమీద పుస్తకాలు వ్రాతసామగ్రి....

సమయం సుమారు మూడుగంటలౌతుంది]

(సరోజ కుర్చీలో కూచుని చదువుకొంటూ ఉంటుంది.. వయస్సు 18 సం॥ అప్పుడే కృష్ణారావు గదిలో ప్రవేశించి చేతిలోని కొన్ని పుస్తకాలు డ్రాయరుమీద నుంచుతాడు. కృష్ణారావు వయస్సు 20-25 మధ్య ఉంటుంది.)

కృ: ఓఁ. ఇవ్వాళ మా చెల్లాయికి బహుమానాలమీద బహుమానాలు కాబోలు— అన్నిటికంటె పెద్ద బహుమానం...

స: (పుస్తకం బల్లమీద పడేసి, చిరాగ్గా) చాల్లే అన్నాయ్. వేళాకోళాలు. (జాలిగా ముఖం పెట్టి) చదువుకొన్నవాడివి నీవు కూడా ఇలా అంటే... నా సంగతి వినేదెవరన్నాయ్?

కృ: నన్నేం చెయ్యమంటావో చెప్పు... నాన్నగారితో సాధ్యమైనంతవరకూ

చెప్పాను. నువ్వే ఆలోచించు, ఐదువేల కంటె కట్నం ఇవ్వటానికి మనకు తాహతు ఎక్కడిదీ?...చౌదరయ్యగారిని విడిచి పెడితే మరింకెట్లా...అందులోనూ వారే మనింటికివచ్చి అడుగుతుంటే? నాన్నగారిని మాత్రం ఎలా కాదంటామో చెప్పు?

స: ఐతే ఆ మొద్దబ్బాయితో పెళ్లి తప్ప దన్నమాటే? చూస్తూ, చూస్తూ తప్పినవాణ్ణి ఎట్లా....

కృ: శ్రీనివాసు తప్పాడూ?

స: తప్పక? ప్యాసవుతాడని ఎవరను కొన్నారు? ఇదేం పేపరు చూడు నంబరుందేమో?

కృ: నాన్నగారితో చెప్పావా ఈ సంగతి?

స: ఎందుకు చెప్పడం? 'ఈ సంవత్సరం కాకపోతే ముందునాటికి అవుతాడు' అంటారు. వారికి కావలసిందల్లా నా పెళ్లి ఐపోవటమే!

కృ: మరీ...చౌదరయ్యా, తనకు నంబరు తెలియదంటాడేం?

స: అంతా నటన! ఊరంతా, రిజల్టు పక్షయ్యని గోలగా ఉంటే రిజల్టు వచ్చిన సంగతే తనకు తెలియదంటాడు. నంబరు అతనికే తెలియకపోవడమేమిటి?

కృ: ఏమోలే? మన మెట్లా చెప్ప గలమూ?

స: ఒక్కటాలోచించు అన్నయ్యా! చౌదరయ్య ఉత్తరంవ్రాసి నాల్గు రోజులన్నా కాలేదే! అప్పుడే తాంబూలాలు పుచ్చుకొనే సన్నాహంతో వచ్చాడంటే వింతగా లేదూ?

కృ: ఏదో మనస్సులో బాధపడుతూ చేసే ఊహలు అవన్నీ...ఉత్తరంలో వ్రాయనే వ్రాసెగా మంచీ చెడ్డా ఆలోచించి వస్తానని!

స: ఆ ఆలోచన లేమిటో శారద చెప్పనే చెప్పిందిలే!

కృ: ఏమని చెప్పిందేం?

స: ఏమైతే యేం లాభం? పెళ్లి తప్పనప్పుడు! (నిట్టూరుస్తూ) శ్రీనివాస్ ప్యాసైనా బాగుండేది!...

కృ: ప్యాసైతే చేసుకోటానికి అభ్యంతరం లేకపోయేదన్నమాట?

స: ప్యాసైతే పెండ్లిచేసుకో నక్కర లేక నేపోయేది.

కృ: అ దెట్లాగేం?

స: ఇప్పుడుమాత్రం చౌదరయ్య నా కోసం వచ్చాడేం? మన మిచ్చే ఐదువేల కోసం వచ్చాడుగాని.

కృ: ఐతే?

స: శ్రీనివాస్ ప్యాసై, కాలేజీలో చేరి నట్లయితే...మన మిచ్చే ఐదు వేల కట్నానికి ఆశబడి నన్ను చేసుకోటానికి వచ్చే వాడనా? మన యింటివైపు కన్నెత్తయినా చూచేవాడు కాదు.

కృ: (ఆలోచిస్తూ) ఓహో...ఆ సంగతంతా చెప్పవేం మరి? సంగతి సందర్భాలన్నీ ఆలోచిస్తూనే ఉన్నావన్నమాట!... ఎవరి పెళ్లంటే వాళ్ల కంత శ్రద్ధ...సరే... ఛతే చౌదరయ్యే!

స: మొన్న తెనాలి వచ్చి, శారదతల్లితో మాట్లాడే వెళ్లాట్ట చౌదరయ్య. రిజల్టును బట్టి మన సంబంధం అటో ఇటో తేల్చుకుంటానని కూడా అన్నాట్ట.

కృ: అదేనా శారద చెప్పిందన్నావు?

స: ఔను. రిజల్టు తెలిసే ఆదుర్దాగా వచ్చాడు చౌదరయ్య. తప్పిన సంగతులు మనకు తెలిస్తే వెనుదీస్తామని తెలియనట్లుగా నటిస్తున్నాడు. శ్రీనివాస్ తప్పినా, మనం పెళ్లికి సిద్ధంగా ఉన్నామని అతనికి తెలిస్తేగా పాపం?

కృ: సరే. తెలిసిందిలే...

(గడియారం మూడుకొడ్తుంది. చౌదరయ్య ఆ గదివైపు రావటం వారిద్దరూ పరికిస్తారు.)

కృ: అదుగో చౌదరయ్య మనదగ్గిరికే వస్తున్నాడు. నే చెప్పినట్లు చెయ్యి...తరవాత ఆలోచిద్దాం మిగిలిన విషయాలు.

(సరోజ చెవులో ఏదో చెబుతాడు)

కృ: దయచేయండి మామగారు.

(చౌదరయ్య కుర్చీలో కూచుంటాడు.)

చౌ: నీ వెప్పుడు వచ్చావోయ్?

కృ: ఉదయమే వచ్చానండీ...శ్రీనివాస్ ప్యాసైనాట్టే! చాలా సంతోషం!

చౌ: (ఆశ్చర్యంగా) నీను ప్యాసైనాడు? నీ కెలా తెలుసు?

కృ: నాకు తెలిసిందలెండి. ఇదిగో మా చెల్లాయికీ, శ్రీనివాసుకూ బహుమతులు గూడా పట్టుకొచ్చాను (అంటూ కొన్ని పుస్తకాలు చూపుతాడు.)

చౌ: (తొందరగా) నీకు నంబరు తెలుసా అబ్బాయ్?

కృ: మా సరోజకు గూడా తెలుసండీ.

చౌ: మీ అమ్మతో తెలియదన్నదటగా?

కృ: ఆడపిల్లగదండీ? ఎంత చదువుకున్నా ఆడజాతికి సిగ్గనేది సహజలక్షణమంటారు పెద్దలు.

చౌ: (బతిమాలుతూ) ఔనుగాని అబ్బాయీ! నీను నిజంగా ప్యాసయినట్లేనా?

కృ: అలా అంటారేమిటి? (గంభీరంగా) ఇదుగో పేపర్లో కూడా స్పష్టంగా పడితే నలభై వేల యేడువందలఅరవైయైదు. (40,765.)

చౌ: ఆ నంబరు మా వాడిదే?

కృ: ఇంకా మీకు అనుమానమే? శ్రీనివాస్ నాకు గుంటూరు ఉత్తరం కూడా వ్రాశాడు. (జేబులో ఉత్తరం చూపిస్తాడు.)

చౌ: నిజమే యిందులో అదే నంబరుంది? మావాడు వ్రాసిందేనా ఈఉత్తరం!

కృ: ఔను. నాల్గు రోజులైంది వ్రాసి.

చౌ: ఆరి వెధవా! ప్యాసైనాడూ? నా మతి మండినట్లే ఉంది. నంబరే సరిగా గుర్తులేదు.

కృ: ఐతే హిందూ కాలేజీలోనా క్రిస్టియన్ కాలేజీలోనాండి శ్రీనివాసును చేర్చేది?

చౌ: అవన్నీ తెలిసినవాడివి నిన్నాలోచించకుండా చేస్తామా?

కృ: క్రిస్టియన్ కాలేజీలోనే చేర్చండి అక్కడే బాగుంటుంది!

చౌ: ఆ విషయాలన్నీ నిదానంగా ఆలోచించుకొందాంగాని, నేను కొంచెం బజారు వెళ్లివస్తాను...

కృ: నాన్నగారు వచ్చే టైమైందల్లే వుంది?

చౌ: అందుకనే! నేనూ త్వరలోనే వస్తాను (నిష్క్రమిస్తాడు.)

స: ఇదేమిటన్నాయ్?

కృ: నేం జేసిందేముంది?...ఇంత నీచులతో నా సంబంధం? ఛీ ఛీ! ఎత్తువేశాం మరి. ఫలించవచ్చు...నీవు చెప్పిన సంగతే నిజమైతే చౌదరయ్య మళ్లా మన గడప త్రొక్కడు. కాని, ఏదెట్లా ఉన్నా గప్ చిప్‌గా ఉండాలి. నాన్నగారికి తెలిస్తే మాత్రం మన మర్యాద దక్కదు.

(తెర)

## నాలుగవ దృశ్యం

[చౌదరయ్యగారి యిల్లు - మొదటి సీనులో మాదిరిగానే ఉంటుంది. సాయంత్రం 4 - 5 గం॥ల మధ్య.]

చౌ: ఏయ్... పిచ్చివెధవ. ఒకవేళ తప్పితే చివాట్లు వేస్తానని నాకు తప్పుడు నంబరు చెప్పాడు కాబోలు...అదృష్టం అంటే అలా ఉండాలి. వ్రాసిపెట్టంది ఎలా జరుగుతుందీ...అందుకనే భగవంతుడు కృష్ణారావు రూపంలోవచ్చి రక్షించాడు.

తు: (ప్రవేశించి) ఎవరితో నండి మాట్లాడుతున్నారు?

చౌ: నా అదృష్టదేవతతో.

తు: సరే బాగానే ఉంది. అప్పుడే వచ్చారే తాంబూలాలు కూడా అయిపోయి నయ్యా యేం?

చౌ: ఉండు. అంతకంటె మంచి శుభవర్తమానమే తెచ్చా.

తు: (ఆత్రుతతో) ఏమిటండీ?

చౌ: (ఉల్లాసంతో) మన సీను ప్యాసైనాట్టే...నాకు తప్పు నంబరు చెప్పాడు.

తు: (తొందరగా) ఆఁ...ఏమిటీ? ఎవరు చెప్పారు?

చౌ: వాళ్ల సరోజ చెప్పింది...వాళ్ల యింటిల్లిపాదీ చెప్పారు.

తు: ఆ పిల్ల కెలా తెలుసు?

చౌ: చెప్పాడుగామాలు...పాపం! అనవసరంగా తిట్టాను.

తు: ఇదేం చిత్రం? సీను ప్యాసైనాడని వాళ్లు చెప్పట మేమిటి? వాడి నంబరు వాడే మరచిపోయినాడా యేం ఖర్మం? సీనూ! సీనూ!...తప్పిపోయినానని యేడుస్తూ కూచున్నాడేం? అరి తెలివి తక్కువ వెధవా?

చౌ: వాణ్ణి మీ అమ్మగారింటికి పంపలేదూ?

తు: తప్పిపోయినందుకు నామర్దాగా ఉందట...వెళ్లనని పట్టుబట్టాడు. తెనాలి వెళ్లి యేదో పుస్తకం పట్టుకొచ్చాడు.

చౌ: తప్పిపోయా నంటున్నాడా... ఇదేదో నాటకంలాగా ఉందేం?

తు: సీనూ! మీనాన్న పిలుస్తున్నార్రా

(బిక్క మొగంతో సీను ప్రవేశం)

చౌ: ఏరా సీనూ! నీవు పరీక్ష కాలేదూ?

సీ: ఇంగ్లీషులో...నా...లు...గు మార్కులతక్కువచ్చి పోయిందినాన్నా.

చౌ: అట్లా అంటావేంరా? నీ నంబ రెంత? అదీ జ్ఞాపకం లేదా?

సీ: న...నలభై...వేల...తొంబ...వం దల...అరవై...నా...లు...గు....ఇదిగో రిజస్టరు కూడా.

చౌ: నేనూ అంతే అనుకొన్నాను.... ఐతే అరవై ఐదెవరిది?

సీ: నా తర్వాత నంబరు...శారదది.

చౌ: నీ నంబరు అరవైయైదని కృష్ణారావుకు ఉత్తరం కూడా వ్రాశావటగా?

సీ: కృష్ణారా వెవరు?

చౌ: సరోజిని అన్నరా!

సీ: సరోజిని అన్నా! నాకు తెలియదే!

చౌ: ఆరె దొంగవధవలూ.

తు: ఏమిటండీ?

చౌ: ఏమిటండీ ఏమిటి ఇంకా! నన్ను మోసగించారు..... తెలియటంలా? మన దరిద్రుడు తప్పిపోయాడని వాళ్ల కదివరకే తెలిసినట్టుంది; ప్యాసైనాడని నాతో తప్పుడుకూతలు కూశారు.

తు: ఇంతలో మునిగిపోయిం దేముందీ? పెళ్లయ్యిందాకా అట్లాగే అనుకోటం మంచిదేగా? నంబరు సరిగా వాళ్లకు తెలియదో యేమో?

చౌ: ఏడిచినట్టే ఉంది నీ ధోరణి! నీ మట్టిబుర్రకు అర్థమయి యేడిస్తేగా! ఈ చవటకి పెళ్లి రాతకూడానా! వాళ్లు నన్ను పంపేసేందుకే ఆ పన్నాగం పన్నారు. ఆ మాట చెప్పగానే, ఇంకేం వీడు నిజంగానే ప్యాసైనాడనుకొని గప్‌చిప్‌గా వచ్చేశాను.

తు: తాంబూలాలు పుచ్చుకోలేదన్న మాట!

చౌ: అఘోరించినట్టుంది! అవే ఐపోతే ఈ గొడవంతా దేనికి? వాళ్లకు మొగం తప్పించి దొంగలాగా పారిపోయి రావడం దేనికి. ఆ కృష్ణారావు దాపురించాడు మధ్య. ఇదంతా వాడు చేసిందే! వాళ్లను మోసంచేయబోతే వాడు నన్ను మోసం చేశాడు...నాకు తగిన శిక్షే జరిగింది.

తు: అయ్యో రాతా! ఆ ఐదు వేలూ కూడా లేకుండా చేశారన్నమాట.

చౌ: ఇప్పుడు యేడిచేదే అది!...... సరేలే. ఐపోయిందేదో ఐపోయింది. ఈ సంగతి బైటికి పొక్కనీయకు.

తు: ఇంకా అంతకంటె చేసే దేముంది లెండి...

చౌ: ఈనాటికి ప్యాసు కాకపోతే ముందునాటికి కాదా...కాలేజీలో ఇక చేరనే చేరడా. దుర్మార్గులు. వీళ్ల మొగం మీద కొట్టినట్టు పదివేలైనా కళ్లజూసందే పెళ్లి చెయ్యనే చెయ్యను. చూదాంగా.

తు: అంతే లెండి.

(తెర)

★

## అల్లుళ్ల కోరికలు

(14-వ పేజీ తరువాయి)

గారితోపాటు ఇద్దరు అల్లుళ్లకీ నమస్కరించాడు.

"ఏం సీతారామయ్యా!......పండక్కి అల్లుడు వచ్చాడా?" అంటూ రామం మామగారు ఆ ఆసామిని ప్రశ్నించాడు.

"నాకంత అదృష్టమా పంతులుగారూ! పెళ్లిలో ఇస్తానన్న రేడియో సెట్టు ఇంకా కొనివ్వలేదని అలిగి రానని ఉత్తరం వ్రాశాడు. కూతురూ, అల్లుడూ చిలకా గోరింకల్లా పండక్కి ఇంట్లో మెసులుతుంటే చూచి ఆనందించే యోగం నాకు లేకపోయింది. మా పిల్లది ఎంతో చిన్నబుచ్చుకుంది. ఎంతో బలవంతంచేసి, కోప్పడితే దానికి తెచ్చిన కొత్త బట్టలు కట్టుకుంది...ఎలాగూ తప్పదు. పొలం తనఖా పెట్టయినా, రేడియో కొనిస్తేగాని అల్లుడి అలక తీరేట్టు లేదు పంతులుగారూ!" అన్నాడు సీతారామయ్య.

"పాపం!... పిల్లలుగలవాడివి...వచ్చే ఫలసాయం చాలదు. అందులో ఈ ఏడు పంటకూడా దెబ్బతినింది...పొలం తనఖా పెడితే మళ్లీ కూడదీసుకోవడం ఎంత కష్టం" సానుభూతితో అన్నాడు మామగారు.

ఈ సంభాషణ రామంహృదయాన్ని మరింత కలతపెట్టింది. చక్కని గుణపాఠం నేర్పింది. "పాపం...వీళ్లు పడే కష్టాలు బస్తీలో జల్సాగా తిరిగే అల్లుళ్ళకేం తెలుస్తాయి." అనుకున్నాడు. అప్పటికప్పుడే తన అల్లుని హుందాతనానికి స్వస్తివాచకం చెప్పాడు. ఆ మాటా ఈ మాటా చెప్పుకుంటూ, నలుగురూ దేవాలయం ప్రవేశించారు.

★

# సుశీ

(19-వ పేజీ తరువాయి)

ఆడది ఇంట్లో వుండటంనికి ఎలా? తను సాయం వుంటానన్నాడు సుశీలతో. సందులు - బజార్లు నిర్మానుష్యం. సుశీల అలాగే స్కూలికి వెళ్లి వస్తోం డేది. స్కూళ్లకి సెలవ లిచ్చారు. సుశీల ఒకనాడు సత్యంతో "ఎ. ఆర్. పి. లో జేరుతున్నాను." అంది.

"స్కూలు లేదుగా యింట్లో వుండరాదూ - యీ బాధలన్నీ ఎందుకూ?" అన్నాడు కనుబొమలు దిద్దుతూ సత్యం.

"ఇంట్లో తోచద్దూ? యిరవైనాలుగు గంటలూ ఏం చెయ్యను?" అంది బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ.

"నే నున్నానుగా" అన్నాడు కొంటెగా నవ్వుతూ.

"మీ రుంటే మీతో నేనా ప్రపంచం?" అంది ఛర్రున చూస్తూ సుశీల.

సత్యం అథఃపాతాళానికి కృంగినట్లు తలపోశాడు. ఈ రెండు నెలలలోనూ సత్యం సుశీల తనని ఎంత ప్రేమించింది తెలుసుకున్నాడు. బయట పత్రికల్లో పని చేసే మొగవాళ్లు సంసారాల్ని పంపి తిండి తిప్పలు లేక యిబ్బందులు పడ్తూంటే తను హాయిగా సుశీల చేత్తో చేసిన పదార్థాలు తిని, ఖుషీగా బతుకుతున్నాడు. ఇటు పత్రిక దివిటీలా వెలుగుతోంది. స్త్రీ, తను ప్రేమించిన పురుషుణ్ణి ఏ ఔన్నత్యాలకి గొనిపోతుందో యీ నాడు తెలిసింది సత్యానికి. సత్యం తన వైవాహిక జీవితంలో స్త్రీని పిల్లలుకనే యంత్రంలా, భర్తమీద విసుక్కునే మనిషిలా, ఓర్పులేని మాతలా చూశాడు. అతనికి సుశీలసాంగత్యంతో స్త్రీ అంటే ఏమిటో మొట్టమొదటిసారి తెలిసింది. సుశీల తనది. తను సుశీలవాడు. తను జీవితాలు పెనవేసుకుపోయినాయని అనుకునే వేళకి సుశీల యీ మాటలు అంది.

సుశీల తనకి అర్థం కాదా? తను అర్థం చేసుకోలేడా? తను లేనిదే బ్రతకలేను అన్నట్లు ప్రవర్తించి కరుకుగా యిలా మాటల్తో నొప్పిస్తుందే?

"ఆ ప్రూఫులు కానియ్యండి" అన్న సుశీలకేకతో తలెత్తి చూశాడు.

ఎదురుగుండా కాఫీతో నుల్చుంది సుశీల. ఆ కళ్లు తనని పిల్చి పీడిస్తున్నాయి. తేరిపార చూస్తున్నాడు ఆమె కళ్లల్లోకి.

నుదిటిమీద నుంచి వుంగరాల్ని పైకి తోస్తూ "బండబ్బాయికి పని జరగదు - వూ—" అంది సుశీల అతని తలని గుండెలకు హత్తుకుంటూ. సత్యం ప్రపంచాన్ని మర్చిపోయాడు.

* * *

నాలుగోనాటి సాయంత్రం సత్యం యింటికి వొచ్చేవేళకి సుశీల సత్యంకోసం బనియనులు కుడుతోంది. 'సుశీ - నిన్న రాత్రి బాంబు వేశారట - మనకి తెలీనేలేదు." అన్నాడు పక్కన జేరుతూ.

"వూ" అంది తలెత్తకుండా.

"మ నింటిమీద పడుంటేనో?"

"ఏం పడితే - అంతకంటె మంచి చావు నే కోరుకోను." అంది సత్యం తలని వొళ్ళోకి లాక్కుని నుదుటిమీద జుట్టు పైకి తోస్తూ.

ఆ క్షణాన బాంబు పడిపోతే ఎంత బాగుండును - అనుకున్నాడు సత్యం. ఈ మాట ప్రతి క్షణం అతనికి జ్ఞాపకం వస్తూంది. అందరికీ యుద్ధం ఒక భీభత్సం. తన కది సుందరస్వప్నం.

* * *

కొంచెం వత్తిడి తగ్గింది. తాళాలు వేసుకున్న యిళ్లను తెరిచి మొగవాళ్లు ప్రవేశిస్తున్నారు. రాజమ్మ కూడా తిరిగొచ్చింది. ఇంకో రెండు నెలలకి సత్యం భార్యగూడా తిరిగివచ్చింది ముగ్గురు పిల్లలతోనూ.

* * *

1945 లో యుద్ధం పూర్తిఅయింది. సత్యంజీవితంలో అనేక మార్పులొచ్చాయి. యుద్ధంలో చాలామంది వేలూ లక్షలూ సంపాయించారు. ఎల్లా అని అడిగితే, అది వారికే తెలీదు. బ్లాక్ అనండి ఏది అనండి, ఒక లక్షరూపాయలుదాకా ఆస్తి సంపాయించాడు సత్యం. చివర ఎవాక్యుయీ షణ్ క్లైములో చక్కటి మూడు బంగళాలు కొన్నాడు. అతని చక్రం తిరిగింది. డబ్బుతోపాటు పేరప్రతిష్ఠ లొచ్చాయి. పత్రిక రెండుమూడు వేలనుంచి - యిరవై ముప్ఫయివేలదాకా అమ్ముడుపోతోంది. ఎన్ని పనులున్నా ప్రతి శనివారమూ రెండుగంటలనించి రాత్రి పదిగంటలదాకా సుశీలతో గడుపుతూంటాడు.

కార్లూ, బంగళాలూ, అధికారం సత్యం జీవిత విధానాన్ని మార్చేశాయి కాని సుశీలలో కించిత్తుకూడా మార్పు లేదు

"మాంబళంలో మేడ కట్టిస్తున్నాను," అన్నాడు సత్యం.

"బాగుంది" అంది సుశీల.

"నీకోసం" అన్నాడు.

"నాకెందుకు నాయిల్లు నాకుందిగా?"

"యీ యిల్లు పాతబడిపోయింది. సందులా అవీ గలీజుగా వుంటుంది. అది నీకోసం" అన్నాడు పురుషదర్పంతో.

"అల్లాగా" అంది తలొంచుకు సుశీల

"ఎన్నాళ్లనుంచో చెప్పాలని వుంది! నువ్వింక ఉద్యోగం మానెయ్యరాదూ?".

"ఏం?" అంది సుశీల.

"ఈ డబ్బంతా నీది కాదూ? హాయిగా మాంబళం యింట్లో నువ్వుండచ్చు"

"వూ"

"నెల కొచ్చే ఆ యెనభై రూపాయలకే యీ కష్టం దేనికి? యింత వుండగా నువ్వుకూడా సంపాయించడం ఎందుకు? యీ యిల్లు అద్దె కివ్వడమో అమ్మడమో చేస్తే సరి" అన్నాడు ధైర్యంగా.

"నే నెందుకు వుద్యోగం మానాలి? యీ యింట్లోంచి కదిలే అవసరం నాకొట్టే కనపడటం లేదు. సందులూ గొందులూ అంటారా? నాకివి పదిపదిహేనేళ్ల నుంచి అలవాటు. అందువల్ల ఫరవాలేదు. మీ రే ఆకట్టబోయే యింట్లో వుండండి. నే సంపాయించుకు నేది నాకోసం."

సుశీల సమాధానం చెప్పి లోపలికి వెళ్లిపోయింది. సత్యం హతాశుడై కూర్చుండిపోయాడు. అలాగే కొంసేపుండి యింటి దారి పట్టాడు.

* * *

మరుసటి శనివారం సత్యం సుశీల యింటికొచ్చాడు. సుశీల ఏదో అల్లుతోంది. తలెత్తి చూసింది. గుమ్మంలో సత్యం.

మొట్టమొదటిసారి తను చూసిన సత్యానికీ యితనికీ ఎంత తేడా. ట్వీడ్ సూటులో సత్యం. చేతులో పుస్తకాలకి బదులు సిగరెట్ డబ్బా. తీర్చి దిద్దిన క్రాపు. కళ్లలో అశాంతికాదు అహంభావం. కొంత తెల్లబడ్డాడు. పూచలావుండే సత్యం బొద్దుబారాడు.

ఇద్దరూ మెట్లెక్కారు.

"ఆనాడు నామాట పూర్తిగా వినకండా నే నీకు కోపం వచ్చి వెళ్లిపోయావు. నే చెప్పేది విని మరీ సమాధానం చెప్పు." అన్నాడు కుర్చీలో కూలబడి.

సుశీల తలెత్తలేదు. చేతిలోని అల్లికతో గుమ్మంలో కూర్చుండిపోయింది.

"మేడ పూర్తి అయింది. వొచ్చే నెలలో గృహప్రవేశం" అన్నాడు సుశీలవంక పరిశీలనగా చూస్తు.

సుశీల కళ్లెత్తలేదు.

"గృహప్రవేశానికి ముందే నిన్ను పెళ్లి చేసుకోవాలని నా వుద్దేశం. తర్వాత నువ్వు నాభార్యగా ఆయింట్లో అడుగెట్టచ్చు. అందుకోసమనే వుద్యోగం మానుకొంటున్నాను." అన్నాడు సిగరెట్ ముంచి

సుశీలనుంచి సమాధానం రాలేదు.

"ఈ ధనం — హోదా — దర్జా అన్నీ నువ్వు పెట్టిన భిక్ష. నా ప్రతి ఒక్క ఆనందం నువ్వు పంచుకోవాలి. నువ్విలా టీచరు చేస్తూవుండటం మన హోదాకు తగదు. నిన్ను పెండ్లాడి మాంబళం యింట్లోకి తీసుకెళ్తాను. పిల్లలూ వాళ్లూ పూర్వపు మైలాపూర్ యింట్లో వుంటారు. నీకూ వాళ్లకీ సంబంధం వుండదు."

"చెప్పడం అయిందా — యింకా వుందా?" అంది సుశీల తలెత్తి.

ఆకళ్లను చూసే వేళకి సత్యానికి భయమేసింది.

"మీకు పూర్వం ఒకసారి చెప్పాను. డబ్బు అప్పుగా యివ్వలేదని. పెండ్లి చేసుకునేందుకు మీరు సిద్ధంగా వున్నా నేను లేను. మీ హోదాకు తగకపోయేందుకు మీకు నేనెవర్ని? మీకూ నాకూ స్నేహం తప్ప చిన్న మెత్తు బాంధవ్యం లేదు. నా వుద్యోగం మానను. యీ యింట్లోంచి కదలను. మీ పెద్దపెద్ద కార్లను యీ గల్లీలో వుంచి యిబ్బందులు పడకండి. యిదే నా సమాధానం. మీకు స్త్రీ అంటే ఏమిటో తెలీదు," అని సుశీల కిందకి దిగి వెళ్ళిపోయింది.

ఈసారి సత్యానికి భయం వెయ్యలేదు. సుశీలమీద కోపం వచ్చింది. అతని అహం దెబ్బతింది. తనంతవాడు పెళ్లాడుతా నని వస్తే నిరాకరించింది. తనకీ నాకూ సంబంధం లేదుట. ఆడదే ఆమాట అంటే మొగవాడు తనకేం? తను కిందకి దిగి దేవులాడుతున్న కొద్దీ సుశీల కొండెక్కుతోంది. కనపడక పోతేనేగాని సుశీలకి తన విలువ తెలియదు.

కారులో కూచున్నాడే గాని, అతని మనసు మనసులో లేదు. సుశీల మొదటి నుంచి తన చేయి పైన వుంచుకుంటూ వచ్చింది. ఆఖరికి తన చేతినుంచి ఒక బహుమతీ అన్నా పుచ్చుకోలేదు. మొదట్లో ఆ డబ్బు పత్రికకు ఖర్చుపెట్టండి - అంటూ తప్పించుకువచ్చింది. తనకు డబ్బు ఆడుగుతున్నప్పటినుంచీ ఒకపక్క బయటపని, మరోపక్క సుశీల కావాలని దూరం అవుతోంది. ఎటుచూచినా సుశీలకే తను అప్పబడ్డాడు.

ప్రేమించిన స్త్రీకి పురుషుడు తనిచ్చిన కంటె యింకేమివ్వకలడు. భార్యగా చేసుకుంటా నన్నాడు. సమస్తం పంచుదామనుకున్నాడు.

* * * *

ఆ ఏటి కావిడు గడుస్తోంది. మళ్లీ సత్యం సుశీల గుమ్మంతొక్కలేదు. సాధ్యమైనంత వరకూ ఆవిడను మర్చిపో జూస్తున్నాడు. డబ్బుసంపాదనతో వూపిరి ఆడటం లేదు.

ఇద్దరుముగ్గురు, సాయంతో ఫిలిమ్‌కంపెనీ పెట్టాడు సత్యం. సత్యంముట్టిందల్లా బంగారం అవుతోంది. మొదటి రెండు పిక్చర్లతోనే సిరి అందుకుంది. సత్యం మిలియనీర్ అయాడు.

పది లక్షుల, ఆసామి సత్యం. మాంబళంలోని పెద్దబంగాళా టెర్రెస్ మీద పడుకుని నక్షత్రాల్ని చూస్తూంటే, నెలకి వందరూపాయలు సంపాయించుకునే సుశీల జ్ఞాపకానికి వచ్చేది. ఈ లక్షులు తన నేర్పు వల్ల వచ్చాయా లేక ఆ మహత్తు సుశీలడబ్బులో వుందా? ఇది తెగని సమస్య. ఈ పునాది గురించి తనకి సుశీలకి తప్పమరో ప్రాణికి తెలీదు. ఇప్పుడు యిద్దరికీమధ్య సంఘం ఎత్తయినగోడలుకట్టింది. శనివారాలు సత్యం ఎవరికీ చెప్పుకోలేని బాధతో కుమిలిపోయేవాడు.

ఆరునెలలక్రితం సత్యం పెద్దమ్మాయికి యాభైవేలు ఖర్చుచేసి దేవేంద్ర వైభవంగా వివాహంచేశాడు. పెళ్లిపందిరి కళ్లపండుగగా వుందని చూసినవారన్నారు. ఇంత సందడిలో, గౌరవంలో ఆతిథ్యమర్యాదలలో సుశీలలేదు. సుశీలకి ఆహ్వానమైనా వెళ్లిందోలేదో? అత నామెజ్ఞాపకాన్ని తుడిచివేయ ప్రయత్నించేవాడు.

సత్యం భార్య సోషల్ వర్కర్ అయింది. పెద్దపెద్దసభలకీ వాటికి హాజరవుతోంది. భర్త ఆర్జనతనవల్లే పెరిగిందని ఆమెవుద్దేశం. నాకరికచిహ్నాలయిన క్లబ్‌లూ, గుర్రపుపందాలు, ప్రతిసమ్మర్‌కి కొడైకనాల్ వెళ్లిగడపడం-యిలాంటివన్నీ అలవరచుకుంది.

యుద్ధంలో సంపాయించిన ధనంపైన సంపాయించినధనం వాటితాలూకు లాభాలకీ ప్రతి ధనవంతుడికి మల్లే టాక్సులు సరిగా కట్టడంమానేశాడు సత్యం. ఈమధ్య మూడు నెలలనుంచి యిన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుని తప్పించుకోడంలో అతనునిమగ్నుడయాడు. ఒకటారెండా నాలుగులక్షులు కట్టాలి గవర్నమెంటుకు కట్టాలిసినడబ్బు.

వేసంగికి భార్యా పిల్లలూ కొడైకనాల్ వెళ్లారు.

నాలుగులక్షులు ఎక్కడినుంచి తేవాలి? అదీ సమస్య. భార్యాపిల్లలూ వెళ్లినాలుగు రోజులయింది.

సత్యానికి రెండురోజుల్నుంచి జ్వరం తగుల్తోంది. అంత పెద్ద యిల్లూ బావురుమంటోంది. ఇట్లో ప్రతివాళ్లు తన ఆజ్ఞల్ని పాలించేవారే గాని ప్రేమతో చూసే వారు ఒక్కరూ లేరు. ఆఖరికి భార్యకూడా తనని చూసి దడుస్తుంది. మనసిచ్చి మాట్లాడదు. ఇంత భోగంలోనూ ఏదో వెల్తి - ఆరాటం; ఏదో తనని బంగారుపంజరంలో బంధించినట్లుంది. సత్యానికి.

వారంరోజుల దాకా ఆఫీసుపనులు చూడననీ, ప్రతివిషయం అలా ఆపమనీ సెక్రటరీకి క్రిందటిరోజు ఫోన్ చేశాడు. శరీరమంతా ఏదో నీరసంగా వుంది.

సాయంత్రం నాలుగయింది. గది చుట్టూ వట్టివేళ్లు. ఎంతో చల్లగా, హాయిగా వుంది. మంచంమీద పడుకున్నాడు. ఎదురుగా కాలెండరు ఏప్రిలు ఆరో తేది. ఏవో ఏవో జ్ఞాపకం వచ్చాయి.

తన కిలాగా జ్ఞాపకం. ఏప్రిల్ ఆరో తేదినే మొట్టమొదటిసారి సుశీలయింటికి తను వెళ్లింది. ఒక దశగడిచింది. ఆమె స్నేహం తన జీవితంలో ఎంత మార్పు. కాని ఆమె జీవితంలో మటుకు తను వీసమయినామార్పు తేలేకపోయాడు.

చిత్రం - ఏడాదినుంచి పూర్తిగా మరిచిన సుశీల యీనాడు జ్ఞాపకం వచ్చింది. జ్వరంగా వుంది. సుశీల దగ్గరకెళ్తే! తనని లోపలికి రానిస్తుందా? ఐశ్వర్యంలో తను మొహం చాటేశాడే! ఆఖరికి పిల్ల పెళ్లికి కూడా పిలవలేదు. కాని సుశీల చెయ్యి పట్టే తన జ్వరం యిట్టే తగ్గుతుంది. ఒక్కసారి మనసు విప్పి సుశీలతో మాట్లాడుతే యీ భారం పోతుంది.

యీ నాలుగేళ్లలో సుశీలలో ఏలాటి మార్పొచ్చిందో, బహుశా తన వియోగం ఆమెను కృంగదీసిందా? జబ్బు చేసివుంటుందా? ముసలిదయిపోయి వుంటుందా? ఆఖరికి తను క్షేమం అన్నా కనుక్కోలేదు. సుశీల కనుక్కుంటూనే వుంటుంది. తనే క్రూరుడయిపోయాడు.

రెండురోజు లయింది గడ్డం గీసుకుని. గడ్డం మాసి, బట్టలు నలిగి వున్నాయి. బాల్కనీలోకి వచ్చి చూశాడు. చీకటి పడబోతోంది. గబగబ షర్టు తీసుకుని మెట్లు దిగాడు.

డ్రైవరు తలుపు తీసుకు పోర్టికోలో నిలబడ్డాడు. కారు వద్దని తల వూపి, సందు చివరిదాకా తల వంచుకు నడిచాడు. పక్కనే పోయే టాక్సీ పిల్చి సుశీల అడ్రసిచ్చాడు.

అతని హృదయం జ్ఞాపకాలతో అనుమానాలతో వూగిసలాడుతోంది. కారు కదలనట్టే వుంది. ఏదో - ఏదో బుర్ర తిరుగుతోంది.

* * *

టాక్సీ యింటిముందు ఆగింది. వాడిచేతిలో నోటుపెట్టి దిగాడు సత్యం.

గుమ్మంలో అడుగెట్టాడు. సుశీల వరండాలో కూచుని స్వెట్టర్ అల్లుతోంది. తలెత్తిచూసింది. సత్యం ఒక్క గంతున వాళ్లోకొచ్చి పడి ఏడుస్తున్నాడు.

సుశీల కదల్లేదు. పదినిముషాలకి తలెత్తాడు సత్యం. మొదటిసారి సుశీలకంట్లో కన్నీరు చూశాడు. మాసిన గడ్డం, పాలిన చెక్కిళ్లు, మురికి గుడ్డలూ, దశ క్రింద చూసిన సత్యం తిరుగా అలాగే ప్రవేశించాడు. నుదుటిమీద పడిన నెరిసినజుట్టును పైకితోస్తూ "పిచ్చి బాబూ అంది" ప్రేమగా.

సత్యంతలని సుశీలబుజాల్లో దాచుకున్నాడు.

"మేడమీదికి పదండి. కాఫీ తెస్తాను" అని రెక్కపట్టుకు తీసుకెళ్లింది సుశీల.

దుప్పటిదులిపి అతన్ని పడుకోబెట్టి, కిందికెళ్లి కాఫీ తెచ్చింది. సత్యం బుద్ధిమంతుడిలా కాఫీతాగి - సుశీలవళ్లో తలెట్టుకు పడుకున్నాడు.

ముఖం కడిగించి, గుడ్డలు మార్పించింది. అతను తిన్నచారూ, అన్నపుగిన్నె కిందకు పట్టుకెళ్తూ "కళ్లుమూసుకు పడుకో-క్షణంలో వస్తున్నా" అంది మెట్లుమీంచి. సత్యంగదిని తేరిపార చూశాడు. గది కొంచెంగూడా మారలేదు. నిన్నతను పెట్టి వెళ్లినట్టున్నాయి సామాన్లు. సుశీలముఖంలో మరీ ప్రశాంతత కనపడింది. కొంచెంగూడా మార్పులేదు. తను, ఏన్నో; ఏవో ఊహించుకున్నాడు. ఆఖరికి తెల్లవెంట్రుకకూడా లేదు.

సుశీలను చూశాక తనీ అయిదేళ్లలో ఎంత మార్పుపొందినదీ అతనికి మొదటిసారి తట్టింది.

సుశీల పైకి వచ్చింది. తలలోని మల్లెలు గుప్ మన్నాయి. సత్యాన్ని రోజూ చూస్తున్నట్టే ప్రవర్తించింది. ఆమెకు ప్రశ్నలు లేవు. సుశీలకి యీలోతు భగవంతుడు ఏ తపస్సుకి ప్రసాదించాడో!

తలదగ్గరకూచుని చెక్కిళ్లు నిమురుతోంది. సత్యం తొడుక్కున్న లాల్చీగుండీలు సరిగా పట్టడం లేదు. సుశీలదగ్గరకు లాగిపెట్టింది. ఇంకా గుండీలు కనపడ్తూనే వున్నాయి. సుశీల కిలకిలనవ్వింది. సత్యం తృప్తిగా నవ్వాడు.

వార్ టైములో యిద్దరూవుండగా సుశీల ఆలాల్చి కుట్టింది. అప్పుడు సత్యాని కది చాలా వోదులుగా వుండేది. అందువల్ల పెట్లో అడుగున పడేసింది సుశీల. ఆపాత దాన్ని తీసి యీనాడు రాత్రితొడిగింది సత్యానికి.

ఇద్దరూ భావయుక్తంగా నవ్వారు.

కిటికీలోంచి నక్షత్రాల కాంతిపడుతోంది పక్కమీద. ఆ కాంతిలో పక్కన సుశీల. ఏవోలోకంలో వున్నట్టుంది సుశీలకి.

"సుశీ" అన్నాడు సత్యం మృదువుగా.

"వ్యక్తిత్వాన్ని గురించి కథలు రాశారుగాని, పక్కమనిషి వ్యక్తిత్వాన్ని భరించలేకపోయారు. స్త్రీకి భార్య అవడంకంటే ఎక్కువ ఆశయంకూడా వుంటుందని మర్చిపోకండి" అంది కిలకిల నవ్వుతూ.

ఆ కిలకిలనవ్వు, సన్నగా పారే సెలయేరుని జ్ఞప్తికి తెస్తుంది. సెలయేరు గట్టుకెళ్లి - నువ్వు నాపక్కనే పాడు, ఆ గలగల శబ్దం నా ఒక్కడికోసమే చెయ్యి అనడం, చంద్రుణ్ని ఆవెన్నెల నాకే యియ్యి, నాయింట్లోనే కట్టేసుకుంటాననడం. మల్లెల సువాసన నా కొక్కడికే కావాలి నాజేబులో వుంచుకుంటాననడం యిలాంటివి ఎంత అసాధ్యమో సుశీలను పట్టుకోడం కూడా అంతే! అని సత్యానికి ఒక గొప్పనిజం తట్టింది.

అన్నీ, లక్షలు, భార్యాపిల్లలు, యిన్‌కమ్‌టాక్స్-కొడైకనాలు అన్నీ మబ్బులో కలిసి పోయాయి. జీవితాన్ని వెలిగించే ప్రేమజ్యోతి కనిపించింది సత్యానికి సుశీల ముఖంలో.






## [illegible]త పాటలు

సేకరించినది :

**శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు**

**1.** ఇసకలో పొయ్యి పెట్టి వండిన వారెవరు?
ఇసకలో పొయ్యి పెట్టి వండె సీతమ్మ.
జొన్నాకు విస్తళ్లు కుట్టిన వారెవరు?
జొన్నాకు విస్తళ్లు కుట్టె రామన్న.
నిత్య సంసారమ్ము చేసిన వారెవరు ?
నిత్య సంసారమ్ము చేసె సీతమ్మ.
సీటిమీది తామరలు కోసిన వారెవర ?
నీటిమీది తామరలు కోసె రామన్న.
మాయసంసారమ్ము చేసిన వారెవరు?
మాయ సంసారమ్ము చేసె సీతమ్మ
మాయ లేడిని బట్టి తునిమిన వారెవరు?
మాయ లేడిని బట్టి తునిమె రామన్న,

**2.** ఎంత చక్కని సీత జెరలోకి తెచ్చి
చుప్పనాతి అన్న లంక రావణుడు
చిన్న రధమును పన్ని సీతను చెరదీసె
మాయరధమును పన్ని మగువను చెరదీసె
కంచు రధమును పన్ని కాంతను చెరదీసె

**3.** ఇసకతో గోదారి ఊటతో జలము
లక్కతో బంగారు రాముతో సీత
చుక్కల పర్వతము, సూర్య మండలము
చూడవోయి మా తాత నశ్యా మావరించె.

**4.** శివయ్య చిన్నయ్య శివుడు పెద్దయ్య
హరయ్య మానాన్న అన్న దమ్ముళ్లు
పుల్లగూర పిన్నమ్మ పులుసు పెద్దమ్మ
తోటకూర లక్ష్మమ్మ తోడికోడళ్లు.

**5.** సీకు పెట్టిన మడపలు అప్పన్న!
బేపు లెత్తుకు పోయెరా!

**6.** ఆదివారమునాడు అమావాశ్యనాడు
ఆవుకడుపున దూడపుట్టదోషమ్ము
అచ్చంగ తెలుకులాడు అమ్మదోషమ్ము
కళ్లక్కి గంతల్లు గట్టిగా కట్టె
ఎత్తు చాలకపోతె ఎక్కి తొక్కేడు
బరువు చాలకపోతె బల్ల లెట్టేడు.

# వెన్నెలరాత్రి

శ్రీ ఎన్. నారాయణమూర్తి

[illegible] అప్పుడే వచ్చాడు అమ్మ పెట్టిన అన్నంతిని. ప్రక్కప్రక్కనే వేసిన మంచాలపైన పెద్దక్క చిన్నక్క పడుకున్నారు. వాళ్లిద్దరు వాడ్నిరమ్మని పిలిచారు. వాడికి పెద్దక్క నచ్చలా! పెద్దక్క ప్రొద్దున బిళ్లలు కొని పెట్టమంటే కొనిపెట్టలా. అమ్మ కొని ఇస్తే, చిన్నక్కే అప్పుడు కొని పెట్టింది. అదీకాక పెద్దక్క, చిన్నక్కను ఆమాదిరి అడిగానని బుగ్గగిల్లింది. అందుకని పెద్దక్క మంచిదికాదు! చిన్నక్కే మంచిది! తను చిన్నక్క మంచంమీద పడుకుంటాడు-చిన్నక్కమంచందగ్గరకు వెళ్లి పడుకున్నాడు. వెల్లికిలా పడుకున్నాడు. నీలాకాశం మీద చంద్రుడు బాగా ఉన్నాడు అదే మిటి చంద్రుడు ఆమాదిరిగా పరుగెత్తుతాడు! ఎందుకో? చంద్రుడు ఆ చుక్కల దగ్గరకు పోతాడు కదా! వాట్ని మింగ డేమో! చంద్రుడు మధ్యలో నల్లగా ఉన్నాడేం ఆమచ్చ ఎందుకో! ఏం బాగుండలా! ఆ చంద్రుడికి అది ఎలా వచ్చిందో అక్కను అడిగితే-చిన్నక్క బాగా చెపుతుంది.- చిన్నక్కను అడుగుదా మను కొన్నాడు. చిన్నక్క వైపుతిరిగాడు. చిన్నక్క పెద్దక్క ఏదో మాట్లాడుకుంటున్నారు. చిన్నక్క బోర్లకిలా పడుకుని పెద్దక్క వేపు



తిరిగి ఏదో చెప్పుతున్నది. పెద్దక్క వెల్లకిలా పడుకొని ఆ మాటలు వింటున్నది. చిన్నక్కా చిన్నక్కా అని పిలచాడు. చిన్నక్క పలకలా. వినపడినట్లు లేదు. ఆ చెప్పే మాటల ధోరణిలో. చిన్నక్క ఎప్పుడూ ఇంతే ఒకటే మాట్లాడుతుంది! ఏమిటి మాట్లాడుతున్నది! తను కూడా విందామనుకొన్నాడు.

"అది కాదే! రమే, ఆ రమాయే ప్రొద్దున అక్కడనుంచి భోజనం చేసి వస్తుంటే నే! వాళ్ల బండి ఎక్కవద్దన్న దే!" ఎక్కితే కిట్టాయి చేత కొట్టిస్తానన్నదే! అని చెప్పుతున్నది. రమ వాళ్ల అత్తయ్య కూతురు. కిట్టాయి ఆ అమ్మాయి అన్న. వింటున్నాడు శేషు. పెద్దక్క అంటున్నది.! అది ! అంతే నే! మొన్న చింతగింజలు ఆడుకుంటూ ఉంటే తొండి చేసిందే! ఏమే అట్టా చేశావని అడుగుతే గిల్లిందే. ఏటి అని అడుగుతే ఏడుపు మొదలు పెట్టిందే. నేనేమి కొట్టను కూడా కొట్టలేదే. అప్పుడు వాళ్లమ్మ వచ్చి వాళ్ళ ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మందే. అది ఏడవకపోతే వాళ్లమ్మ అట్లా అనేది కాదు. అది ఏడుపుగొట్టుదే!" శేషు వింటున్నాడు. అక్కలు అంటున్నది నిజమేమో! తనను కిట్టాయి గిల్లాడు మొన్న. రమే చెప్పి ఉంటుంది. చిన్నక్క ఏదో అంటున్నదే!

"అసలు వాళ్లింటికి వెళ్లకూడదే! వాళ్లమ్మ కోప్పడుతుంది. దానిపైన తూ పెడుదాము. అది ఒక్కటేనా ఏం ఆడుకోటానికి, ఎంతమంది లేదు. ఇక్కడ సుందరిఇంటికి పోదామే. వాళ్ళమ్మ ఏమిఅనదు. చింతగింజలు ఆడుకుందాము. సుందరేవ్ - సుందరి కొట్టినా ఏడవదే! రమాయ్ మాదిరి కాదు. ఎంచక్క—"

చిన్నక్క ముఖము వేపు చూచాడు. అక్క చెప్పినట్లు రమాయ్ మంచిదికాదు. మొన్న కిట్టాయికికూడా అదే చెప్పి ఉంటుంది.

"అక్కోవ్! అక్కా! మొన్నే! మొన్న కిట్టాయిగిల్లాలే; ఇక్కల గిల్లాలే!" అని అన్నాడు తొడవేపు చూపిస్తూ. రమగురించి చెప్పదామా! రమ గిల్లమని చెప్పిందో లేదో! రమ చెడ్డది- అక్క చెప్పింది. రమ ఆమాదిరి చేయమని చెప్పే ఉంటుంది. సరే! రమసంగతికూడా చెప్పాలి అందుకని సందేహిస్తూ గునుస్తూ.

"అక్కోవ్ ! అక్కా! లమ చెప్పిందే అట్టా గిల్లమని!" అక్కలు వినటం లేదు. చివరకు చిన్నక్కకూడా వినటం లేదు. అందుకని పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు. చిన్నక్క ఏదో చెప్పుతున్నది.

"సుందరి మంచిదే నే! దాని చెల్లెలు ఒకటే ఏడుపుగొట్టుది! ఒకటే ఏడుస్తుందే! మొన్నే- మొన్న బండితో ఆడుకుంటూఉంటే ఆ బండికావాలని ఏడిచిందే. మేము ఇవ్వలా! వాళ్లమ్మ వచ్చి 'పిల్లల్ని ఏడిపిస్తావెందుకే' అని సుందరిని తిట్టిందే! అందుకని సుందరి మనల్ని రావద్దన్నదే వాళ్లమ్మ కోప్పడుతుందని.

శేషు విన్నాడు. ఇందాక చిన్నక్క వాడిమాటను వినలేదని కోపంగా ఉన్నది. 'అక్కోవ్! అక్కా! వినవే' అని వాళ్లఅక్క గడ్డము పట్టుకొని తనవేపు తిప్పుకొన్నాడు. ఇక్కడే నే, గిల్లింది-కిట్టాయి గిల్లాలే! అని తొడవేపు చూపించాడు.

అక్కలు చూచారు. పెద్దక్క అంటున్నది. 'చూడవే! వాడిని కూడా గిల్లాడు కిట్టాయి. వాళ్లింటికి వెళ్ళకూడదే! రమామే గిల్లించి ఉంటుంది." అన్నది పెద్దక్క సానుభూతిని చూపిస్తూ. శేషుకు ఆనందమయింది వాళ్లక్క విన్నదని. పెద్దక్కకూడ మంచిదే- మధ్యమధ్య కొంచెము కోప్పడ్డా పెద్దక్కకూడా చెప్పింది రమామే చెప్పిందని - అవును - నిజమే అయి ఉంటుంది.

'అవునే! రమామే చెప్పి గిల్లించిందే' అన్నాడు శేషు. చూచావా రమామే నే! అది అటువంటిదే- నాకు తెలుసు," అన్నది పెద్దక్క. పెద్దక్క చాలమంచిది. రేపు పెద్దక్కదగ్గరే తను పడుకోవాలి.

పెద్దక్క అడుగుతూఉన్నది శేషుని. "ఎక్కడరా! ఎక్కడరా గిల్లింది?' శేషుకు మహాసంతోషంగా ఉంది.

'ఇదిగో ఇక్కడేనే! అని తొడ చూపించాడు. పెద్దక్క చిన్నక్కలు చూచారు. చిన్నక్క తొడనిమిరింది. శేషుకు బ్రహ్మానందమయింది. చిన్నక్క తన మాట విన్నది. పెద్దక్క తన మాట ఒప్పుకున్నది. ఇక తను పడుకోవచ్చు. తిరిగి పక్కపైన పడుకున్నాడు తృప్తిగా వెల్లికి

లా తిరిగాడు. చంద్రుడు కనపడ్డాడు. చంద్రుడు ఇంకా తొందరగా పరుగెత్తుతున్నాడు. అ దేంటి! ఆ నక్షత్రాలకి డీకొట్టడు కదా! మళ్లీ చూచాడు చంద్రుడువేపు శేషు. మచ్చ కనుపడ్డది. వెనకటి ప్రశ్న గుర్తుకు వచ్చింది-

“అక్కోవ్! అక్కా”అని పిలిచాడు-మళ్లీ. మాట్లాడుకొంటున్నారు అక్కలు. తన మాట వినిపించుకోవటంలా. పెద్దక్క అంటున్నది ‘అసలు రమా వాళ్లింటికి పోకూడదే’ ఇక్కడకు మనింటికి వస్తే పొమ్మందామే! ఇంట్లోకి రానివ్వద్దు.”

శేషుకు ఇది అక్కర్లేదు - తన మాటకు జవాబు కావాలి. “అక్కోవ్! చిన్నక్కా!” అని పిలిచాడు. చిన్నక్క పలకలా. వాడు చిన్నక్కవేపు తిరిగి కాలు చిన్నక్కపైన వేశాడు. గడ్డము పట్టుకొని, ‘అక్కోవ్; అక్కా!” అని పిలిచాడు.

చిన్నక్క వాడివేపు తిరిగింది. “ఏంట్రా! ఒకటే గొడవా! పడుకోరాదు”అని వీపుపైన చిచ్చికొట్టటం మొదలుపెట్టింది. శేషు పడుకో తలచలేదు. తన ప్రశ్నకు జవాబు కావాలి.

‘అక్కోవ్! అక్కా ఆ చందమామను చూలవే!’ అని అక్కను త్రిప్పి చందమామను చూపించాడు. పెద్దక్క కూడా చందమామను చూచింది.

‘అదేంటి? ఆ మచ్చ’ అని అడిగాడు.

‘అది అవ్వరా! చెట్టుక్రింద కూర్చుని అవ్వ నూలు వడుక్కొంటున్నది’, అని అన్నది చిన్నక్క.

వడుక్కోవటం అంటే ఏమిటో! వాడికి తెలీలా! ‘వడుక్కోవటం అంటే ఏమిటే’ అని అడిగాడు.

‘దారం తియ్యటంరా! దారం తీస్తారులే ఈమాదిరి అని’ తన చొక్కాలోంచి ఒక చిన్న దారపు పోగు లాగి చూపించింది చిన్నక్క.

వాడికి ఇంకా సందేహంగా ఉన్నది. దేంట్లోంచి దారాన్ని తీస్తరో? అడిగితే అక్క కోప్పడుతుంది. అదేమిటి అవ్వ అక్కడ దారం ఎటా వడుకుతుంది. అవ్వ అక్కడకు ఎట్లా వెళ్లింది; చెట్టు క్రింద ఒక్కటే ఉంటుంది కావాల్ను. ఒక్కతే అయితే భయం కాదూ!

‘అక్కోవ్! అక్కా! అవ్వ అక్కలకు ఎట్లా వెళ్లిందీ! అదేంటి!అక్కల కూచుని వలుక్కోవతం ఎందుకూ! ఇక్కల వలుక్కూలాదు!’ చిన్నక్కకు కూడా తెలియలా జవాబు.

‘అట్లా ఉంటుందిలే! దేవుడు అట్లా ఉంచాడు అవ్వని’ అన్నది చిన్నక్క. వాడికి సందేహం తీరలా. అడుగుతే కోప్పడుతుంది అక్క. అవ్వకి ఒక్కతే ఉంటే భయంలేదూ.

‘అక్కోవ్! అక్కా! అవ్వకు భయం వెయ్యదుటే’

‘ఛా! భయం వేయదు- ఏం వెయ్యదు పడుకో’అని అదిలించింది చిన్నక్క. పడుకోమని పెద్దగాచిచ్చి కొట్టటం మొదలుపెట్టింది-వాడికి నచ్చలా-జవాబు సందేహం తీర్చలా కాని చిన్నక్క తనకు సరిగా జవాబు చెప్పనందుకు కోపం వచ్చింది. కొంచెము ఇవతలకి జరిగి మళ్ళీ వెల్లకిలా పడుకొన్నాడు——

మళ్లీ చంద్రుడు కనబడ్డాడు. ఆకాశంలో పరుగులు తీస్తున్నాడు. మళ్లీ మచ్చ కనపడ్డది-అది నచ్చలా తెల్లగా ఏంచక్క బాగుంటే ఆ కొంచం నల్లగా ఏమిటి! అట్లాగే చంద్రుడి వేపు చూస్తున్నాడు.

అక్కలు మాట్లాడుకుంటున్నారు. వాడు వింటున్నాడు.

పెద్దక్క మాట్లాడుతున్నది. “రమ వస్తే ఇంట్లోకి రావద్దందామే తూ వేశామని చెప్పదాము.”

చిన్నక్క అంటున్నది ‘అమ్మతో చెప్పతుందే! అమ్మ కొడుతుంది. మనము ఏమీ మాట్లాడవద్దు- పొమ్మని చెప్పవద్దు మాట్లాడక పోతే దానంతట అదే పోతుందే.’

‘అమ్మతో చెప్పి కొట్టిస్తే మనము మాత్రము ఊరుకొంటాముటే. మనమూ కొడదాము’! అన్నది పెద్దక్క. శేషు ఆలోచిస్తున్నాడు. అవును-మనము కొట్టాలె. లమామ్ చెడ్డది. తనను గిల్లించింది కిట్టాయి చేత. కొట్టటం బాగుండదు. ఆ చందురుడిలో అవ్వమాదిరి ఒక్కత్తెను చేసి కూర్చోపెడితే-చిన్నక్క చెప్పింది అవ్వకు భయం లేదని- లమామ్‌కి కూడా భయం వెయ్యదు కావాల్ను-కొడితే! ఆ మచ్చలాగా వచ్చేటట్లు ముఖంమీద కొడితే! మంచి ఆలోచన దొరికినందుకు వాడికి మహాసంతోషమయింది.

‘అక్కోవ్! అక్కా! కొట్టామే-అట్టా ఆ మచ్చ వచ్చేటట్టు కొట్టామే! అని అమాంతంగా లేచి కూర్చున్నాడు. వాడికి రమాయ్‌ను కొట్టినంత ఉద్రేకం వచ్చింది.

దాంతో దిండును నాలుగు గుద్దులు గుద్దాడు.

'ఒరే! పడుకోరా ఒకటే గొడవ-పడుకో అట్లాగే కొట్టాములే రేపు వచ్చినప్పుడు.' అని పడుకోపెట్టింది చిన్నక్క-పడుకున్నాడు-వెల్లకిలా తిరిగాడు-చంద్రుడిని చూచాడు. చంద్రుడు బాగా వరుగులు తీస్తున్నాడు-తను ఆమాదిరి పరిగెత్తాలి రేపు రమాయ్‌ని కొట్టేటప్పుడు!

అక్కా-వాళ్లు మళ్ళీ మాట్లాడుకుంటున్నారు.

'అయితే ఆడుకోవటానికి రేపు ఎక్కడకు వెళ్లుదామే' చిన్నక్క పెద్దక్కను అడుగుతున్నది.

'సుందరి వాళ్ళింటికి వెళ్లుదామే' అన్నది పెద్దక్క.

'సుందరివాళ్ళింటికి నేను రానే!' అన్నది చిన్నక్క.

'ఎందుకే' అని అడిగింది పెద్దక్క మోచేతులపైన పైకి లేస్తూ. 'ఆ సుందరి చెల్లెలు ఒట్టి ఏడుపుగొట్టుదే. అది ఉన్నంత కాలము రానే' అన్నది చిన్నక్క తనని సమర్థించుకుంటూ. 'అదేం చేసిందే నిన్నూ! నేను చెప్పతాలే! రా! వాళ్ళింటికి వెళ్లుదాము' అన్నది పెద్దక్క.

'నేనురానే' అన్నది చిన్నక్క గట్టిగా.

'ఎందుకు రావే' అని అడిగింది పెద్దక్క. గొంతు పెద్దదిచేస్తూ లేచి కూర్చుంది.

'నా ఇష్టం! రాను' అన్నది చిన్నక్క కూడా పెద్దగా అరుస్తూ, పడుకొనే.

'నీ ఇష్టమా' నీఇష్టం కిషాయి పాతెంలో! చూద్దాములే. అని గిచ్చటం మొదలుపెట్టింది చేయి విసురుతూ పెద్దక్క. 'అమ్మా! చూడవే' అని చిన్నక్క అరిచింది. శేషు చంద్రుడి వరుగుల్లోంచి ఒకసారి ఇవతలకు పడ్డాడు. పెద్దక్క ఆమాదిరి చిన్నక్కను చేయటం వాడికి నచ్చలా-పెద్దక్క ఎప్పుడూ ఇంతే - ప్రొద్దున కూడా ఇట్లాగే చేసింది-చిన్నక్క చాలా మంచిది. తనకు ప్రొద్దున బిళ్ళలు కొని పెట్టింది - ఇందాక గిల్లిన చోటు చూపిస్తే చక్కగా నిమిరింది-పెద్దక్క అట్లా నిమరలా-రోజూ చిన్నక్కే చిచ్చికొట్టి తన్ను నిద్రపుచ్చుతుంది. పెద్దక్క తన్ను దగ్గరకు చేరనివ్వదు. మొన్న అన్నానికి దగ్గర కూర్చుంటే వద్దు పొమ్మని కసిరి కొట్టింది-పెద్దక్క చెడ్డది. చిన్నక్క మంచిది-రమామ్‌కూడా మంచిదే. కిట్టాయి కొట్టాడుకాని రమాయ్ చెప్పిఉండదు. ఇందాక పెద్దక్క అంటే తను అనుకొన్నాడుకాని-అట్లా కొట్టమని చెప్పిందయితే వాళ్ళమ్మ తీపి చేసినపుడు తన్ను పిలిచి అంత ఇదిగా ఎందుకు పెట్టుతుంది-లమామే మంచిది. కిట్టాయే వాడంతటవాడు కొట్టిఉంటాడు-పెద్దక్కే చెడ్డది-పెద్దక్క తీపి తన కెప్పుడు పెట్టలా-అపుడు పేరంటాని న్నుంచి తెచ్చినపుడయినా-

రమామే మంచిది. చిన్నక్క కూడా మంచిది. పెద్దక్క చెడ్డది-దానికి ఆ చంద్రుడిలో మచ్చ మాదిరి చేయాలి. ఆ మచ్చ తనకు నచ్చలా-ఆ మచ్చ ఈ చెడ్డమ్మాయికి వచ్చేలాగున చేయాలి—

ఉన్నట్లుండి హఠాత్తుగా లేచాడు-పెద్దక్క-మంచము మీద దూకాడు. వెల్లకిలా పడుకొన్నది పెద్దక్క-దాని ముఖంమీద నాలుగు గుద్దులు గుద్దాడు.

పెద్దక్క ఏడవటం మొదలు పెట్టింది చిన్నక్క లేచి కూర్చుంది భయంతో - శేషుకు అక్క ఏడుస్తూంటే జాలివేసింది-తను అట్లా కొట్టకూడదు తప్పు. దిగులుగా తల కాటిదగ్గర కూర్చున్నాడు- ఏడుస్తున్న పెద్దక్క-వేపు చూచాడు-అక్క-కండ్లవెంబడి నీళ్లు చూచేటప్పటికి వీడికి ఏడుపు వచ్చింది.

'ఏలవకే-ఇక కొట్టనులే-ఏలవకే' అని అక్క గడ్డము పుచ్చుకొని దీనంగా అడిగాడు.

'ఛో-ఛో-నాదగ్గరకు రావద్దు' అని అరిచింది ఏడుపుతో-

'ఏమిటే! ఆ గొడవ' అని వాళ్ళమ్మ ఇంట్లోనుంచి వచ్చింది విసుక్కుంటూ.

'శేషాయి కొట్టాడే ముఖం మీద' అని ఏడుస్తూ చెప్పింది పెద్దక్క.

'దాని కంత ఏడవాలిటే! చిన్న వాడి దెబ్బలకు-మరీ నూ' అని శేషాయివైపు తిరిగి 'ఎంత్రా వెధవా-మరీ-చిన్నా పెద్దలేకుండా' అని అరిచింది-

శేషుకు విసుకు పుట్టింది-చిన్నక్క-వల్లకదా తను పెద్దక్కను కొట్టింది. పెద్దక్క చెడ్డదే అనుకో-చిన్నక్క అట్లాఎందుకుఅరవాలా? చిన్నక్క కూడా తనకు నచ్చలా- పెద్దక్క చూడు-అమ్మతో చెప్పింది. అమ్మ అట్లా పెద్దగా అరవటం

# మొహమాటం

కె. బి. వి. కోటేశ్వర్

నేను మొన్న చుట్టాల ఇంటికి వెళ్ళినప్పుడు వాళ్ళు అన్నం వడ్డించేటప్పుడు నన్ను "మొహమాట పడకోయి" అన్నారు. నిజంగా, మొహమాట మంటే ఏమిటో నాకు వాళ్ళు చెబితేగాని తెలియదు. అయినా ఏదో కూపకూర్మమువంటి వాడికిగాని, నలుగురితో సరదాగా కలసి మెలసి వుండే వాళ్ళకు మొహమాట ముంటుందా? అని. ఈ కాలంలో అంటే అన్నానికి బట్టకు కరువయిన నేడు ఏవ్యక్తి దగ్గరా మొహమాటం మచ్చుకయినా కనిపించదు. మొహమాట పడితే ఏం వస్తుంది? కడుపుకు తినే దానిలో మొహమాట పడితే కడుపు కాల్తుంది. అంతే కదూ—

ఎవరికి ఎలా వున్నా మా రాఘవాచారికి మాత్రం అపరిమిత మొహమాటం. మా ఇద్దరి ఇళ్ళూ దగ్గరనే ఉండడము వలన, నేనూ రాఘవాచారి, చిన్నతనం నుంచీ కలసిమెలసి ఉండే వాళ్ళము. ఆ రోజుల్లో మా ఇద్దరికీ ఎంతో జత. ఇప్పుడు లేదంటారేమో- పెళ్ళాము పిల్లలూ వచ్చాక ఒక వేళ ఆ స్నేహ మున్నా ఆ ఆనందము ఎలా వస్తుందీ-అందుకనే విద్యార్థి దశ, జీవితంలో ఉత్కృష్ట మన్నారు పెద్దలు.

కర్ణుడు కవచ కుండలాలతో పుట్టాడట. అది ఎంతవరకూ నిజమో గాని, మా రాఘవాచారి, మొహమాటముతో సహితముగా పుట్టాడని నాకు నమ్మకము, విశ్వాసము. నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడల్లా వాడు నాకు తినడాని కేదయినా పెడుతూ వుండేవాడు. వాడు నా చేతిలో పెట్టీపెట్టడము తరవాయిగా నేను దాన్ని "గుటకా యస్వాహా" చేసేవాణ్ణి. నేను గాని మా అమ్మ గాని వాడికేదయినా తినడానికి పెట్టినట్లయితే-ససేమిరా, పుచ్చుకొంటే వట్టు. ఎంత సేపయినా ఆ పెట్టిన నరుకు అలాబల్లమీద వుండవలసిందే. అందు వల్లనే రాఘవాచారంటే అప్పుడప్పుడు నాకు కోపంకూడా కలుగుతూఉండేది.

ఈమధ్యనే మా రాఘవాచారికి పెళ్ళయింది. వాడికి చిన్నతనం నుంచీ ఏ మద్రాసు పిల్లనో చేసుకోవాలని కుతూహాల ముండేది. కాని పాపం, వాడి ఆశ, నిరాశయింది. మా ఊరికి రెండుమైళ్ళ దూరములో ఉన్న వారిపిల్లనే ఇచ్చారు మన వాడికి. ఇదీ ఓ విధంగా మంచిదే అయింది. ఏమంటారా? మా రాఘవాచారికి ఎంత మొహమాటమో, మా రాఘవాచారి తండ్రికి అంత డబ్బు పితలాటం. కొడుకు అత్తవారు దగ్గరగా వున్నట్టయితే, ఏ గాణీ ఖర్చు లేకుండా నడచివెళ్ళి, నడిచి రావచ్చు ననే ఊహతోనే మన రాఘవాచారికి ఆయన ఆ సంబంధముచే శాడను కొంటా.

ఓ రోజున ఉదయాన్నే 8॥గంటలకు మన రాఘవాచారి, ఏదో పనివుండి, పని చేసుకొన్నట్టూ అవుతుంది, ఆవిడగారి ముఖం చూచినట్టూ అవుతుందని, స్నానంచేసి నామాలు తీవిగాపెట్టి, పెళ్ళికి వరుసగా మూడుదినాలు నిరాహార దీక్షవహించి తండ్రి గారితో పేచీ పెట్టించి కుట్టించుకొన్న సిల్కు—

---

వాడికి నామోషి అనిపించింది. వీళ్ళందరు చెడ్డవాళ్ళే. వీళ్ళందరి దగ్గర ఉండకూడదు-రమాయే మంచిది. తనకు మొన్న తీపి ఆప్యాయంగా పిలిచిపెట్టింది. అసలు వీళ్ళందరిదగ్గర ఉండకూడదు అని లేచాడు అక్క మంచంమీద నుంచి.-అమ్మకు వేసిన మంచము దగ్గరకు వెళ్లాడు. వేసిన పక్కను అవతలకు జరిపి కాళ్లకాటిదగ్గర తల వంచుకు కూర్చున్నాడు-

పరుగెత్తుతున్న పుచ్చల చంద్రుడు మబ్బుల చాటుకు వెళ్లాడు- ఒక్క తడవ అంతా చీకటి ఆవరించింది. ★

చోక్కా ధరించి....మోతగా అత్తవారియింటికి బయలు దేరాడు.

మధ్యదారిలో ఎక్కడయినా ఆలస్యముచేశాడేమో - అత్త వారింటికి వెళ్ళేటప్పటికి, వాళ్ళ భోజనాలన్నీ అయినాయి. మామగారు అప్పటికప్పుడే పట్టీబిగించారు. మనరాఘవాచారి గుమ్మంలో అడుగు పెట్టగానే, కాళ్లుకడుక్కోటానికి చెంబూ నీళ్లూఇచ్చి భోజనానికి లేవమన్నారు.

మన ఆచారి మొహమాటం చెప్పానుగా - "మామగారు వారూ భోజనాలు చేశారు. మళ్ళీ మన కోసం ఆడవాళ్లు అన్నం వండాలి, పాపంవాళ్ళని కష్టపెట్టడమెందుకూ" అనుకొని "భోజనముచేసే బయలుదేరా"నన్నాడు మన ఆచారి. ఆచారి చిన్నబావమరిది "అప్పుడే దరిదాపు పదకొండు కావస్తోంది. బావభోజనము చేసే బయలుదేరాడేమో" అన్నాడు యధాలాపంగా.

"ఒకసారి భోజనము చేశానన్నాను, చిన్నబావమరది, భోజనము చేసేబయలు దేరానన్కొంటూన్నాడు, ఇప్పుడు భోజనము చేయలేదనడము బాగుండదు" అనుకొని మనరాఘవాచారి, అత్తవారు భోజనానికి లేవమని రెండుమూడు సార్లన్నా, "చేసివచ్చానని" చేసివచ్చినవాడిలాగే కూర్చున్నాడు కడుపు ఓమూల కాల్తున్నా—

పాపం. మధ్యాహ్నం. 3గం॥లయింది. ఆచారి ఆకలి బాధకు ఆగలేకపోయాడు. అతని కడుపు అప్పడములావుంది. అతని అవస్థ ఏమని చెప్పనూ?

కాని భోజనము చేయలేదనడానికి మొహమాటము. అతని ఆకలిబాధఅంతకంతకు అధికమయింది. చిట్టచివరకు అతనికి ఏమీ తోచలేదు మడతమంచము మీద పడుకొని మేలుకొలుపులు పాడడము మొదలు బెట్టాడు.

ఆచారి బావమరది మిట్టమధ్యాహ్నము మూడుగంటల వేళ బావగారు మేలు కొలుపులు పాడడము చూచేసరికి నవ్వొచ్చింది.

"ఏమోయి, బావా, ఏమిటీ మిట్ట మధ్యాహ్నము, ఈ మేలుకొలుపులు" అన్నాడు వేళాకోళంగా.

మన ఆచారిది సామాన్యపు బుర్రా-పరగడుపున ఎప్పుడు పాడితే ఏమిటోయి అన్నాడు లౌక్యంగా.

"ఏమిటీ నీకింకా పరగడుపా? భోజనము చేయలేదూ?" అన్నాడు ఆచారి బావమరది.

మన రాఘవాచారి మాట్లాడితేగా? బావమరిది తెల్లబోయి "ఎంత పనిచేశావోయి బావా, నీ మొహమాటం చల్లగుండా, భోజనానికి లేవోయి" అని మన రాఘవాచారి చేయిపట్టుకొని వంటింటిలోకి తీసుకొని వెళ్లాడు. దానితో మన ఆచారి ప్రాణం తేరుకొంది.

★



బాల విజ్ఞానం:

# తేనెటీగల విచిత్ర జీవితం

"పాపాయిలూ! మీఅందరికి "తేనె" అంటే భలేయిష్టం కదూ? అది తేనెటీగల నుంచి వస్తూ ఉన్న దన్న సంగతి మీ అందరకూ తెలిసిందే" కానీ వాటి జీవితం చూస్తే చాలవిచిత్రంగా ఉంటుంది. చెబుతా వినండి.

"తేనె పట్టు, చెట్టు కొమ్మలకు గానీ, "తొర్ర"లకుగానీ, పెట్టటం మీరందరూ చూసే ఉంటారు. తేనెటీగలు పట్టుకి సుమారు,30 లేక, 40 వేలు వరకూ ఉంటవి. ఇవి "మైనం" తోటి యిళ్లు కట్టుకు ంటాయి. ఎందుకంటే మరి, పాపం! అవి మనలాగ, ఇటుకల తోటి, సిమెంటుతోటీ ఇళ్లు కట్టుకోలేవుగా?

తేనె టీగల్లో "రాణి ఈగ" "మగఈగ," (లేక సోమరి ఈగ,) "కూలీఈగ!" అని మూడు రకాలుఉంటాయి. పట్టుకంతటికి రాణి ఈగతల్లివంటిది. అన్నిటికన్న పెద్దది కూడా!, ఇదిపట్టుకి ఒకటి మాత్రమే ఉంటుంది. గుడ్లు పెట్టే రోజుల్లో ఇదిరోజుకి 3,000 గుడ్లు పెడుతుంది- యిక "మగ ఈగ" ల మాట చూద్దాం. పట్టుకి 400, నుంచి,800, వరకూ ఉంటాయి. ఇవి ఏమిపని చెయ్యవు. పట్టులోనుంచి బయటికి కూడ వెళ్లవు! కూలి ఈగలు తెచ్చి పెట్టిన ఆహారాన్ని తిని బ్రతుకుతాయి. రాణిఈగతో కూడి సంతానోత్పత్తి చెయ్యటమే వీటి పని. అందుకనే వీటిని "సోమరి ఈగలు" అనికూడా అంటారు. ఒకొకప్పుడు పట్టులో ఆహారంఅయిపోతే, కూలి ఈగలు వీటిని చంపేస్తాయి! మగ ఈగలకు కుట్టుముళ్లు లేవు-

ఇప్పుడు "కూలి ఈగ"లమాట ఆలోచిద్దాం? పాపం ఇవి పేరుకు తగ్గట్టే ఎప్పుడూ కష్టపడి, పని చేస్తాయి. ఇవే మైనం తోటి ఇల్లు (పట్టు) నిర్మిస్తాయి. 15 పా॥ తేనె త్రాగితేగాని ఒక పౌను మైనంరాదు. అందుకని యివి తేనె(మకరందమును) ఎక్కువగా త్రాగుతాయి. పువ్వుల్లో నుంచి "మకరందాన్ని" "పుష్పొడిని" తెచ్చిపట్టులోని ఈగలకు ఆహారంగాపెడతాయి. వీటికి పువ్వుల్లోనుంచి మకరందాన్ని పీల్చడానికి పొడవయిన నాలుకలు, పుప్పొడి తేవటానికి వెనుక కాళ్లకు "సంచులు" ఉంటాయి. రాణిఈగ పెట్టిన గుడ్లనుపొదిగి పిల్లలు చేసి పెంచుతవి. ఆత్మరక్షణ కోసంవీటికి కుట్టే సాధనాలు (ముళ్లు) ఉంటాయి. పట్టుదగ్గరకు వెడితే మనలను కుట్టేవి ఈ ఈగలే.

రాణీఈగ గదికి ఒక గుడ్డు చొప్పున పెడుతుంది. ఇవి కూలి ఈగలచేత పొదగబడి పిల్లలవుతవి. వీటిని "లార్వాలు" అంటారు. అవి ఏడురోజుల కల్లా "ప్యూపాలు"గా మారుతవి. వాటికి కూలి ఈగలు. పుప్పొడి మకరందము కలిపి ఆహారంగా పెడతాయి. తరువాత కొన్ని రోజులకి వాటి గదులు మైనంతో మూసివేస్తవి. తరువాత 12 రోజులకు తేనెటీగలుగా మారి బయటకి వస్తాయి. అందులో కొన్ని మగ ఈగలు, కూలి ఈగలుగా మారుతవి. కూలి ఈగలు ప్రత్యేకముగా, ఒకపిల్లకు "రాయల్ జెల్లీ" అనే ఆహారాన్ని పెడతాయి. అది. "రాణిఈగ"గా మారుతుంది!

ఇలాగ క్రొత్త రాణి పట్టులో ఏర్పడగానే దీనివయిపు కొన్ని మగఈగలు, కూలి ఈగలు చేరుతవి. పాతరాణి వయిపు కూడా కొన్ని మగ, కూలి ఈగలు చేరుతవి. అప్పుడు, ఈ రెండు "సంఘముల"కు యుద్ధంజరుగుతుంది! గెలిచినవి ఆరాణితో ఆపట్టు లోనే ఉంటాయి. ఓడిపోయినవి తమ రాణితో "పట్టు వదలి వేరొకచోట నివాసం ఏర్పరచుకొంటాయి దీనినే "ముసురుకొనుట" అంటారు. ఇలానే ప్రతీ సంవత్సరం క్రొత్త సంఘాలు, ఏర్పరుచుకొని జీవిస్తాయి.

చూచారా పాపలు! వీటి జీవితం ఎంత విచిత్రంగా ఉందో? ★

"సత్యం"



అనగా అనగా ఒక గుఱ్ఱంవుంది. అది వయస్సులో వుండగా తన యజమానికి ఎంతో పనిచేసిపెట్టింది. రోజులు అలాగే నిలబడి వుండవుగా! కొంతకాలానికి అది ముసలిదై ఏపనీ చేయలేనిస్థితి కొచ్చింది. అందుచే దానియజమాని "నీకు మేత, నీరు పెట్టి పోషిస్తుంటే నీవు నాకు ఏపనీ చేసి పెట్టలేక పోతున్నావు. ఇక నీవు నా ఇంటినుండి వెళ్ళిపో, లేదా నీవు ఎలాగైనాసింహాన్ని గూడా ఈడ్చుకు రాగలశక్తి సంపాదించుకొస్తే మళ్ళీ రానిస్తాను" అన్నాడు. గుఱ్ఱం ఏంచేయ గలుగుతుంది చెప్పండి?

గుఱ్ఱం విచారంతో అలా నడచి నడచి ఒక అడవి చేరుకుంది. అక్కడ ఒక నక్క కన్పించి "ఎందుకలావిచారిస్తున్నావ్? అని ప్రశ్నించింది. అందుకు గుఱ్ఱం "నాకు ముసలితనంవచ్చి ఏపనీ చెయ్యలేక పోతున్నానని నాయజమాని ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. మళ్ళీ సింహాన్ని గూడా ఈడ్చుకురాగల శక్తి సంపాదించుకొని వస్తే రానిస్తానన్నాడు" అని చెప్పింది.

పాపం! నక్కకు దానిపై చాలా జాలివేసి "సరే నీవు ఇక్కడే వుండు. నిన్ను మళ్ళీ నీయజమాని రానిచ్చేందుకు ఒక వుపాయం ఆలోచించాను. మళ్ళీ నేను ఇప్పుడేవస్తాను. వచ్చేసరికి కాళ్ళు నిగడదన్ని, పొట్టను వుబికించి చచ్చినట్టు పడివుండు. ఇక తర్వాత పని నేను చూసుకుంటా" అని ఆ నక్క గుహలోనే వుంటున్న ఒక సింహం దగ్గరికి బయలుదేరింది.

నక్క వచ్చేసరికి సింహం "ఏం వచ్చావని ప్రశ్నించింది. అప్పుడు నక్క "అడవిరాజా మనఅడవిలోనే ఒక చెట్టుక్రింద మంచిగుఱ్ఱం చచ్చి పడిపోయి వుంది. మరిదానిని తెచ్చుకొని ఫలహారం చేస్తారేమోనని చెప్పటానికి వచ్చాను" అంది. సింహం సరే పదఅని దాని వెంబడే చెట్టు దగ్గర కొచ్చింది.

అక్కడ గుఱ్ఱం నక్క చెప్పినట్లు చచ్చిన విధంగా పడివుంది. అప్పుడు సింహం నక్కతో "దీనిని నాగుహకు ఎలా తీసికెళ్ళటం? అని ప్రశ్నించింది. అందుకు నక్క "తమతోకకు, గుఱ్ఱంతోకకు కలిపి ముడివేస్తాను. ఇక మీరు సులభంగా ఈడ్చుకెళ్ళవచ్చు" అంది.

పాపం! ఆ అమాయక సింహం నిజమేనని నమ్మింది. 'సరే అలాగే ముడివేయమని' దానితోకను గుఱ్ఱం తోకకు అనించింది. ఇక నక్క ఆ రెండు తోకలకు గట్టిగాముడివేసి వెంటనే గుఱ్ఱాన్ని 'లేచి నీయజమాని ఇంటికి పారిపో' అని బిగ్గరగా కేకవేసింది. ఇక గుఱ్ఱం అడవిలో పుట్టల మీదుగాను, రాయి రప్పల

(43-వ పేజీ చూడండి)



# శక్తినిమించినయుక్తి

శ్రీ రంగనాదం

దక్షిణదేశంలో ఒక పల్లెటూరు వుంది. దానిలో దగ్గర దగ్గర వెయ్యి గడపవుంటుంది. అందులో మూడువంతులు రైతు ప్రజలు. మిగిలినవారు తక్కిన వృత్తులవారు. ఆపల్లెప్రజలు ధనధాన్యాదులకు లోటులేక పాడిపంటలతో హాయిగా కాలక్షేపము చేస్తున్నారు. గోసంపద జాస్తిగావుండటంవల్ల వర్షాలు కురవకపోయినా పశువుల పాలుపోసి పంటలు పండిస్తామని గర్వపడుతున్నారా పల్లె ప్రజలు. ఆ పల్లెకు కొద్ది దూరంలోనే ఒక అడవివుంది. పల్లెలోని పశువులన్నిటి పచ్చికకూ ఆ అడవే ఆధారము.

ఇల్లావుండగా ఆ అడవిలోకి ఎక్కడినుండో ఒక పెద్దరాక్షసుడు చేరి ప్రతిరోజూ పశువులను చంపి తినేస్తూండే వాడు. అతనికి ఆహారం పుష్కలంగా దొరకడంవల్ల ఆ అడవిలోనే వున్న ఒక కొండ గుహాలో వాసము ఏర్పరుచుకొని స్థిరపడి పోయాడు. ఆ పల్లె ప్రజలు ముందు ఏపులో, సింహమో, అడవిలో చేరివుంటుందీ, ఆ దేపశువులను తినేస్తూంది అనుకున్నారు. ఒక నాడు పశువులు ఆడవికి రాక పోవడంవల్ల ఆ రాక్షసుడికి ఎక్కడా, ఆహారం దొరకక ఆకలితో అడవంతా తిరిగి, తిరిగి విసిగి పోయాడు. చివరకి ఒక కొండయెక్కి ఎక్కడన్నా ఆహారము దొరుకుతుందేమోనని నాల్గువైపులా దృష్టి సారించి చూశాడు. అతని దృష్టిలో ఈ పల్లెతప్ప యింకెక్కడా కనుచూపు మేరలో పల్లెకాని, ఆహారంకాని కనబడక పోవడంవల్ల ఆ రాక్షసుడు ఈ పల్లెమీద పడ్డాడు. ప్రజలంతా అతని ఆకారాన్ని చూచి భయపడి ఎవరిండ్లలో వారు దూరి తలుపులు బిగించుకున్నారు. రాక్షసుడంటే పెద్ద పర్వతములా వుంటాడు. అంచేత అతని నెదిరించి పోట్లాడగల సమర్థుడెవడుంటాడు? ఆ రాక్షసుడు తనకు దొరికిన పశువుల నెత్తుకొని తన నివాసం చేరుకున్నాక, ఆ పల్లె ప్రజలంతావచ్చి ఒకపెద్ద సభచేసి చర్చ ప్రారంభించారు. ఆ రాక్షసు బారినుండి తప్పించు

కోడానికి ఈవూరువిడిచిపెట్టిపోవడం మంచిదని కొందరన్నారు. కొందరు ఆరాక్షసుడువచ్చి వూరిమీద పడి నానాభీభత్సంచేయకుండా, పూర్వం బకాసురునకు భక్ష్య మిచ్చినట్లు రోజూభక్ష్యంయివ్వడానికి అతనితో సంధిచేసుకోవడము మంచిదన్నారు. వేరే గత్యంతరము లేక, అతన్ని జయించేదారి తెలియక, అట్లా అన్నారు. కాని, మరివెళ్లి ఆ రాక్షసుని ఒప్పించగల సమర్థు లెవరని అడిగారు శాస్త్రిలుగారు. ఇక్కడే వచ్చింది పెద్దచిక్కు. పిల్లికి మెడలో గంట ఎవరు కడతారన్న సమస్యలా వచ్చింది యిది కూడ. ఎవరి మట్టుకువారు కళ్లు తేల వేశారు.

అంతలో అక్కడే వున్న పల్లె పెద్ద అవధానిగారబ్బాయి విజయుడు "నేనువెళ్లివస్తాను. నన్ను పంపండి. నేనుసమాధానపరచడమే కాదు, అతనిని జయించికూడా వస్తానన్నాడు. ఆసభలో వున్న పెద్దలు కొందరు చిన్న పిల్లల మాటలిట్లానే వుంటాయిలే అని నవ్వుకున్నారు. మరికొంత మంది ఆ ధైర్యపుమాటలకు మెచ్చుకున్నారు. కాని ఎవరూ అతడు నిజంగా రాక్షసుడి దగ్గరకు వెళ్లాలనే వుద్దేశంతో మాట్లాడుతున్నాడనుకోలేదు. అందరికీ తెలుసు అతని ధైర్యం తెలివి తేటలూ! కాని రాక్షసుని జయించడానికి భీముని వలె శక్తి కావాలనుకున్నారు కాని యుక్తిగూడ పనిచేస్తుందని ఎవరి బుర్రకీతట్ట లేదు. అందువల్లఅంతా అతనిమాటలను లెక్క చేయకుండా మౌనం వహించి ఎవరి మట్టుకువారు ఆలోచనలో మునిగిపోయారు. అది చూచి విజయుడు "నామాటలు మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. జానెడు కుర్రాడు, కత్తియుద్ధమైనా చేతగాదు. యుద్ధమంటే జడుసుకునే కులములో పుట్టినవాడు. ఎట్లా రాక్షసుని జయిస్తాడూ అని, ఏదో పసితనపు పలుకులని మీరు నిరసిస్తున్నారు. మీరు పంపకపోయినప్పటికీ నేను వెళ్ళేదివెళ్ళేదే అని తండ్రిదగ్గరకు వచ్చి "నాన్నా నన్ను ఆశీర్వదించి పంపు. నీయాశీర్వాదబలమే నాకు వజ్రకవచము. నీవు భయపడకు. రాక్షసుని శక్తి ఎటువంటిదో చివర వరకు చూసి వస్తాను." అంటూ నమస్కరించాడు.

"వద్దునాయనా! వేడి రక్తంలో వున్న వుద్రేకంవల్ల నీవట్లా అంటున్నావు. నీవెక్కడ ఆ రాక్షసుడెక్కడ? ఒక చెంప కొడితే పాలు ఒక చెంప కొడితే రక్తం. నీవు మాకు ఒక్కగాని ఒక్కడవు. నిన్నువిడిచి, మీఅమ్మా నేను ఒక్కక్షణం బ్రతకలేం."

"నాన్నా! ఈ మాత్రానికే యిట్లా బెగిలిపోతే ఎట్లా! మీరు నాయందుండే ప్రేమవల్ల అట్లా అంటున్నారు. మానవ కర్తవ్యం మరచిపోయారు. అదికాక ఆరాక్షసుని జయించడానికి రాక్షసబలమే కావాలనుకుంటున్నారు. కాని బుద్ధిబలం ముందు ఎటువంటి శక్తి కూడా ఎదురు నిలవలేదన్నది మరచి పోయారు. నేను తప్పక జయించగలనని నా అంతరాత్మ ఘోషిస్తూ వుంది. జయించినా, ఓడినా, నాకు శాశ్వతకీర్తి వస్తుంది. తను వులు శాశ్వతం కావు. కీర్తి శాశ్వతం కాబట్టి నన్ను సంకోచించక దీవించి పంపండి" అంటూ వయసుకు మించినమాటలూ, కులమునకు తగిన మాటలూ అన్నాడు. కాని కన్న కడుపు తీపివల్ల వద్దంటే వద్దన్నాడు తండ్రి. ఆరోజుకు సభచాలించారు.

రాత్రి పన్నెండు గంటలయింది. విజయుడికి నిద్రపట్టలేదు ఆ రాక్షసుని గురించి ఆలోచనలతో. చివరికి వెళ్లాలని నిశ్చయించుకొని దైవ ప్రార్థనముచేసి తల్లి దండ్రులకు నమస్కరించి అడవికి బయలుదేరాడు. అడవంతా తిరిగి చివరికి రాక్షసుని కొండ గృహానికి వెళ్లాడు. తిన్నగా గుహలో రాక్షసుడు నిద్రపోతున్న దగ్గరకు వెళ్లాడు. అక్కడ మాంసంమురుగు కంపు కొడుతూ వుంది. ఒకప్రక్క పెద్దమంట మండుతూవుంది. రాక్షసుడు గురకలు పెడుతూ నిద్రపోతూ వున్నాడు. విజయుడు దగ్గరకువెళ్లి ఏమాత్రమూ జంకు లేకుండా రాక్షసుణ్ని లేపాడు. రాక్షసుడు కళ్లు నులుపుకుంటూ కోపంతోలేచి ఎదురుగా నిలబడివున్న కుర్రవాణ్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. అతని ధైర్యసాహసాలకు లోపల మెచ్చుకున్నాడు. అదే యింకెవరైనా లేపి వున్నట్లయితే మింగేసేవాడే. కాని చిన్న కుర్రవాడవటంచేత అతనిని కసరడానికికూడ మనసు రాలేదు. చిన్నగా నవ్వి "ఎందుకు నాయనా! వచ్చావ్" అన్నాడు. "ఎందుకా! నిన్ను జయించడానికి.

నీశక్తి పరీక్షించడానికి. నా పల్లెను యిక సురక్షితంగా వుంచడానికి."

ఆమాటలకు రాక్షసునికి నవ్వు వచ్చింది "నీ మాటలు వింటూంటే నాకు నవ్వు వస్తూంది. నీవు నన్ను జయించునంతటి వాడవా! నా బలము శక్తినీకేమి తెలియును" అని గర్వంగా అన్నాడు. "అట్లాఅయితే నీ శక్తి ప్రదర్శించు చూస్తాను. తర్వాత నా శక్తి ప్రదర్శిస్తాను. అప్పుడు ఎవరు బలవంతులో తెలుస్తుంది" అన్నాడు విజయుడు.

అపుడు రాక్షసుడు వెంటనే ఆ చుట్టు పట్లనున్న చెట్లన్నియు పీకి పారేశాడు. పెద్ద, పెద్ద బండలను పిండి చేశాడు. ఇంకా చూడంటూ, సింహంగా మారాడు. తర్వాత, ఎలుగుబంటి, పులిగా మారాడు. తిరిగి నిజస్వరూపము తెచ్చుకొని, "చూశావా! నాశక్తి" అన్నాడు. అపుడు విజయుడు "బాగానేవుంది, నువ్వు అన్నీ భీకర స్వరూపాలే కాని, ముద్దులొలికే రామచిలకలా, పావురములా మారలేవా" అన్నాడు కొంత హేళనగా.

రాక్షసుడు నవ్వి "అదెంత పని, యిదిగో చూడు" అంటూ రామచిలకగా మారి అతని చేతి మీద వ్రాలాడు. వెంటనే విజయుడు, మొలలోని బాకుతీసి, దానిగొంతు కోసేశాడు. దాని గొంతుకోసిన వెంటనే పెద్ద ధ్వని చేసుకొంటూ రాక్షసుని తల ఒకవైపూ, మొండెము ఒకవైపూ పడి పోయాయి. వెంటనే గ్రామము చేరుకునే టప్పటికి తెల్లారింది. అవధానిగారు కొడుకు కన్పించక విచారిస్తున్నారు. ఇంతలో విజయుడు వచ్చాడు. తల్లి దండ్రులు సంతోషించారు. అపుడు విజయుడు తను రాత్రి ఎక్కడకు వెళ్లిందీ, రాక్షసుని ఎట్లా చంపిందీ చెప్పి తన వంటిమీదనున్న రక్తపు మరకలు చూపాడు. నిదర్శనానికి ఆపల్లె ప్రజలందరినీ అడవికి తీసుకు వెళ్లాడు. ఆ రాక్షసుని కళేబరాన్ని చూసి విజయుడ్ని మెచ్చుకున్నారు. ఆనాటినుండి ఆ పల్లె ప్రజలు ఆ పల్లెకు విజయపురమని పేరు పెట్టి సుఖంగా జీవిస్తున్నారు. ★

## నక్క సహాయం

(40-వ పేజీ తరువాయి)

మీదు గాను సింహాన్ని ఈడ్చుకుంటూ పరుగెత్తుతుంటే సింహం ఎంతో పెద్ద, పెద్ద కేకలువేయుటం మొదలెట్టింది. దాని జుట్టు గుఱ్ఱం చేతిలో చిక్కినప్పుడు అలా ఎంత కేకలు వేస్తే మాత్రం ఏం లాభం చెప్పండి? సింహం అలా అరచిఅరచి ప్రాణాలు వదిలింది. గుఱ్ఱం ఎలాగైతే నేం ఆ చనిపోయిన సింహాన్ని తన యజమాని ఇంటికి ఈడ్చుకు వచ్చి వాకిటిముందు నిలబడింది.

యజమాని అప్పుడే బయటికొస్తూ తన ముసలి గుఱ్ఱాన్ని చూసి చాలా ఆశ్చర్య పోయాడు. అప్పుడు గుఱ్ఱంతో "నీవు సింహాన్ని ఈడ్చగల శక్తి సంపాదించుకు రమ్మంటే సింహాన్ని ఈడ్చుకొచ్చే చూపించావే. కనుకనాదే తప్పు క్షమించు" అని వేడుకున్నాడు. గుఱ్ఱము క్షమించాను లే అన్నట్లు తల వూపింది. ఇక ఆ రోజునుంచి యజమాని గుఱ్ఱానికి మేత నీరు పెడుతూ తనదగ్గరేవుంచుకున్నాడు.

గుఱ్ఱం మళ్ళీ తన యజమాని ఇంటికి రాగలిగిందంటే, అదంతా నక్క చేసిన సహాయమే గదా! ★

(ఆంగ్లంఆధారం)

## గ్రంథ సమీక్ష

### "పండ్లు"

నాల్గవభాగము

గ్రామసేవా గ్రంథమాల 1. కర్త: శ్రీ గోటేటి జోగిరాజు - ప్రకాశకులు: ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు' పటమట లంక - వెల 5 రూపాయలు.

శ్రీ గోటేటి జోగిరాజుగారు లోగడ రచించిన వ్యవసాయశాస్త్రగ్రంథాలు అందరికీ సుపరిచితములు. ఇప్పుడు వారు వ్రాసిన "పండ్లు" అన్న గ్రంథంలో మామిడి, నారింజ జాతులు తప్ప మిగిలిన ద్విదళ బీజక జాతులను గురించిన మరొక గ్రంథంకూడా వెలువడనున్నదట.

మన దేశంలో ఈనాడున్న ఆహారకొరత తీరాలంటే వ్యవసాయ పద్ధతులలో గొప్ప విప్లవం రావలసి ఉన్నది. వ్యవసాయ పరిజ్ఞానం కూడా ఇంకా విస్తరించవలసి ఉన్నది. ఈనాడు మనం పెంపుచేసుకోవలసిన సంపదలో మొట్టమొదటిది ఆహారం. ఈ ఆహారంలో కూడా ఆహారధాన్యాల తరవాత పేర్కొనదగినవి పళ్లు. కొద్దిదశాబ్దాల క్రితంకంటె ఈనాడు మనం ఎక్కువ పండ్లను పండించి భుజిస్తున్నప్పటికీ మన జాతీయారోగ్యానికి తగినంతగా పండ్లు తినడం లేదు; పళ్లను పండించడం లేదు.

ఈగ్రంథంలో ఇవ్వబడిన శాస్త్ర విషయాలు చాలవరకు మన దేశంలో రకరకాల పండ్లను పండించడానికి తోడ్పడగలదు. మిగిలినది ఇతర దేశాల పండ్లకు సంబంధించినది. అనుబంధంలో వివిధ ఫలాలలో గల ఆహారపదార్థాల ప్రమాణంకూడా ఇవ్వబడి ఉన్నది. పండ్ల వ్యవసాయంలో ఆసక్తిగల వారందరూ తప్పక చదవదగిన గ్రంథం. వ్యవసాయ సూక్ష్మాలు కేవలం అనుభవం ఉన్నవారి వద్దనుంచి గాక గ్రంథాలనుంచి కూడా నేర్చుకోవలసిన ఈయుగంలో శ్రీ జోగిరాజుగారు వరుసగా వ్యవసాయ శాస్త్రగ్రంథాలు ఇప్పటికి 15 ప్రచురించి దేశానికి గొప్పసేవ చేస్తున్నారు.

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

నుంచి చిన్న తెడ్డు పడవ దించబడింది. డాంటీ బల్లచెక్క గెంటేసి పడవవైపుకు ఈదాడు. కాని అతను ఉన్నదనుకున్నంత సత్తువ వాస్తవంగా ఒంటిలో లేదు, బల్లచెక్క ఎంత అమూల్య సహాయం చేసిందో అతను గుర్తించలేదు. చేతులూ కాళ్ళూ బిగబట్టాయి. ఈతవేటు నీరసంగా పడుతోంది. ఆయాసం అధికమయింది. గట్టిగా అరిచాడు. నావికులు మరింత వేగంతో వస్తున్నారు. ఒకడు ఇటాలియన్ భాషలో అన్నాడు: "ఫరవాలేదు ధైర్యం తెచ్చుకో."

ఒక తరంగం అతన్ని నురుగుతో ముంచివేస్తున్న సమయంలో ఈమాట వినపడింది. డాంటే తిరిగి పైకి తేలాడు. మరొకసారి బిగ్గరగా అరిచాడు. మళ్లీ మునిగిపోయాడు. అతని శరీరమే అతనికి బరువై కిందికి దిగలాగుతోంది. ఆఖరుసారి శక్తినంతా వినియోగించి పైకి లేచాడు. పైకి తేలగానే ఒకరు అతని జుట్టు అందుకున్నారు. తరవాత అతని కేదీ వినిపించలేదు. ఏమీ కనిపించలేదు స్పృహ తప్పిపోయింది.

కన్నులు తెరిచి చూసేసరికి డాంటీ ఓడపైన ఉన్నట్లు గ్రహించాడు. మొట్టమొదట అతడు ఓడ ఏ దిక్కుగా వెడుతున్నదో పరికించాడు. ఇఫ్‌కోట దూరంలో వెనక పడిపోయింది. సంతోషంతో ఒక్క కేక పెట్టాడు. కాని నీరసస్థితిలో ఉన్న అతని కేక బాధాజనిత మనుకున్నారు నావికులు. డాంటీ కాళ్లను ఒకడు ఉన్నిగుడ్డతో రుద్దుతున్నాడు. మరొకడు సారకాయబుర్రతో నోటికి కల్లు పట్టిస్తున్నాడు. ఒక వృద్ధ నావికుడు అతన్ని జాలితో పరికిస్తున్నాడు. రేపో మాపో తప్పని దుర్గతిని నేడు తప్పించుకొని, అదే మరొకనికి పట్టినప్పుడు చూస్తే కలిగే భావమే వృద్ధుని ముఖంలో కానవస్తోంది. అతను ఓడ కెప్టెన్. పట్టించిన కల్లుతో డాంటీకి సత్తువ చేరుకుంది. కాళ్లు, చేతులు స్వాధీనంలోకి వచ్చాయి.

"నువ్వెవరు?" అని ప్రశ్నించాడు వృద్ధుడు, వచ్చీరాని ఫ్రెంచిభాషలో.

"నేను మాల్టాద్వీపానికి చెందిన నావికుణ్ణి." అన్నాడు డాంటీ వచ్చీరాని ఇటాలియన్ భాషలో. "సారాయీ, ధాన్యం వేసుకుని సిరక్యూస్‌నుంచి వస్తున్నాం. రాత్రి మార్గియన్ అగ్రం దగ్గి రుంఝగా తుపాను వచ్చింది. పడవ మునిగిపోయింది. అదుగో ఆ గుట్టదగ్గిరే మునిగిపోయింది"

"ఇప్పు డెక్కడనించి వచ్చావ్?"

"ఆ గుట్ట దగ్గిరనించే. నాతోటి నావికులు ముగ్గురూ మునిగిపోయారు. నే నొక్కడినే తప్పించుకున్నా ననుకుంటాను. మీ ఓడ చూసి, రావడానికి ఒక చెక్క పుచ్చుకున్నాను. మీరునన్ను రక్షించారు. మీ ఋణం తీర్చలేనిది. నేను మునిగిపోయేవాడినే. మీలో ఒకరు నన్ను జుట్టు అందుకుని తీసి రక్షించారు."

"నేనే" అన్నాడు ఒకడు, కోరమీసాలు దువ్వుకుంటూ. "సరిగ్గా అదను చూశాను. నువ్వప్పుడు మునిగిపోతున్నావు."

"అవునండి" అన్నాడు డాంటే అతనికి నమస్కరిస్తూ. "ఇంకొకసారి మీకు నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను."

"నిజంగా చెప్పద్దూ" అన్నా డతను. "ముందు జంకాను సుమా! మాసిన గడ్డం, అడుగు పొడుగు పెరిగిన జుట్టు నిన్ను చూస్తే దారిదోపిడిగాడి వనుకున్నాను."

ఇఫ్‌కోటలో నిర్బంధానికి వెళ్ళినదిమొదలు జుట్టు కత్తిరించుకోలేదనీ, గడ్డం గీసుకోలేదనీ డాంటీకి ఇప్పుడు జ్ఞప్తికి వచ్చింది. "అవును" అన్నాడు డాంటీ. "ఒకసారి నేను గండంలో పడినప్పుడు, పదేళ్లపాటు క్షౌరం చేయించుకోనని మొక్కుకున్నాను. ఇవాళతో గడువు తీరిపోయింది. సరిగ్గా గడువు రోజునే మళ్ళీ నీటిగండంనించి నా ప్రాణాలు దక్కాయి."

"ఇప్పు డేం చేస్తావు?" అన్నాడు కెప్టెన్.

"మీ రేం చెయ్యమంటే అదే చేస్తాను. నేను హస్తవాసికల నావికుణ్ని. మొట్టమొదట తగిలే రేవులో నన్ను విడిచిపెట్టండి. సులువుగా ఏ వ్యాపారనౌకలోనో ఉద్యోగం సంపాదించుకోగలను."

"నీకు మధ్యధరాసముద్రం బాగా తెలుసా?"

"ఈ సముద్రంలో నే నెరగని రేవులంటూ లేవు. ఏ రేవుకైనాసరే కళ్లుమూసుకుని వెళ్ళగలను. ఇప్పుడు మీ రెక్కడకెడుతున్నారు?"

"లెగ్ హారన్"

"అయితే ఇన్నిసార్లు చుక్కాని తిప్పుతూ కాలం నష్టపరుచుకుంటున్నా రెందుకు? గాలివాలునే త్వరగా పోవచ్చునే?"

"ఎందుకంటే ఇప్పుడు మేం తిన్నగా రయన్‌ద్వీపానికి వెళ్లాలి."

"అంటే నూటపాతిక అడుగుల్లో చేరగల మన్నమాట."

"చుక్కాని అందుకో. నీ కెంత తెలుసో చూస్తాను" అన్నాడు కెప్టెన్.

యువకుడు లేచి చుక్కానివద్ద చేరాడు. కొంచెం అటూ ఇటూ కదిపి, ఇరుసుదూలంమీద ఏ పాటి మోపు ఉందో చూశాడు. అప్పుడు నావికులకు ఆజ్ఞ ఇచ్చాడు: "తెరచాపల పగ్గాలు అందుకోండి." నలుగురు నావికులు గబగబా అందుకున్నారు. "లోపలికి తిప్పండి. ఊఁ. ఇప్పుడు కట్టండి" అన్నాడు డాంటీ.

ఆ చిన్నఓడ ఈమాటు పెడకు తిరక్కుండా తిన్నగా నడిచింది. మెల్లిగా ద్వీపాన్ని సమీపించింది.

"బలే" అన్నాడు కెప్టెన్.

"బలే" అన్నారు నావికులంతా. ఇంత చురుకు, ఇంత తెలివి చూపిన యువకుని ఆశ్చర్యంతో, ప్రశంసాభావంతో చూశారు నావికులు.

"చూశారా!" అన్నాడు డాంటీ చుక్కాని విడిచిపెట్టి. "ఈ ప్రయాణంలో నావల్ల కొంతైనా ప్రయోజనం ఉండకపోదు. లెగ్ హారన్ వెళ్లినతరవాత చూడండి. నావల్ల ఉపయోగం ఉంటుందనుకుంటే నన్ను ఉంచవచ్చు. లేదనుకుంటే అక్కడే నన్ను విడిచిపెట్టెయ్యవచ్చు. అక్కడ ఉద్యోగం సంపాదించుకుంటాను. అప్పుడు నా మొదటినెల జీతంతో, ఇప్పుడు మీరు నాకు పెడుతున్న తిండికీ బట్టలకీ డబ్బు చెల్లించుకుంటాను. మీకు ఎవరేనా ఒకటే. ఇంకొకరి కిచ్చేదే నాకూ ఇస్తే, ఖాయమే."

"అబ్బె అదేం న్యాయం?" అన్నాడు డాంటీని రక్షించిన నావికుడు "నీకు మాకంటే చాలా తెలుసు."

"ఈ వ్యవహారంలో నీ జోక్య మేమిటోయ్? జకోపో, మధ్య నీ కెందుకు?" అన్నాడు కెప్టెన్. "ఎవరు కోరినంత జీతానికి వాళ్లు ఉంటారు. ముందుగా నీకో టొకటీ, రెండు పంట్లాములూ ఇతని కిస్తే చాల్లే. నీ కింకో జత ఉంటేనే ఇయ్యి."

"లేదు" అన్నాడు జకోపో. "కాని నాదగ్గిర ఒక చొక్కా పంట్లాం ఉన్నాయి."

"అవి చాలు నాకు" అన్నాడు డాంటీ.

జకోపో ఇట్టే వెళ్ళి దుస్తులు తెచ్చాడు. డాంటీ వాటిని ధరించాడు.

"ఇంకేమైనా కావాలా?" అని అడిగాడు కెప్టెన్.

"ఉంటే కొంచెం రొట్టెముక్క, మరి కొంచెం కల్లు ఇవ్వండి. ఈమాదిరి కల్లురుచిచూసి చాల రోజులయింది."

డాంటీకి బ్రాందీ తెచ్చియిచ్చారు. జకోపో సొరకాయ బుర్ర ఇచ్చాడు. అందులో బ్రాందీ పోసుకుని డాంటీ తాగబోతున్న సమయంలో, "ఆగండి. ఏమిటది? ఇఫ్‌కోటలో ఏదో జరుగుతున్నట్టుంది" అన్నాడు కెప్టెన్.

ఇఫ్‌కోట దక్షిణదుర్గం సమీపంలో తెల్లని పొగ లేచింది. మరుక్షణంలో ఫిరంగిధ్వని అస్పష్టంగా వినపడింది. నావికు లొకరి ముఖా లొకరు చూసుకున్నారు.

"దీ నర్థ మేమిటి?" అన్నాడు కెప్టెన్.

"రాత్రి ఖైదీ లెవరో పారిపోయుంటారు. ఫిరంగి పేల్చి అందర్నీ హెచ్చరిస్తున్నారు" అన్నాడు డాంటీ.

కెప్టెన్ యువకుని పరికించాడు. యువకుడీ మాటలు చెప్పి దొన్నె ఎత్తి బ్రాందీ తాగేశాడు. అతని నిశ్చలభావం, సంతృప్తి గమనించిన కెప్టెన్‌కి, మనస్సులో తోచిన అనుమానం నివృత్తి అయింది.

అలసిపోయిన మిషతో డాంటీ చుక్కానిదగ్గర కూర్చోనివ్వమని కోరాడు. అక్కడ నావికుడు కెప్టెన్‌వంక చూశాడు... కెప్టెన్ కనుసంజ్ఞ చూసి, అతను చుక్కాని యువకుని చేతి కిచ్చాడు. డాంటీ ఇప్పుడు మార్సేల్స్‌వంక దృష్టి నిగిడ్చాడు.

"ఇవాళ ఎన్నో తారీఖు?" అని అడిగాడు డాంటీ, దగ్గర చేరిన జకోపోను చూసి. ఇఫ్‌కోట క్రమంగా కంటికి కనిపించకుండా దూరమైపోతోంది.

"ఫిబ్రవరి 28."

"ఏ సంవత్సరం?"

"ఏ సంవత్సరమా? తెలియదూ? అరే! ఇది, 1829"

అంటే డాంటీ అరెస్టయి ఈ రోజుకి సరిగ్గా పధ్నాలుగేళ్లు గడిచాయన్నమాట! అతను ఇఫ్‌కోటలో ప్రవేశించినప్పుడు వయస్సు పందొమ్మిది. ఇప్పు డతనికి 33 ఏళ్లు! విచారభరితమైన చిరునవ్వొకటి డాంటీముఖంలో ద్యోతకమయింది. ఈ దీర్ఘ కాలంలో మర్సిడా ఏమయుంటుంది? అనుకున్నాడు డాంటీ. బహుశా తను చనిపోయి ఉంటాడనుకుంటుంది. ఇంత క్రూర నిర్బంధానికి కారకులైన ముగ్గురు వ్యక్తులూ జ్ఞప్తికిరాగానే, అతనికన్నులు చిరచిర లాడాయి. కారాగారంలో ఉండగా డాంగ్లర్, ఫెర్నాండో, విల్‌ఫర్ట్‌లపైన పగతీర్చుకోవాలని తీసుకున్న ఘోర ప్రతిజ్ఞను తిరిగి ఇప్పుడు డాంటీ ఉచ్చరించాడు. ఇదింక నిరర్థకమైన క్రోధ ప్రకటన కాదు. ఇది వాస్తవం. ఎంత వేగంతో ఏ నౌక వచ్చినాసరే మధ్యధరాసముద్రంలో ఈ జినోవానౌక నెవరూ అందుకోలేరు. నౌక లెగ్‌హారన్‌దిశగా పరుగుతీస్తోంది.

# 22

డాంటీ అక్రమవ్యాపారుల నౌకలో ఉన్నాడని గ్రహించడం కష్టంకాలేదు. నౌకపేరు జూన్‌ఎమిలీ. కెప్టెన్ మొదటనుంచీ అనుమానంతో ఉన్నాడు. ఈ కెప్టెన్‌సంగతి తీరంలో కస్టమ్స్ అధికారులందరికీ తెలుసును. ఇతనికీ వారికీ మధ్య జరిగే ప్రచ్ఛన్న సంఘర్షణవల, ఈ అక్రమవ్యాపారాన్ని కనిపెట్టడానికి డాంటీనివారే పంపి ఉంచవచ్చుననుకున్నాడు. ఈ రహస్యాల్ని తెలుసుకోడానికి ఉప్పుపన్ను అధికారులు అన్నిరకాల తంత్రాలూ పన్నుతారు. కానిడాంటీ అప్రమత్తతవల్లనూ, సహృదయతవల్లనూ కెప్టెన్‌కి క్రమంగా అనుమానం తొలగిపోయింది.

డాంటీకి కెప్టెన్ రహస్యాలన్నీ తెలుసును. కాని కెప్టెన్‌కి డాంటీచరిత్ర తెలియదు. కెప్టెన్ కాని, ఇతర నావికులు కాని, ఎన్ని విధాల అతన్నిగురించి తెలుసుకోవాలని ప్రయత్నించినా, డాంటీ తన రహస్యాన్ని భద్రంగా దాచుకోగలిగాడు. ఈ రేవులన్నీ ఇదివరలో డాంటీకి కొట్టిన పిండి. అందువల్ల ఎంతసేపూ మాల్టాగురించీ, నేపుల్స్‌గురించీ కాని ఇతర విషయాలు మాట్లాడేవాడు కాడు. మొదట చెప్పిన కథను మరిచిపోకుండా నిలుపుకుంటూ వచ్చాడు. చివరికి నౌక లెగ్‌హారన్ చేరింది.

ఇప్పుడు డాంటీకి మరొక పరీక్ష ప్రారంభమయింది. పధ్నాలుగేళ్ల క్రిందట చూసుకున్న ముఖాన్ని ఇప్పుడు అద్దంలో చూసుకుని గుర్తుపట్టగలడా? యువకుడుగా అతని ప్రతిబింబం అతనికి చక్కగా గుర్తే. పూర్ణవికాసం పొందిన పురుషుడై ఇప్పుడెలా ఉంటాడో అద్దంలో చూడాలి.

లెగ్‌హారన్ చేరగానే డాంటీ ఒక క్షౌరశాలకు దారితీశాడు. ఇతని జుట్టూ గడ్డమూ చూసి మంగలి నిర్ఘాంతపోయాడు. కాని మాట్లాడకుండా పనికి ఉపక్రమించాడు.

పూర్తయినతరవాత డాంటీ గడ్డం తడుముకున్నాడు. అద్దం తెప్పించుకుని సవిమర్శగా చూశాడు. ఇఫ్‌కోటకి వెళ్లేముందు అతనిముఖం గుండ్రంగా ఉండేది. అమాయకత్వం, అకారణానందం ఆ ముఖంలో ఉట్టిపడేవి. జీవితంలో తొలిఘట్టాలు సులువుగా తేలిపోయాయి. భవిష్యత్తు కూడా అదేవిధంగా ఉంటుందనే భావంతో ఉండేవాడు. కాని ఇప్పుడంతా మారిపోయింది. ముఖం చిక్కిపొడుగ్గా కోలగా ఉన్నట్లు కనిపించింది. నవ్వుతున్న ముఖం తే దిప్పుడు. పెదవులు బిగిసి దృఢనిశ్చయాన్నీ, పట్టుదలనూ సూచిస్తున్నాయి. నుదురు ముడతలు పడుతోంది. కళ్లు గాఢవేదనను, విషాదాన్ని దాచుకున్నట్లున్నాయి. అప్పుడప్పు డానుదుటిపైన రౌద్రరేఖలు, మానవజాతిపట్ల ద్వేషభావం ప్రకటించే కారుచాయలు గోచరిస్తున్నాయి. ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. నల్లని జుట్టూ, తెల్లని ముఖమూ ఒక అందాన్ని చేకూర్చుతున్నాయి.

డాంటీ ఆర్జించిన విజ్ఞానం, విద్య అతని ముఖాని కొకవికాసం, కాంతి ఇస్తున్నాయి. శరీరంలో కొత్తపటుత్వం పుట్టినట్లుంది. సన్నగా నాజూకుగాఉండే చేతులు, కండలు తేరి గుండ్రనైనాయి. ప్రార్థనలు, ఆక్రందనలవల్లకాబోలు అతని కంఠస్వరం పూర్తిగా మారిపోయింది. మధ్య మధ్య కర్కశమైన ధ్వని వినవచ్చినప్పటికీ, మార్దవ మొకటి అబ్బింది. అభ్యాసవశంవల్ల అతని కన్నులు చీకటిలోకూడ చూడగల తీక్ష్ణత, తోడేలు కన్నులలోని చురుకుతనం అపాదింప చేసుకున్నాయి.

ప్రతిబింబం చూసుకుని డాంటీ చిరునవ్వు నవ్వుకున్నాడు. ఎంతటి ప్రాణమిత్రుడైనాసరే అతన్ని గుర్తుపట్టడం అసాధ్యం. అతన్ని అతనే గుర్తుపట్టలేక పోతున్నాడు.

డాంటీని తన నౌకలోనే ఉంచుకోవాలని కోరుకున్న కెప్టెన్, రాగల లాభంలో పాలుపరంగా కొంత ధనం ముందే ఇచ్చాడు. డాంటీ అంగీకరించాడు. ఇప్పు డా ధనంతో, డాంటీ తెల్లని పంట్లాము, చారల చొక్కా, టోపీ కొన్నాడు. కొత్త దుస్తులు ధరించి, జకోపో ఇచ్చిన దుస్తుల్ని చేత పట్టుకుని, డాంటీ జూన్ ఎమిలీ కెప్టెన్‌వద్దకు వెళ్లాడు. కెప్టెన్ డాంటీని మొదట గుర్తుపట్టలేదు. తరవాత యువకుని పోల్చి సంతోషంతో పొంగిపోయాడు. శాశ్వతంగా తన నౌకలో ఉద్యోగమిస్తా నన్నాడు. కాని

మూడు మాసాలపాటు మాత్రమే పని చెయ్యడానికి డాంటే ఒప్పుకున్నాడు.

జూన్ ఎమిలీ చురుగ్గా ప్రయాణం చెయ్యగలదు. కెప్టెన్ కాలాన్ని వ్యర్థపుచ్చడు. లెగ్‌హారన్‌లో ఆ నౌక వారం రోజులైనా ఉండలేదు. రంగురంగుల వస్త్రం, పొగాకు మొదలైన సరుకుతో ఓడ నింపి బయలుదేరారు. పన్నులు వసూలుచేసే అధికారులకు తెలియకుండా సరుకు ఓడెక్కింది. లెగ్‌హారన్‌నించి బయలుదేరి కార్సికా వెళ్ళాలి. అక్కడనించి ఈ సరుకుని ఫ్రాన్స్‌కు రవానా చెయ్యడానికి కొందరు వ్యాపారు లున్నారు. నౌక కార్సికా దిశగా పయనిస్తోంది.

మరునాడు కెప్టెన్ మామూలువేళకి డెక్ మీదికి వచ్చాడు. డాంటే పైగుంజ నానుకొని దూరాన నీరెండలో మెరుస్తున్న నల్లని కొండను వింతగా పరిశీలిస్తున్నట్లు కెప్టెన్ చూశాడు. అది మాంట్ క్రిస్టో ద్వీపం. దాదాపు మైలుమారంలో ఉంది. ఆ ద్వీపం దరినుంచి నౌక ప్రయాణిస్తుండగా, సముద్రంలోకి దుమికినట్లయితే, అరగంటలో అక్కడికి చేరవచ్చునని డాంటేకి తోచింది. కాని తవ్వడానికి పరికరాలుగాని, ఆత్మరక్షణకు ఆయుధాలు కాని లేకుండా ఏం చెయ్యగలడు ? నావికు లేమంటారు? కెప్టెన్ ఏమనుకుంటాడు? అలా కాదు. కొన్నాళ్ళు నిరీక్షించాలి. నిరీక్షించడం డాంటేకి అనుభవమే. స్వేచ్ఛకోసం పద్నాలుగేళ్లు నిరీక్షించాడు. ఇప్పుడు స్వేచ్ఛ లభించిన తరవాత, భాగ్యంకోసం ఆరుమాసాలూ, కాకపోతే ఏడాదీ నిరీక్షించగలడు.

రాత్రి పడుతోంది. క్రమక్రమంగా మారుతున్న సంధ్యాకాంతులలో మాంట్ క్రిస్టో ద్వీపాన్ని డాంటే చూశాడు. డాంటే చూపులు చీకటిలోకూడా ఆద్వీపాన్ని చూడగలుగుతున్నాయి. రాత్రి అందరికంటె ఆఖరున డెక్ దిగివచ్చినవాడు డాంటే.

మరుచటి ఉదయం నౌక ఆల్జీరియాతీర సమీపంలో ఉంది. రోజంతా నౌకగమనం మార్చుకుంటూ వెళ్లారు. సాయంసమయమయేసరికి, తీరంపైన ఒకచోట రెండు మంటలు కనిపించాయి. ఓడపై జండా తీసేసి అక్కడ ఒక దీపం పెట్టి మెల్లిగా తీరాన్ని సమీపించారు. తీరంనుంచి తుపాకిబారుదూరంలో ఓడ ఆగింది. నాలుగు చిన్నపడవలు ఓడవద్దకు చేరాయి. ఓడలో సరుకు తొట్టిద్వారం తెరవబడింది. గప్‌చుప్‌గా పని జరిగిపోయింది. రెండు గంటలయేసరికి నౌకలోని సరుకంతా నాలుగు పడవల్లోకీ ఎక్కింది. పడవలు సరుకుని తీరం చేర్చాయి. తరవాత నౌక సార్డినియాద్వీపముఖంగా ప్రయాణం చేసింది. అక్కడ మళ్లీ రహస్యంగా సరుకు వేసుకుంది. హవానా చుట్టలూ, ద్రాక్షసారాయీ లక్కా రాజ్యానికి తీసుకువెళ్ళాలి. అయితే ఉప్పుపన్ను అధికారులతో తగువు పడకుండా పోలేదు. ఒకణ్ని కొట్టి డెక్ మీద పడేశారు. డాంటేకి మరొక నావికునికీ గాయాలు తగిలాయి. డాంటేభుజాన్ని దూసుకుపోయిన తుపాకి గుండు గాయం చేసింది. డాంటే తన శౌర్యప్రదర్శనానికి పొంగిపోయాడు.

ప్రమాదాన్నీ, శారీరకబాధనీ ఎంత నిర్లక్ష్యంతో పరిగణించగలడో ఇప్పుడతనికి తెలిసివచ్చింది. గాయపడిన పన్ను అధికారుల్ని చూసి అతనికి జాలికూడా కలగలేదు. దయాదాక్షిణ్యాలు అతనిలో అంతరించాయి. గుండె కరడుగట్టింది. కోరిన మార్గాన్ని డాంటే అనుసరించగలుగుతున్నాడు. వైరభావం అతన్ని మార్చివేసింది. గాయపడి కింద పడిపోయిన డాంటేని చూసి భయపడి జకోపో పరుగెత్తుకువచ్చాడు ప్రాణమిత్రునివలె డాంటేకి పరిచర్య చెయ్యనారంభించాడు. కాని డాంటేకి తగిలిన గాయం అంత పెద్దది కాదు. సార్డినియాలో వృద్ధ స్త్రీలు అమ్మిన మూలికలు తెచ్చి చికిత్స చేశారు. గాయం త్వరలోనే నయమయింది.

ఈ ప్రయాణాలలో రెండున్నర మాసాలు గడిచింది. డాంటే నూరు స్పానిష్ డాలర్లు నిలవచేసుకున్నాడు. మాంట్ క్రిస్టోద్వీపం ప్రక్కగా అటూఇటూ ఇరవైసార్లు ప్రయాణంచేసి ఉంటాడు. కాని అక్కడ దిగడాని కెప్పుడూ అవకాశం లభించలేదు. చిట్టచివరికి, నౌకలో మూడుమాసాల ఉద్యోగపు గడువు పూర్తికాగానే, స్వయంగా ఒకచిన్న పడవకొని ఏదో ఒక మిషతో మాంట్ క్రిస్టోద్వీపం వెళ్లి పరిశోధించాలని నిశ్చయానికొచ్చాడు. అన్యోపాయాలవల్ల ఎలాగైనా ఆ ద్వీపంలో దిగాలని అనేకమార్లు అనేకమార్గాలు తలపోశాడు కాని ఏదీ సక్రమంగా కనిపించలేదు. ఇలా ఎటూ నిశ్చయం చేసుకోలేకుండా ఉన్న సమయంలో, ఒకరోజున కెప్టెన్ అతన్ని సాదరణంగా పిలిచి, లెగ్‌హారన్‌లో ఒక హోటల్‌కి తీసుకువెళ్లాడు. డాంటేని ఎలాగైనా నౌకలో శాశ్వతంగా నియమించాలని కెప్టెన్ కోరిక. అక్రమ వ్యాపారం సాగించే వారందరూ చేరే ఆహోటల్లో ఒక ముఖ్యమైన విషయం చర్చించబడింది. టర్కీనుంచి తివాసీలు, కాశ్మీర్ శాలువలు, లెవాంట్‌నుంచి కొంత సరకు వేసుకురావాలి. ఏదేశపు ప్రభుత్వాధికారులకూ అందనిచోటు చూడా లిప్పుడు. అటువంటి చోటైతే సరుకు మార్పిడికి అనుకూలంగా ఉంటుంది. అక్కడనించి సరుకుని స్వయంగా ఫ్రాన్స్‌తీరానికి తీసుకువెళ్లవచ్చును. మాంట్ క్రిస్టో ద్వీపం ఇందుకు అనుకూలంగా ఉంటుందని జూన్ ఎమిలీ కెప్టెన్ అన్నాడు. అక్కడ జనసంచారం అసలు లేదు. అందువల్ల ప్రభుత్వాధికారులు కాని సిపాయిలు కాని ఎవరూ అక్కడికి రారు.

మాంట్ క్రిస్టో పేరు వినగానే డాంటే ఆనందానికి మేర లేకపోయింది. పరవశుడైనాడు. అది తెలియనివ్వకుండా కప్పిపుచ్చుకోడానికి లేచి అటూ ఇటూ పచారుచెయ్యడం మొదలుపెట్టాడు. హోటల్లో అనేకభాషల మాండలికాలు వినపడుతున్నాయి. డాంటే మళ్ళీ కెప్టెన్ దగ్గర చేరేసరికి, మరుచటిరాత్రే ప్రయాణం కట్టడానికీ, మాంట్ క్రిస్టో ద్వీపంలో దిగడానికీ నిర్ణయమయింది.



# అరాచకానికి ప్రోద్బలం

(3-వ పేజీ తరువాయి)

భీతితో; కల్లోలం సంభవిస్తుందని బెదిరించి, కార్యసాధన చేసుకోడానికి మంత్రులు తంత్రం పన్నుతున్నారు. బ్రాహ్మణేతర విద్యార్థులు చదువులలో పో. చెయ్యగలరనే విశ్వాసం మంత్రులకు లేకపోవడంకంటె వేరే దుర్దశం లేదు. వాస్తవంగా బ్రాహ్మణేతర విద్యార్థులికి ఆత్మవిశ్వాసం లేదా ? లేక ఈ మిషపై మంత్రులు రాజకీయ స్వప్రయోజనాలు సాధించుకోడానికి యత్నిస్తున్నారా? తాము కోరిన రాజ్యాంగ నియమ సవరణ రాష్ట్రేతరులకు సమ్మతం కాబోదని మద్రాసు మంత్రులకు తెలుసును. (ఇతర రాష్ట్రా) లన్నిటిలోనూ బ్రాహ్మణులూ, బ్రాహ్మణేతరులూ అనే విభేదాలున్నప్పటికీ, చదువులూ ఉద్యోగాలలో కులవిచక్షణ పాటించవలసిన అవసరం వారికి కలగలేదు) అందువల్ల కల్లోలం వస్తుందని సాకుచెప్పి మంత్రులు ఆత్మవిశ్వాస లోపాన్ని ప్రకటించుకుంటున్నారు.



# ★ సాహిత్య సింహావలోకనం ★

[ఈ శీర్షికక్రింద మాకు అనుకొన్నన్ని లేఖలు రాలేదు. ఇవి పరీక్షరోజులు కనుక విద్యార్థులు చాలా మంది రాయజాలక పోయినా రని ఒక లేఖకుడు వ్రాస్తున్నాడు. అందుచేత తమకు నచ్చిన 1950 రచనలను గురించి వ్రాయదలచినవారు ఏప్రిలు ఆఖరులోగా పంపవచ్చునని మనవి. ఈవారంనుండే పాఠకుల లేఖలను వరుసగా ప్రకటిస్తున్నాము —సం.]

తెలుగులోకి తర్జుమా అయిన ఎల్లీస్ రచనలు:—

'సిగ్గు', 'ఋతు ధర్మాలు'. వీటిని తెలుగులోకి అనువదించినది 'క్రాంతి నాథ్'. 'సిగ్గు' అనే శీర్షికక్రింద (అభిసారిక 1950 సంచికలలో) సిగ్గు, దాని పరిణామము, దాని స్వభావమును గురించి విపులంగా చర్చించ బడినది. 'ఋతు ధర్మాలు' అనే శీర్షికక్రింద బహిష్టును గూర్చి, ప్రకృతి విస్తరణను గూర్చి చర్చించబడినది. దీనివలన ఇంగ్లీషురాని అనేకమంది ఆంధ్రపాఠకులు *Sex* ను గురించి మహామేధావి 'ఎల్లీస్' వ్రాసిన రచనలను చదవగల్గారు.

కథలు

నేను 1950 సం॥లో చదివిన కథలలో 'అభిసారిక'లో ప్రచురింపబడిన "కుళ్లు సరుకు" అనేది చాలా బాగున్నది. దానిని వ్రాసినది 'బ్రూ' అనుసరణ 'చిన్నా'. దీనిలో సిఫిలిస్ అనే సుఖరోగమువలన ఎవరికి వారే కాకుండా జాతి అంతయూ ఏవిధంగా బాధపడుతుంటేదీ చాలా విపులంగా కథ రూపంలో వ్రాయబడ్డది. అటువంటి ఉపయోగకరమైన కథను తెనిగించి ఆంధ్రులకు సమర్పించిన 'చిన్నా'ను అభినందించవచ్చు. రెండవది 'దర్భారాంషా' తెలుగులోనికి అనువదించిన 'మాల్వా'. దీని రచయిత ప్రఖ్యాతిపొందిన 'గోర్కి'. ఒక స్త్రీ కోసం అవివేకంతో తండ్రీ, కొడుకూ తగవులాడుకోటం, చివరకు ఇద్దర్నీ నిరాశ నింపి ఆమె వెళ్ళిపోవటం. ఈ కథ చాలా బాగున్నది రాంషాకూడా దానిని చక్కని భాషలో వ్రాశారు.

నేను 1950 సం॥ చదివిన వాటిలో 'గర్భనిరోధం' అనే పుస్తకం ఒకటి. దీనిని రచించినది 'లైంగికానంద్'. ఇది 1950 సం॥లోనే ప్రింట్ అయి వచ్చినది. ఈ పుస్తకములో గర్భంరాకుండా ఏవిధంగా ప్రవర్తించవలసినదీ, ఏ పద్ధతి వలన ఎంతవరకు ఫలితముంటేది విపులంగా చర్చించబడ్డది. ప్రస్తుతం తిండికరువై; జనాభాను తగ్గించుకోజూచే ప్రతివ్యక్తికీ ప్రభుత్వానికికూడా చాలా ఉపయోగపడే పుస్తకం.

'డియర్'
చేబ్రోలు.

* * *

సెప్టెంబరు "భారతి" లో "హిత (శ్రీ)" రచించిన "ఎత్తు పల్లాలు" అను కథానిక ప్రచురింపబడినది. ఇందులోని భావములు సున్నితములై, ఉన్నతమై యున్నవి. ఇందులో రచయిత కలలమాదిరిగ భాగ్యవంతులకు తాము బీదల యెడల చేయుచున్న అపరాధమును తెలియజేసినాడు. ఇందలి రచనాపద్ధతి ఇతరులకు (ధనవంతుల) మనస్సునకు కష్టము కల్గించకుండ అతి సున్నితమై యున్నది. ఇందలి వ్యక్తి బీదస్థితిలో ఉన్నపుడు అతనికున్న భావములు, ధన మార్జించిన తరువాత అతని భావములలో కలుగు మార్పులు రమ్యముగా చూపించబడినది, మొత్తం మీఁద ఇది ఈ సంవత్సరపు ఉత్తమ కథానికగా పేర్కొనవచ్చును.

సెప్టెంబరు 15 తేదీన తెలుగు "స్వతంత్ర"లో కొండేపూడి సూర్యనారాయణరాజుగారు రచియించిన "మనిషీ-కుక్కా" అను కథానిక ప్రచురింపబడినది. ఇందు రచయిత కొందరు ప్రత్యేకమైన వ్యక్తులకుండు సహజ భావములను చూపించియున్నాడు. ఎన్ని సైకాలజీ పుస్తకములను చదివినను, ఆడవారి, సైకాలజీ అర్థం కాదని రచయిత సూచించాడు.

—ఎస్. వెంకట రామారావు.

# పాతాళభైరవి

(24-వ పేజీ తరువాయి)

లోని భయంకరమార్గాలు, మొసలిమడుగూ, పాతాళభైరవి ఆలయమూ, బ్రహ్మాండమైన విగ్రహమూ, రాజప్రాసాదాలూ, పుష్పోద్యానమూ, మకరతోరణమూ, మాయామహలూ పర్వతశ్రేణులూ తయారయాయి.

చిత్రం మొదటినుంచి చివరిదాకా సీనిక్ రైల్వే ప్రయాణంలాగా ఒక్క క్షణంకూడా నీరసంలో పడకుండా సాగిపోతుంది. ప్రతిపాత్రా, ప్రతిసన్నివేశమూ, ప్రతిసంభాషణా, దుస్తులూ, వాతావరణమూ— సమస్తమూ ఇంకోయుగంనాటి వాతావరణాన్ని సూచిస్తాయి గాని వర్తమానాన్ని జ్ఞప్తికి రానివ్వవు. చిత్రం చెవులకూ కన్నులకూ సమంగా పని కల్పిస్తుంది. ఇందులో వినేదెంత ఉన్నదో, చూసేదీ అంత ఉన్నది. ఒకటికిరెండుసార్లు చూసినా గిట్టింపు అయే విషయాలున్న కొద్ది చిత్రాలలో "పాతాళభైరవి" ఒకటి.

చిత్రంలో ప్రధానాంశం పరాక్రమం— తోటరాముడి పరాక్రమం. ఈ చిత్రంలో కథావస్తువు చేయబడిన పరాక్రమం కేవలం వ్యక్తిప్రాధాన్యత కలది కాదు— సాంఘిక ప్రయోజనం కలది. తోటరాముడు మొదట్లోనే ప్రజాశత్రువైన రాజుగారి బావమరిదిని తంతాడు. ఆపైన రాజుగారి ఎదట తలవంచ నిరాకరిస్తాడు. మీదుమిక్కిలి రాజుకుమార్తెను ప్రేమించ సాహసిస్తాడు. ఈ నాటి పరిభాషలో తోటరాముడి పరాక్రమం సాంఘిక విప్లవ బీజాలతో కూడుకున్నది. అది మామూలు రాజకీయశక్తుల పరీక్షకు నిలబడినఅనంతరం అమానుషమాయాశక్తుల పరీక్షకు గురిఅవుతుంది. అదంతా జానపద కల్పన.

సాధారణంగా జానపదచిత్రాలలోకి ఇంద్రజాలికులనూ, మాంత్రికులనూ, మునీశ్వరులనూ తెచ్చి వారి ప్రభావంచేత కథలోకి చేరిన చిక్కును ఇట్టే విప్పించటం చూస్తూఉంటాం. ఈ చిత్రంలో అది లేదు. ఆఖరుకు మాంత్రికుడూ తోటరాముడూ ఒకరినొకరు ఎదిరి నిలబడిన క్షణాన ఇద్దరి మాయాశక్తులూ ఎడంగా ఉంచబడ్డాయి. కనీసం ఇద్దరూ చెరొక కత్తి అయినాపట్టుకోరు. వారిద్దరిమధ్యా ఆధిక్యం నిర్ణయించేది కేవలం వారి శరీరబలాలే. జానపదచిత్రాలలో ఇది సాధారణ కథనం. ఆకారణంచేత ప్రజలను మరింత ప్రబలంగా ఆకర్షించవచ్చు. అభిరుచి గలవారిని తప్పక మెప్పిస్తుంది.

చిత్రంలోని పాత్రలన్నిటిలోకీ బలమైన పాత్ర నేపాళమాంత్రికుడిది. మన కున్న జానపద సాహిత్యంలో ఈ నేపాళమాంత్రికుణ్ణి మించినపాత్ర మాయలఫకీరు ఒక్కడే ఉన్నాడు. మాయలఫకీరు కొత్త శక్తులకోసం బయలుదేరడు. వాడివద్ద అన్ని శక్తులూ అదివరకే ఉన్నాయి. వాణ్ణి భుజబలంతో ఎవరూ జయించలేరు. వాడిప్రాణంఎక్కడో సప్తసముద్రాలవతల అనేకరక్షుల మధ్య పంజరంలోని చిలుకకంఠంలో దాగి ఉన్నది. అందుచేతనే వాణ్ణి నిర్జించటానికి బాలవర్ధిరాజు గండభేరుండ పక్షులసహాయం పొందవలిసి వచ్చింది. వాటి పిల్లల్ని రక్షించటానికి చచ్చిబతకవలిసి వచ్చింది. నేపాళమాంత్రికుడు మాయలఫకీరుకన్న ఒకమెట్టు కింద ఉండటం అద్భుతరసానికి తరుగైనా పాత్రపోషణకిమాత్రం చాలా మేలుగయింది.

"పాతాళభైరవి" చిత్రంలోని మిగిలిన పాత్రల సృష్టిలో సమగ్రత అంతో ఇంతో లోపించిందని చెప్పవచ్చు. కథా పరిణామంపై ఆయాపాత్రల ప్రభావం తక్కువగా ఉండటమే దీనికి కారణం కావచ్చు. రాజూ రాజుకూతురూ, రాజుభార్యా, బావమరిదీ మొదలైనపాత్రలు వాతావరణంలో లీనమవుతున్నట్టుంటాయి గాని తమ వ్యక్తిత్వాన్ని గట్టిగా ప్రతిష్ఠించుకోవు. తోటమాలి రాముడూ, రాజు బావమరిది సీనూ కొంతనయం. రాజకుమార్తె పాత్ర బొత్తిగా స్తబ్ధగా చిత్రించబడింది.

నటనదృష్ట్యా చూసినా మాంత్రికుడి పాత్ర ధరించిన రంగారావు తన పాత్రను అతిసమర్థతతో పోషించి దానికి ప్రాణం పోశాడు. తెలుగుచిత్రాలలో ఇంత సమర్థమైన పాత్రనిర్వహణ లేదని చెప్పవచ్చు. తోటరాముడుగా ఎన్. టి. రామారావూ, సీనుగా రేలంగీ తమ పాత్రలను చాలా బాగా పోషించారు. తోటమాలి తల్లిగా సురభి కమలా, అంజిగా బాలకృష్ణా, సదాజపుడుగా పద్మనాభం బాగా రాణించారు. రాజూ రాణీ పాత్రలను ధరించిన సి. ఎస్. ఆర్. హేమలతమ్మరావుగార్లు సమర్థులైన నటులైఉండికూడా తగినంతగా రాణించలేదు.

కే. వి. రెడ్డిగారి డైరెక్షను నిర్దుష్టంగా, నిండుగా ఉన్నది గాని అందులో జీవమూ, స్ఫురణా తక్కువ. పాత్రలన్నీ రాణించకపోవటానికి ఇదొక కారణం కావచ్చు. మంచి దర్శకుడు స్థూలమైన సన్నివేశాల పట్ల చూపే శ్రద్ధే సూక్ష్మమైన కదలికలపైనా చూపి ప్రతిదృశ్యమూ, ప్రతిపాత్రా సజీవంగా ఉండేటట్లు చేయాలి. ఈ విషయంలో అచ్చు డైరెక్షనే చాని పక్షాన కథకుడి సహాయంకూడా పుచ్చుకోవాలి. విజయావారి తొలిచిత్రం "షావుకారు" లో ఏ ఒక్క పాత్రా ప్రేక్షకులను తాకకుండా పోలేదు; నోరు విప్పి మాట్లాడిన ఏ ఒక్క పాత్రా వాతావరణంలో లీనమైపోలేదు. కాని "పాతాళభైరవి" లో ఇటువంటి పాత్రలున్నాయి. బాక్సాఫీసు కొలతబద్దకు ఇది అడ్డువస్తుందని కాదు. సినిమా కళాభిలాషులకు దీనివల్ల పరిపూర్ణ సంతృప్తి లేకుండాపోతుంది. అంతే.

ఘంటసాల సంగీతదర్శకత్వం బాగా ఉంది. ఘంటసాలా, లీలా కలిసి పాడిన పాటలు చిరకాలం ప్రేక్షకుల చెవులలో మోగుతాయి.

బార్ట్లీ ఫొటోగ్రఫీ మొత్తమ్మీద చాలా బాగుంది. కొన్నిచోట్ల చాలా భావగర్భితంగానూ, ఉదాత్తంగానూ ఉన్నది.

పారిశ్రామిక కళాదృష్టిలో "పాతాళభైరవి" ఒక అనుపమానమైన, ఆకర్షవంతమైన సృష్టి అని ఒప్పుకుతీరాలి.

"ప్రేక్షకుడు" ★




(5-వ పేజీ తరువాయి)

—హైదరాబాద్ రాజ్యంలో అసాఫియా సివిల్ ప్రొసీజర్ కోడ్, అసాఫియా క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ల స్థానే నేటి నుంచి భారత ప్రభుత్వపు సివిల్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్లు అమలు జరుపబడుతున్నాయి.

—రాజస్థాన్, పంజాబ్ సంస్థానాలు, మధ్యభారత్, సౌరాష్ట్ర దేశాల సంస్థాన సైనికదళాలు భారతసైన్యంలోకి లీనం చెయ్యబడినవి.

## సవరణ

గతవారం డైరీలో ఆదివారం, 1951 మార్చి 18 వార్తలలో, "ఆస్ట్రేలియాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని పడగొట్టడానికి జరిగిన ఒక కుట్ర" కి బదులు "ఆస్ట్రేలియాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటానికి జరిగిన ఒక కుట్ర" అని చదువుకోవాలి.



Regd· No. M. 4479

# ఆంధ్రపత్రిక

## ఉగాది సంచిక

మనోజ్ఞమైన ముఖచిత్రము
ఖరసంవత్సర పంచాంగము
విషయ సమగ్రమైన ప్రస్తావన
విజ్ఞానప్రదమైన వ్యాసములు
ఆధునిక కవుల పద్యరచనలు
రసవంతమైన కథలు
త్రివర్ణ చిత్రములు
ఏకవర్ణ చిత్రములు
ఛాయాపటములు

కలిగి, సంచిక సర్వాంగసుందరముగ వెలువడినది

డెమ్మీ క్వార్టోసైజున 250 పుటలు

**వెల రు. 2 లు మాత్రమే**

మీ సమీపమునగల 'ఆంధ్రపత్రిక' ఏజంటువద్ద గాని, మాకు వ్రాసి గాని వెంటనే మీ ప్రతిని రిజర్వు చేసికొనండి.

పోస్టు ద్వారా పంపుటకు ప్యాకింగు, పోస్టేజీలకు అ. 9 లు అదనము.

---

మానేజరు:

**ఆంధ్రపత్రిక**

పోస్టుబాక్సు నెం. 212, మద్రాసు.

Edited, Printed & Published by S. Sambhu Prasad .at the Andhra Patrika Press, 7, Thambu Chetty St. Madras.